# భాషణములు 201

నిత్యమూ, అత్యంత దగ్గరదీ అయిన ఆత్మను ఎందుకు తెలిసికోలేమో తెలిపే ఉదాహరణలు ఇమ్మని ఆ పార్సీ వనితలు అడిగేరు.

మహర్షి వారికి కథలను సూచించారు 1. “స్వకంఠాభరణం యథా” (మెడలోని హారాన్ని మరచి, దానికై ఊరంతా వెదకటం), 2. “పదవవాని వలె” (పదిమంది మూర్ఖులు, ప్రతివాడూ తన్ను విడిచి యితరుల తొమ్మండుగురినే లెక్కించి పదవవాడు తప్పిపోయాడని భావించిన విధంగా), 3. మేకల మందలో పెరిగిన సింహపు పిల్ల కథ 4. నిజమాతాపితల నెరుగని కర్ణుని కథ. 5. బోయల కుటుంబంలో పెరిగిన రాజకుమారుని కథ.

వారు అరవిందుల యోగ విధానము గురించి ప్రశ్నించారు. అరవిందులవారు వైదిక ఋషులకు కూడా అనుభూతములు కాని విషయాల్లోకి చొచ్చుకొని పోగలిగిరనీ, మరియు "మదర్” తమ శిష్యులు ఉపనిషత్తులలో చెప్పబడిన ఋషులఆత్మస్థితిలో మొదలుపెట్టి వానికంటె పై అనుష్టానములను సాగింప నర్హులన్నదనీ తెలిపి, వానిపై మహర్షి యభిప్రాయము అడిగేరు.

మ: అరవిందులు పూర్ణశరణాగతిని చెయ్యమన్నారు. మొదట అలా చేసి, ఫలితాలకై వేచి, ఆపైన అవసరమైతే ఆ విషయం చర్చించవచ్చును, కాని యిప్పుడు కాదు. తమ తమ పరిధులను దాటని వారికి అధ్యాత్మికానుభవముల చర్చలవల్ల ప్రయోజనమేంటి? శరణాగతి ఏంటో నేర్చుకో. అహంకారం మూలంలో విలీనం కావడమే శరణాగతి. అహంకారం ఆత్మకు అర్పించబడాలి. ఆత్మ మూలంగానే మనకన్నీ ఇష్టం. (ఆత్మనస్తు కామాయ సర్వంప్రియం భవతి) అహంకారాన్ని ఆత్మ కర్పించి, బ్రహ్మమును తన యిచ్చానుసారం చేయనీ. అహంకారాన్ని నప్పటికే ఆత్మ కిచ్చివేశాం. దానిపై మనకే హక్కులూ లేవు; ఉన్నా వాని నర్పించి తీరవలసిందే.

భ: దివ్య చైతన్యాన్ని (పైనుండి క్రిందికి) అవతరింపజేయుటేమి?

మ: ఇప్పటికే అది హృదయంలో లేదేం? "ఓయీ అర్జునా! నేను హృదయాకాశమందున్నాను" అన్నాడు శ్రీకృష్ణుడు. ఒక ఉపనిషన్మంత్రం "ఆదిత్యునిలోని యతడే యీ నరునియందునూ ఉన్నా"డని తెలుపుతున్నది. “దైవరాజ్యము లోన నున్నది" అంటుంది బైబిల్. ఇట్లు దైవము, లోన నున్నాడనడం సర్వమత సమ్మతము. క్రిందికి తేవడం, దేనిని ఎక్కడినుండి, ఎవరా తెచ్చేది, ఎందుకు?

నిత్యము, అంతస్థమునైన సత్యాన్ని గుర్తించనీయక అడ్డుకొనే వానిని తొలగద్రోయటమే ఆత్మసిద్ధి. సత్యవస్తువు ఉన్నది. దానిని ఒకచోటనుంచి మరొకచోటికి తీసుకు పోవాల్సిన పనిలేదు.

భః ఆత్మస్థితిలోనే ప్రారంభించి ఆపై ప్రవృద్ధి అంటారే అరవిందులు.

మ: మొదట ఆత్మసిద్ధి కానీ, ఆ పిమ్మట చూడవచ్చును.

అలాంటివే ఇతర సిద్ధాంతాల గూర్చి మహర్షి ప్రసంగించారు. ఆత్మసిద్ధి మొదట అవుతుందనీ, అదియైన జీవాత్మ పరమాత్మను శరణు జొచ్చునని విశిష్టాద్వైతుల వాదము. అప్పుడే అది పూర్ణమవుతుంది. పూర్ణానికి అంశ అర్పింపబడింది. అదే ముక్తి, సాయుజ్యమదే. సాధారణమైన ఆత్మప్రాప్తి, శుద్ధాత్మను ఏకమును చేయటంలో ఆగిపోతుందని విశిష్టాద్వైతము.

సిద్ధులంటారు - తన దేహాన్ని ప్రేతంగా వదలి వెళ్ళేవాడెవడూ ముక్తుడు కాలేడు. వాడు మళ్ళీ జన్మింపవలసిందే. గగనంలోనో, తేజంలోనో చూపుల కందని తావుల్లోనో తమ దేహము విలీనమైనవాళ్ళే ముక్తులౌతారు. శాంకరాద్వైతులు ఆత్మసిద్ధితో సరియంటారు; అదే అత్యుత్తమమైన స్థితి కాదంటారు సిద్ధులు.

వారి వారికి నచ్చిన సిద్ధాంతమే సర్వోత్తమమనే యితరులూ వున్నారు. కుంభకోణం వెంకటస్వామిరావు, కడప బ్రహ్మానందయోగి అలాంటి వారే.

యథార్థం ఇది - సత్యమున్నది. వాద వివాదాలు దాన్ని అంటవు. మనం సత్యమందే సుస్థిరమయి, దాని స్వభావం గూర్చిన వ్యర్థ చర్చలలో పడకపోతే మంచిది.

## భాషణములు 202

దుఃఖంగా కన్పించే ఒక పంజాబీ వ్యక్తి ఆశ్రమానికి వచ్చాడు. అతడు పూరీ జగన్నాథం దగ్గరలో ఉన్న జాలేశ్వర్లోని శ్రీ కామకోటి పీఠ శంకరాచార్యుల వారిని చూడటం జరిగింది. వారాదేశించారట యిక్కడికి వెళ్ళమని. ఇతడు ప్రపంచ యాటన చేస్తున్నాడు. హఠయోగం కొంత నేర్చాడు. "అహం బ్రహ్మాస్మి" ఒరవడిగా కొంత చింతనా చేశాడు. అంతలో శూన్యం తోచి, తల వేడెక్కి మృత్యు భయం కల్గుతుందట. మహర్షి సలహా కోరాడు.

మహర్షి: ఆ శూన్యాన్నెవరు చూస్తున్నారు?

భ: నేనే నని నాకు తెలుసు.

మ: ఆ శూన్యాన్ని పరికించే చైతన్యమే ఆత్మ.

భ: ఈ జవాబు నాకు తృప్తిగా లేదు. నాకు ఆత్మ అనుభవంలోకి రావడం లేదు.

మ: మృత్యుభీతి, “నేను” భావన వెలివడ్డ తర్వాతనే కలుగుతుంది. మృతి ఎవ్వరికని నీ భయం? ఆ భయం ఎవ్వరికి? అచట ఆత్మ దేహంతో తాదాత్మ్యం చెందుతోంది. అది ఉన్నంత కాలం భయం తప్పదు.

భ: కాని నా కప్పుడు శరీర స్పృహ ఉండడం లేదు.

మ: ఆ స్పృహ లేదనే దెవరు?

భ: నా కర్థం కావటం లేదు.

మహర్షి వాని ధ్యాన పద్ధతిని తెలుపమన్నారు. అతడన్నాడు -- "అహం బ్రహ్మాస్మి" (నేనే బ్రహ్మాను).

మ: 'అహం బ్రహ్మాస్మి' అన్నది ఒక ఆలోచన మాత్రమే. ఆ అనేది ఎవరు? స్వయంగా బ్రహ్మము అలా చెప్పదు గదా! బ్రహ్మము ఇట్లు చెప్పనవసరం లేదు. నిజమైన 'నేను' గూడ అట్లనదు; ఎందుకంటే అది సదాబ్రహ్మ నిష్ఠము గనుక. అలా అనటం గూడ ఆలోచన మాత్రమే. ఆ ఆలోచన ఎవరిది? అన్ని ఆలోచనలకు కారణం ఆ మిథ్యయైన 'నేను', అంటే అహంకారం. ఆలోచించుట మాని ఉండు. ఆలోచనలున్నంతవరకూ భయం తప్పదు.

భ: నేనిట్లు విచారిస్తూ పోతే, ఒక మరుపు వస్తుంది; తల వేడెక్కుతుంది; నాకు భయం కలుగుతుంది.

మ: అవును. మెదడులో మనస్సు ఏకత్రితమై ఉంటుంది. అందుచేత అది వేడెక్కుతుంది. ఆ కావడం 'నేను' భావన వల్లనే. ఆలోచనలు ఉంటే మరపుంటుంది. 'అహం బ్రహ్మాస్మి' యనుకుంటావు; విస్మృతి కలుగుతుంది. “నేను” అనే ఆలోచన వస్తుంది, దానితోనే మృత్యు భీతి కలుగుతుంది. తలపు మరపులు రెండూ "నేను" ఆలోచనలే. దానిని పట్టుకో, అది ఏ దెయ్యంలాగో మాయమౌతుంది. ఆ మిగిలియుండేది నిజమైన 'నేను'; అదే 'ఆత్మ'. 'అహం బ్రహ్మాస్మి' యంటూండటం చిత్తైకాగ్రత కొక సాధనం. అది యితరాలోచనలను రానీయక అడ్డుతుంది. ఆ యొక్క యోచనే స్థిరమౌతుంది. ఆ ఆలోచన ఎవరిదో గమనించు. అది 'నేను'నుంచి జనించడం తెలుస్తుంది. ఈ “నేను” భావన ఎక్కడనుంచి? దాన్ని బాగా వెదకి చూడు. అప్పుడది అదృశ్యమౌతుంది. పరమాత్మ తానై ప్రకాశిస్తుంది. ఆ తరువాత ఏ యత్నమూ అక్కరలేదు.

“నిజమైన నేను" ఒక్కటే నిలిచినప్పుడు, అది 'అహం బ్రహ్మాస్మి'యనదు. ఎవరైనా 'నేను మనిషిని, నేను మనిషి'నని మళ్ళీమళ్ళీ చెప్పుకుంటాడా? ఎవరైనా కాదని దబాయిస్తే, అప్పుడు తాను మనిషినని ఘోషించవలసిన అవసరం. ఎవడైనా తాను పశువునేమో అని భ్రమిస్తాడా, 'నేను పశువును కాను, మనిషినే యని చెప్పుకోవడానికి. బ్రహ్మము లేక ఆత్మ, ఏకము. కనుక కాదనే వారెవ్వరుండరు. 'నేను బ్రహ్మము'నని పలుమార్లు చెప్పుకోవలసిన పని లేదు.

భాషణములు 203

ఢిల్లీ పోస్టల్, టెలిగ్రాఫ్ శాఖలో సెక్రటరీ, శ్రీవర్మ: పాలంటన్ వ్రాసిన గుప్తభారతాన్వేషణ (సర్చ్ ఇన్ సీక్రెట్ ఇండియా), 'గుప్తపంథా (ది సీక్రెట్ పాత్ లను చదివాడు. పదకొండు పండ్రెండేండ్లు సుఖంగా సంసారం గడిపాక భార్య గతించింది. దుఃఖితుడయిన అతడు ఓదార్పు కోరుకున్నాడు. పుస్తకాల్లో అది దొరకలేదు; వాని చింపి పారవేయవలె నన్నంత కోపం. మహర్షిని ప్రశ్న లడగవలెనన్న యోచన కూడ లేదు. సన్నిధిలో ఊరకే కూర్చుని శాంతిని, సాధ్యమైనంతగా పొందాలనుకొన్నాడు.

ఏదో పరంపరలో వలె మహర్షి అప్పుడు కొంత, అప్పుడు కొంతగా ప్రసంగించారు. దాని సారాంశమిట్లు:

భార్యను అర్ధాంగి అంటారు. అందువల్ల ఆమె మృతి చాలా బాధ కలిగిస్తుంది. వాని దృష్టి శరీరపరంగా గనుక, వాని కా బాధ. ఆత్మ దృష్టి కలిగితే అది పోతుంది. బృహదారణ్యకోపనిషత్తులో అన్నారు - "ఆత్మ తనకు తాను ప్రియం గనుక, భార్య ప్రియం అయినది" అని పత్ని, ఆ యితరులూ ఆత్మసదృశు లనుకుంటే, బాధ ఎలా కలుగుతుంది? అట్లయినా ఈ రకమైన పెద్ద కష్టాలు తాత్త్వికులను గూడ కలచివేస్తాయి.

గాఢనిద్రలో అందరూ సుఖులే. అప్పుడు మనం శుద్ధ - ఆత్మగా ఉంటాము. ఈ క్షణం గూడా మన మదే. ఆ నిద్రలో భార్యలేదు. ఆ ఇతరులూ లేరు. ఆ 'నేను'గూడ లేదు. ఇప్పుడు వారెల్లరూ తోచి ఆనందానికి దుఃఖానికి కారణమవుతారు. గాఢనిద్రలోని ఆత్మానందం, ఇప్పుడు గూడ అలాగే ఏల సాగరాదు? అది ఎడతెగక ఉండటానికి ఒకే అడ్డు, ఆత్మ శరీరంతో తప్పుగా తాదాత్మ్యం చెందడం. (దేహాత్మ భావన)

భగవద్గీత అన్నది "లేని దానికి ఉనికి లేదు, నిజం లేకపోవుటెప్పుడూ "లేదు. ఈ రెంటి యాథార్థ్యము వస్తు సారజ్ఞులకు స్పష్టమే”. “నిజమెప్పుడూ నిజమే, కల్ల ఎప్పుడూ కల్లయే". మరోచోట - "అతడు పుట్టలేదు, చావనూ బోడు. ఉండియే ఉన్నాడు గనుక, ఇకపై ఉండక పోవుటయు లేదు. అజాతమూ,నిరతమూ, నిత్యమూ, పురాణమూ అయిన అతడు శరీరము హన్యమైనా, తాను హతుడుగాడు” అందుచేత, “పుట్టువూ లేదు, చావూ లేదు. మెలుకువే పుట్టుట, నిద్రయే చావు.

నీవు ఆఫీసుకు పోయినప్పుడూ, గాఢంగా నిద్రించినపుడూ, భార్య నీ వెంట వున్నదా? నీకు దూరంగా కదా ఉండినది? ఆమె ఎక్కడో ఒకచోట ఉన్నదని నీకు తెలుసు గనుక, నీ తృప్తి కేలాటి భంగమూ కలుగలేదు. ఇప్పుడో ఆమె లేదనుకుంటున్నావు. భేదము, ఆలోచనల భేదంవల్ల. అదీ బాధకు కారణం. భార్యలేమి నెంచుటవల్ల బాధ. ఇదంత

మనస్సుచేసే తుంటరితనం, సుఖ మున్నచోట కూడా వాడు (మనస్సు) దుఃఖం కల్పించుకుంటాడు. కాని సుఖదుఃఖాలు రెండూ మనఃకల్పితాలే.

చనిపోయిన వారికై దుఃఖించు టెందుకు? వాళ్ళు ఈ బంధాల నుండి ముక్తులయ్యేరు. చనిపోయిన వారి గురించి దుఖించడం మనస్సు తయారుచేసే ఒక గొలుసులాంటిది. అది తన్నుతాను చనిపోయిన వాళ్ళతో బంధించు కొంటుంది. పోతే ఏమయింది గనుక "నీవూ పో, నీవూ చనిపో", ఆ రీతిగా చూస్తే మృత్యుబాధ ఉండదు. ఈ విధమైన మృతి కర్థమేమి? దేహముండగానే అహంకార నాశము. అహంకారం మిగిలెనా, మృత్యుభీతి తప్పదు. మరొకరి చావుకు దుఃఖిస్తాడు. కాని తానే ముందుగా చనిపోతే దుఃఖపడ నవసరం లేదు. (అహంకారం అనే కలనుండి మేల్కొనడమే అహం - భావన మరణమన్నమాట) దేహ భావన లేకుంటే సుఖమని, గాఢనిద్రానుభవం తెల్పుతుంది. దేహం పోయిన పిదప అయ్యే విమోచనం గూర్చిన విజ్ఞుల యభిప్రాయం అదే. అందుచేత యోగి దేహ త్యాగం ఎపుడా యని వేచియుంటాడు. పెనుభారాన్ని, సుఖానికైగాక కూలికై మోస్తున్నవాడు గమ్యం చేరగానే బరువు దిగవైచి బరువు తగ్గిందని సంతోషిస్తాడు. అట్లే యోగి తన తనువును మోస్తూ, దాన్ని వీడటానికి సరియైన, విధి నిర్ణీతమైన తరుణం కోసం వేచియుంటాడు. ఆ బరువులో సగం, అర్ధాంగి, ఇప్పుడు తొలగితే నీవు కృతమెరిగి సంతోషించవద్దా?

కాని నీ దృష్టి శారీరకం గనుక నీ వట్లు చేయలేవు.

విదేహముక్తి మొదలైనవి తెలిసినవాళ్ళుకూడా, ఎవరికైతే జ్ఞాన విషయం బాగా తెలిసి ఉండాలో వాళ్ళు కూడా ఈ శరీరంతోపాటు మోక్షం గురించి మాట్లాడతారు. దాన్నేదో ఒక అద్భుత గూఢ శక్తిగా పొగడి, ఈ శరీరాన్ని శాశ్వతంగా బ్రతికించాలని చూస్తారు!

భౌతిక దృష్టి మాని, ఆత్మస్థితుడైతే ఏ బాధా ఉండదు. యథార్థమైన ప్రేమకు దుఃఖించడం ఒక చిహ్నం కాదు. అది విషయమునెడల, రూపము నెడల గల ఆసక్తిని మాత్రమే సూచిస్తుంది. అది ప్రేమ కాదు. నిజమైన ప్రేమకు పాత్రము ఆత్మలోనే యున్నదనీ, ఎప్పుడూ గానీ అది లేకపోవుట లేదన్న దృఢ విశ్వాసమే, నిజమైన ప్రేమ. (యోగ వాసిష్ఠములోని అహల్య- ఇంద్రుల కథను మహర్షి ఇచ్చట ఉదహరించారు.)

ఎంత జెప్పినా అట్టి సమయాలలో బాధ కుపశమనం జ్ఞానులతో సత్సంగం వలనే కలుగుతుంది.

## భాషణములు 204

ఆత్మదీప్తిని (సెల్ఫ్ ఇల్యూమినేషన్) గూర్చి మహర్షి అన్నారు. “నేను”కు సంబంధించిన భావనే అహంకారం. ఆత్మదీప్తి సత్యాత్మ సాక్షాత్కారము. 'అహమహ'మని అది సదా విజ్ఞానమయ కోశంలో ప్రకాశిస్తుంది. అది శుద్ధ జ్ఞానము. సాపేక్ష జ్ఞానము (relative knowledge) కేవలం భావనయే. ఆనందమయ కోశంలోని ఆనందం గూడ భావనే. కొంచెమైనా అనుభవం లేకుంటే 'నేను హాయిగా నిద్రించా"నన్న మాటే రాదు. విజ్ఞానమయ కోశంనుంచే ఆనందమయ కోశం ప్రస్తావన వచ్చేది. నిద్రలోని ఆనందం వ్యక్తి యొక్క భావన మాత్రమే. అది బుద్ధికి సమానము. నిద్రలోని అనుభవ జ్ఞానం అత్యంత సూక్ష్మం. అదే సమయంలో విజ్ఞానం (సాపేక్షజ్ఞానం) లేకుంటే అనుభవం సాధ్యపడదు.

ఆత్మ సహజ స్వభావము ఆనందమే. బ్రహ్మానందానుభవంలో గూడ ఏదో కొంచెం జ్ఞానాన్ని అంగీకరింపవలసే ఉంటుంది. అది సూక్ష్మాతిసూక్ష్మ మనవచ్చు. విజ్ఞానమనే పదం ఆత్మజ్ఞానానికి విషయజ్ఞానానికి గూడ వర్తిస్తుంది. ఆత్మ యన్నది విజ్ఞానం. అది రెండు మార్గాల పనిచేస్తుంది. అహంకారంతో కలిసినపుడది విషయజ్ఞానం (విజ్ఞానం). అహంకారం వర్జించి పారమార్థిక మైనపుడు గూడ దానిని విజ్ఞానమనే అంటారు. ఈ పదం ఒక మనోభావాన్ని కల్గిస్తుంది. అందుకనే ఆత్మజ్ఞుడగు యోగి మానసికంగా తెలుసుకొంటాడనటం. కాని ఆ మనస్సు శుద్ధమైనది. అలాగే చంచల మనస్సు, కల్మషమనీ, స్థిరమైనది శుద్ధమని అంటాము. శుద్ధ మనస్సు తానే బ్రహ్మము; దాని అర్థం బ్రహ్మము. జ్ఞాని మనస్సుకు భిన్నం కాదు.

"బ్రహ్మవిదుడు బ్రహ్మయే అగును" అని ముండకోపనిషత్తులో నొక వాక్యముంది. బ్రహ్మమును తెలిసికొనుట, బ్రహ్మమగుటయే! ఇది అర్ధ రహితంగా లేదూ? ఇవి కేవలం మాటలే. యోగి బ్రహ్మమే అది సరి. అనుభవాన్ని ఒరుల కందచేయటానికి మనఃప్రవృత్తి అవసరము. యోగి అనవచ్ఛిన్న చైతన్యాన్ని చింతిస్తుంటాడట. సృష్టికర్త, సనక, శుకాదులు అట్టి చింతనను కొంచెమైనా వదలరట.

"నిమిషార్ధం నతిష్ఠన్తి వృత్తిం బ్రహ్మమయీం వినా. యథా తిష్ఠన్తి బ్రహ్మాద్యాః సనకాద్యాః శుకాదయః."
- తేజోబిందూపనిషత్ 1-47

ఆ "చింతన లేదా ధ్యానము" అది ఒక పదమే. ధ్యానించువాడు, ధ్యానింపబడునది అనే విభజన లేక ధ్యానించుటెట్లు? అవిభక్తమైతే ధ్యానం అసంభవం. అనంతానికి వృత్తియేమి? నది సముద్రం చేరిన తర్వాత దానిని సముద్రము వంటి నది యంటామా? మరి చింతన అవిరళమైతే దాన్ని అనవచ్ఛిన్నం, అనంతమనడ మెందుకు? ఆ పదాన్ని ఏ ముద్దేశించి వాడామో ఆ ప్రకారం దాన్ని అర్థం చేసుకోవాలి. అది అనంతంలో విలీన మగుటనే తెలుపుతుంది. ఆత్మసాక్షాత్కారంలేదా ఆత్మదీప్తి అటువంటిదే. ఆత్మ ఎప్పుడూ ప్రకాశిస్తోంది. ఈ "నేను-దీప్తి" అంటే ఏమిటి? దాని అర్థమే మనస్సు పని చెయ్యడాన్ని తెలియచేస్తోంది.

దేవతలూ, యోగులూ, వారి దృష్టిని కొంచెంకూడా చెదరనీక అనంతాన్ని నిరంతరంగా సంతతమూ అనుభవిస్తుంటారు. చూచేవారికి వారి మనస్సు కర్మ ప్రవృత్తమనే తోస్తుంది. నిజానికది అట్లు కాదు. చూచేవారి వ్యక్తిత్వ బుద్ధి వారి నట్టి భావనల (Inferences)కు గురి చేస్తుంది. వ్యక్తిత్వ బుద్ధి లేక మనః ప్రవృతి యెట్లు? వ్యక్తిత్వమూ, మనోవృత్తి సమకాలీనాలు, వానిలో నొకటిని విడిచి మరొకటి ఉండదు.

ఆత్మతేజం విజ్ఞానమయ కోశంలోనే గోచరిస్తుంది. కాబట్టి అది విషయపరమైనా, ఆత్మగతమైనా, విజ్ఞానానికీ శుద్ధ చిదాత్మయే ఆధారం.

## భాషణములు 205

కోహెన్ ఊరకే తికమక పడుతున్నాడు. హృదయ స్వభావమేమి? ఆధ్యాత్మిక హృదయానికి స్పందన ఉంటుందా? ఉంటే, ఎలా ఉంటుంది? లేకుంటే, అది మన కింద్రియ గోచర మెట్లౌతుంది?

మహర్షి: ఈ హృదయం శారీరకం గాదు. స్పందనం శారీరానికి. మనం చెప్పేది అధ్యాత్మిక అనుభవాలకు నివాసభూమి. దాన్ని మించి ఇక చెప్పవలసిందేమీ లేదు.

విద్యుదీపాలకు, ఫేన్లకూ, పనిచేసే శక్తినిస్తుంది డైనమో. అలాగే మూలమూ, ఆధ్యమూ అయిన శక్తి, హృదయం స్పందించటానికి ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు కావలసిన శక్తినిస్తుంది.

భ: 'అహ-మహం' స్ఫురణను తెలుసుకోడ మెలాగ?

మ: నిర్విరామంగా వచ్చే 'నేను' స్ఫురణ కేవలం చైతన్యమే.

భ: దాని ఆవిర్భావం మనకు తెలుస్తుందా?

మ: తెలుస్తుంది. కాని చైతన్యమాత్రంగా. నీ విప్పుడూ అదే. శుద్ధచేతస్సును గూర్చి పొరపాటునకు తావులేదు.

భ: ధ్యానస్థానం హృదయమే ఎందుకు కావాలి?

మ: చైతన్యం కోరుకున్నావు కాబట్టి. అది దొరకే దెక్కడ? బయట దొరుకుతుందా? లోపలే అది లభ్యం. అందుకే లోపల చూడమనటం. హృదయం చైతన్యస్థానం. అదే చైతన్యం.

భ: ధ్యానం దేనిపైన చెయ్యాలి.

మ: ధ్యాత ఎవరు? మొదట ఆ ప్రశ్న నడుగు? ధ్యాతగా ఉండు. ధ్యానం చేయవలసిన అవసరం లేదు.

## భాషణములు 206

బి.సి.దాస్, అలహాబాద్ యూనివర్సిటీలో ఫిజిక్స్ లెక్చరర్: ఈ ప్రశ్న అడిగేరు.

భక్తుడు: బుద్ధి పెరగడం, తగ్గడం, మనిషితో పాటే జరుగుతుందా?

మ: బుద్ధి ఎవరిది? మనిషికి బుద్ధి ఒక సాధనం మాత్రమే. (పరికరం మాత్రమే)

భ: సరే, అది వాని మృతి తర్వాత గూడ ఉంటుందా?

మ: అసలు మృతి సంగతి ఆలోచించడం ఎందుకు? నీ నిద్రలో ఏం. జరుగుతుందో చూడు. అందులో నీ అనుభవమేమిటి?

భ: కాని నిద్ర తాత్కాలికం. మృతి అలాకాదే?

మ: రెండు జాగ్రదావస్థల అంతరం లోనిది నిద్ర. అలాగే చావు గూడ రెండు పుట్టువుల మధ్య వున్నది. రెండూ తాత్కాలికమే.

భ: దేహమును వదలిన జీవాత్మ బుద్ధిని తీసుకొని పోతుందా అని నా అర్థం.

మ: జీవాత్మ అంటే దేహం లేనిదనికాదు. దేహాలు వేరు. అది స్థూలదేహం కాకుంటే సూక్ష్మశరీరం కావచ్చు. నిద్రలో, కలలో, పగటి కలలో ఉన్నట్లు, బుద్ధి శరీరాలను మార్చలేదు. బుద్ధిలో మార్పుండదు; దేహాలు ఆయా పరిస్థితులను బట్టి మారుతుంటాయి.

భ: శరీరం వదిలేక అది సూక్ష్మ శరీరమా?

మ: బుద్ధి ఇప్పుడూ సూక్ష్మ శరీరమే.

భ: అది ఎట్లు అవుతుంది?

మ: ఎందుకు కాదు? దేహం పరిమితం, బుద్ధి కాదని నీ ఊహ. అది కొన్ని అంశముల సమష్టి, సూక్ష్మ శరీరం కూడా అలాంటిదే.

భ: బుద్ధి ఒక కోశము కదా?

మ: నిజమే. విజ్ఞానం లేకపోతే, వేరే కోశాన్ని గుర్తించలేము. పంచకోశాలున్నాయని చెప్పేది ఎవరు? ఆ విషయం చెప్పేది బుద్ధే కదా?

## భాషణములు 207

గాఢనిద్ర అద్వైతస్థితి. అక్కడ జీవాత్మ పరమాత్మల వైవిధ్యం నిలువగలదా? నిద్ర అంటే అన్ని భేదాలూ మర్చిపోవడమే. ఇదే ఆనందంగా ఉంటుంది. ఆ ఆనందం కొరకై జనులు తమ తమ శయ్యలనెంత ఓపికతో చక్కబరచుకొంటారో గమనించు. మెత్తని పరుపులు, దిండ్లూ అవి గాఢ నిద్రను చేకూరుస్తాయని, అంటే, మెలకువను అంతరింప చేస్తాయని ఆశ. కాని ఈ మృదు శయ్య గాఢనిద్రలో లెక్కకు రాదు. తాత్పర్యం ఏమంటే, మన సర్వ యత్నాలూ అజ్ఞానం పోగొట్టుటకే గాని, జ్ఞానం సిద్ధించాక వాని ప్రయోజనం లేదు.

భాషణములు 208

ఎవరైనా శరణాగతి చేస్తే చాలు. శరణాగతి అంటే తన ఉనికికి తొలి కారణమేదో దానికి తన్నర్పించుకోవటం. ఆ తొలి కారణం నీకు బాహ్యంగా ఏదో దైవమని, నిన్ను నీవు భ్రాంతిలో పెట్టుకోక. ప్రతి వ్యక్తికి వాని మూలం వానిలోనే ఉంది. దానికే నిన్ను నువ్వు ఇచ్చుకో. అంటే నీ ఆధారాన్ని నీలోనే వెదకి దానిలో లీనం కమ్మని అర్థం. దానికి వెలిగానున్నానని నీ భ్రమ.

అందుచేతే, ఆధార మెక్కడన్నది ప్రశ్న. చక్కెర తన తీపిని తా నెరుగునా, మరెవరో రుచి చూచి ఆనందించవలెనే గాని అని కొందరి వాదన. అట్లే ఏ జీవుడూ పరమాత్మ కాజాలడు. అలా అయితే వానికి బ్రహ్మానందానుభవం సాధ్యం కాదు కదా! బ్రహ్మానందానుభవం కావాలంటే జీవాత్మను పరమాత్మను వేర్వేరుగానే ఉంచాలి అనేది ఒక వాదం.

బాగానే ఉంది, కానీ ఒక ప్రశ్న. దైవం చక్కెరవలె జడమా? పరమానందానికై వ్యక్తిత్వం నిలుపుకొంటూ, మరల శరణాగతి ఎలా సాధ్యం. అంతే కాదు. వారు భగవంతునిలో సాలోక్యం, సామీప్యం సాధించి పరమాత్మను సేవించుకొంటారట. 'సేవ'యన్న మాటకే బ్రహ్మము మోసపోతాడా? అతడంత తెలియని వాడా? వీరి సేవకై కాచుకొని పడియున్నాడా ఏమి? శుద్ధచైతన్య స్వరూపుడైన అతడు ఎదురు తిరిగి, 'నాకు వేరుగా నీ వొకడ వున్నావా? నన్ను సేవిస్తానని చెప్పుకోవడానికి?' అని ప్రశ్నించడా?

అంతేకాక, వారిఊహాలో దేహం వీడిన జీవాత్మ శుద్ధమై, భగవంతునికి అర్హమగు దేహమౌనట. అంటే భగవంతుడు పరమాత్మ, శుద్ధమైన జీవాత్మలన్నీ వాని శరీరము, అవయవాలూ ఆత్మలకు వేరొక ఆత్మ ఉంటుందా? ఆత్మలెన్ని యున్నవేమి? దీనికి జవాబు "జీవాత్మలు చాలా ఉంటాయి. కాని పరమాత్మ ఏకమే అని. అయితే అక్కడ ఆత్మకర్థమేమి? అది శరీరాదులు కాదు; వీని నన్నింటినీ నిరాకరించిన తర్వాత మిగిలేది ఆత్మ అనాలి. అంటే వర్ణించ వీలుకానిదిగా ఆత్మ నెరిగిన పిదపగూడ, వేరొక పరమాత్మ సంస్థితిని ఒప్పుకోవాలి. అయితే దానికి భిన్నమైన వాటినన్నిటినీ వదిలేసి తర్వాత ఆత్మే పరమసత్యమని ఎలా తెలుస్తుంది? అదే సరియైతే, ఆ ఆత్మ అవిభాజ్య మచ్ఛేద్య మన్నారే, అది సత్యం కాదన్నట్లేనా? ఇంత గొడవా ఆ 'ఆత్మ'యన్నపదంతో వచ్చింది. దేహము, ఇంద్రియములూ, మనస్సూ, ప్రాణశక్తి, జీవాత్మ, పరమాత్మ -- అన్నింటికీ ఆ ఒక్క పదాన్నే వాడుతారు. ఆ పదాన్ని ఇంత విపులార్థంగా వాడినందువల్ల, జీవాత్మ, పరమాత్మ తనువనడానికి అవకాశం దొరికింది. 'అర్జునా! నేను ఆత్మను; సర్వభూతాంతర స్థితుడను... (భగవద్గీత 10, 20), సర్వభూతములకునూ ఆత్మనన్నాడే గాని, సర్వభూతాత్మలకునూ ఆత్మ ననలేదు. ఆత్మలో లీనమైన పిదప వ్యక్తిత్వ మెక్కడిది? మూలమే నీవౌతావు; ఆ పైన శరణాగతి యేమి? అర్పణం చేసేదెవరు? దేనిని? భక్తి, జ్ఞాన విచారములంటే ఇదే.

వైష్ణవుల్లో గూడ, నమ్మాళ్వారు ఏమంటారో చూడు; 'నేను' 'నా' అన్న వెలువడరాని చిక్కుల్లో చిక్కుకున్నాను! నన్నెరుగక, నే నెందెందో పరిభ్రమించాను. ఆత్మజ్ఞుడయిన తర్వాత, ఇప్పుడు తెలిసింది, నేనే నీవని, నాది యన్నదిగూడ నీవే యని. చూసావా, ఇట్లు భక్తి, తన్ను తానెరుగుటే. విశిష్టాద్వైతముగూడ దీని నంగీకరిస్తుంది. అట్లిగూడ సాంప్రదాయిక సిద్ధాంతాన్నే పట్టుకొని వ్యక్తులు పరమాత్మలోని భాగములు, అవయవములని పునః పునః చాటుతారు. పరంపరగా వస్తూన్న వారి సిద్ధాంతంలోనూ, జీవాత్మ మొదట శుద్ధమై, ఆ పిదపే పరమాత్మ కర్పించటం; అప్పుడు

అహంకారం నష్టమౌతుంది; మృతి తర్వాత విష్ణులోకానికి పోయి ఆ అనంతుని సన్నిధిలో ఆనందము అనుభవించుటం జరుగుతుంది.

ఆదిమూలం నుండి తాను వేరనడమే పెద్ద నటన; అది చాలక అహం వర్జించి శుద్ధుడైన జీవాత్మ, తర్వాత గూడ వ్యక్తిత్వాన్ని నిలుపుకొని పరమాత్మ సేవానందాన్ని అనుభవించు ననటం మోసము. ఏమి ఈ కపటం? మొదట భగవద్రవ్యాన్ని భుక్తం చేసుకొని, ఆ పైన ఆయన సేవలో ఆనందిస్తామంటూ ఒక నాటకం! అతని కిదంతా ముందే తెలియదా ఏం?

## భాషణములు 209

శ్రీ బి.సి.దాస్, ఫిజిక్స్ లెక్చరర్ ప్రారబ్ధం, పురుషార్థం గురించి అడిగారు:

మహర్షి: ఎవరిదా ఇచ్ఛ? 'నాది'యని నీ వంటావు. కాని స్వేచ్ఛకుగాని, విధికిగాని నీ వతీతుడవు. అదిగా వుండు. ఆ రెంటినీ అధిగమిస్తావు. స్వేచ్ఛచేత విధిని జయించటమంటే అది. విధిని జయించవచ్చు. పూర్వకర్మ ఫలమే, విధి. సాధు సంగం వల్ల దుష్టవాసనలను జయించవచ్చు. అప్పుడే వ్యక్తి తమతమ అనుభవాలను సరిగా అర్థం చేసుకోగలడు.

నేనిప్పుడున్నాను, నేను భోక్తను, నా కర్మఫలము ననుభవిస్తున్నాను. గతంలో వున్నాను, ఇకపై ఉంటాను, ఎవ్వరీ, 'నేను'? అది శుద్ధ చైతన్యం, కర్మలకూ కర్మఫల భోక్తృత్వానికి అందనిది, ఇంత తెలిస్తే ముక్తీ, ఆనందమూ లభిస్తాయి. ఆపైన యత్నమే లేదు. ఆత్మపూర్ణము గనుక దానిపై పొందవలసిందేమీ లేదు.

వ్యక్తిత్వమున్నంతవరకూ ఆ వ్యక్తి, కర్తా, భోక్తానూ. కాని వ్యక్తిత్వం నశిస్తే దైవేచ్ఛ మాత్రమే నిలబడి పరిస్థితులను నడిపిస్తుంది. దైవేచ్ఛను చూడలేని వారికి వ్యక్తి కనిపిస్తాడు. విధి, నిషేధములు జీవన్ముక్తునకు కాదు, మిగిలిన వారికే.

శ్రుతులలోని విధి నిషేధ వాక్యముల ద్వారా పురుషార్థము కలదని తెలుస్తుంది. దాని అంతరార్థం ప్రారబ్ధం అధిగమించటం. దాన్ని విజ్ఞానం సాధిస్తుంది. జ్ఞానాగ్ని సర్వ కల్మషాలను కాల్చివేస్తుంది. సాధు సంగంవల్ల, జ్ఞానము లేదా దానికి తగిన మానసిక వాతావరణం కల్గుతాయి.

## భాషణములు 210

మనిషిలో జరిగే కార్యక్రమాలు వేరొక శక్తి చాలనం వల్లనే జరుగుతున్నాయి. కాని అంతా తనే చేస్తున్నానని వాని ఊహ. కుంటివాడు తన్నెవరైనా లేవదీసి నిల్పితే శత్రువులతో పోరి తరిమికొడ్తానన్నట్లు. కర్మ జరుగుతోంది అంటే కోరిక ఉందని అర్థం. కోరిక, అహంకారం పుట్టేకనే వస్తుంది. ఈ అహంకారం దాని అస్థిత్వము దానికంటే ఉన్నతమైన శక్తి మీద ఆధారపడి వుంది. అహంకారం ఆ శక్తికి భిన్నంగా ఉండలేదు. అలాంటప్పుడు "నేను చేస్తాను, నేను నిర్ణయిస్తున్నాను" అర్థం లేని మాటలెందుకు?

ఆత్మజ్ఞాని ఈ ప్రపంచానికి సహాయం చేయకుండా ఉండలేడు. ఆయన ఉండడమే (ఉనికి) అత్యంత కళ్యాణకరము.

## భాషణములు 211

బి.సి.దాస్: యోగమంటే కలయిక. దేని కలయిక? దేనితో? తెలియడం లేదు.

మహర్షి: అవును, అది అట్లే, యోగం అనడంలోనే తొలుత విభజన, ఆ పైన ఒకదానితో ఒకటి కలయిక సూచితమై యున్నవి. ఎవరు ఎవరితో కలియడం? నీవు కోరుకునేవాడివి. దేనితోనో కలియగోరుతున్నావు. అది నీకు వేరుగా

వుంది. నీ ఆత్మ నీకు సన్నిహితమే. ఆత్మ నీ కెరుకే. దాన్ని వెదకి, అదిగా వుండు. అదే అనంతంగా వ్యాపిస్తుంది. అప్పుడు యోగానికి అవకాశమే ఉండదు. ఆ వియోగము ఎవరితోనో కనుక్కో

భ: రాళ్ళురప్పలు ఎప్పుడూ అలాగే ఉండటం విధి నిర్ణయమా?

మ: రాళ్ళను చూసేదెవరు? నీ ఇంద్రియాలు. అవి నీ మనస్సు వలన ప్రేరేపించబడతాయి. కాబట్టి అవి మనస్సులోనివి. ఎవనిదా మనస్సు? అడిగేవాడు ఈ విషయం కనుగోవలసిందే. ఆత్మను కనుగొంటే, ఆ ప్రశ్నే రాదు.

విషయములకన్నా దగ్గరది ఆత్మ. కర్తను కనుగొంటే విషయములు వాని సంగతి అవి చూసుకొంటాయి. విషయాలను వేర్వేరు వ్యక్తులు, వారివారి దృష్టిని బట్టి పరికిస్తారు. అందువల్లనే అన్నన్ని సిద్ధాంతాలు. కాని ఆ చూసే దెవరు? ఇన్ని సిద్ధాంతాల విజ్ఞాత ఎవరు? నీవేగదా? నిన్ను నీవు - నీ ఆత్మను నీవు - కనుక్కో అప్పుడు మనస్సుకిన్ని విభ్రమలుండవు.

భ: మనస్సంటే ఏమి?

మ: ఆలోచనల మూట.

భ: దాని పుట్టు పెక్కడ?

మ: ఆత్మ చైతన్యం నుండి.

భ: అట్లైతే ఆలోచనలు నిజం కాదన్న మాట.

మ: అవి నిజం కావు. ఆత్మ ఏకైక సత్యం.

## భాషణములు 212

మహర్షి వచించారు: ప్రదక్షిణమంటే "సర్వమూ నాలోనున్నది" అని. అరుణగిరికి ప్రదక్షిణం చేయటం విశ్వప్రదక్షిణ మంత ఫలప్రదమని చెప్పబడింది. అంటే విశ్వానికంతా సారభూత మీ గిరియని అర్థము. అరుణాచల దేవాలయ ప్రదక్షిణం గూడ తుల్యఫలదమే; ఆత్మప్రదక్షిణం ఈ చివరదానికి సమానం. ఇవన్నీ ఆత్మలో ఇమిడియున్నాయి. ఋభుగీతలో ఇలా ఉంది- 'నేను సుస్థిరంగా నిలిచియున్నాను. లెక్కకు మిక్కిలిగా విశ్వాలు, నా మనస్సులో తలపులుగా పరిభ్రమిస్తున్నాయి" ఈ ధ్యానము సర్వోత్తమమైన ప్రదక్షిణము.

## భాషణములు 213

బి.సి.దాస్: ఎన్ని మార్లు యత్నించినా మనస్సు నంతర్ముఖం చేయలేక పోతున్నాను; ఎందువలన?

మహర్షి: అది అభ్యాసంవల్ల, వైరాగ్యం వల్ల క్రమక్రమంగా అలవడుతుంది. మనస్సు ఒక ఆవు. అది ఇతరుల పొలాల్లో దొంగమేత అలవాటుపడినదైతే తన శాలలో సులభంగా కట్టుపడదు. కాపరి దానికెంతో పచ్చిగడ్డి, ఇతర గ్రాసము మేప జూపినా, మొదట అందుకోదు. తరువాత కొంచెంగా గ్రహిస్తుంది. కాని ఎప్పటి కప్పుడు తప్పించుకొనిపోయే స్వభావము దాని నక్కడ ఉండనివ్వదు. యజమాని ఎన్నోసార్లు ఆశ చూపి, ఎట్లో దాన్ని శాల కలవాటు పరుస్తాడు. ఆ తర్వాత దాన్ని కట్టకపోయినా కొట్టు విడిచి వెళ్ళదు.... అట్లాగే మనస్సుగూడ. ఒక్కమారు లోపల ఆనందం అనుభవిస్తే అది తర్వాత బయట తిరగదు.

## భాషణములు 214

ఆశ్రమానికి పలుమార్లు వస్తూపోయేవారు శ్రీ ఏకనాథరావు అడిగేరు: పరిస్థితులను బట్టి ధ్యానంలో హెచ్చుతగ్గులుండవా?

మహర్షి: అవును, ఉంటాయి. ఒక్కొక్కప్పుడు మనస్సు సత్వ ప్రధానంగా ఉంటుంది. అప్పుడు ధ్యానం సులభమౌతుంది; ఇతర సమయాల్లో ఎంత యత్నించినా సాధ్యపడదు. ఇది త్రిగుణాల ఒత్తిడివల్ల.

భ: వాని ఆచరణలు, స్థితిగతులూ వీనివల్ల గూడ ధ్యానం ప్రభావితం అవుతుందా?

మ: ఉండదు. కర్తృత్వబుద్ధియే ఆటంకం.

భాషణములు 215

మహర్షి: జి.యు. పోప్ తిరువాచకానికి కావించిన అనువాదాన్ని చదువుతున్నారు. అక్కడ ఒక ఘట్టంలో భక్తి వర్ణింపబడియుంది. "గాఢభక్తివల్ల శరీరమంతా గగుర్పొడిచి కండరాలను అస్థులను కరిగించి ఇత్యాది." మాణిక్యవాచకర్ మహాత్ములలో నొకరు. ఆయన దేహం కూడా మిగల్చకుండా తేజంలో విలీనమయ్యారు" అన్నారు.

అదెట్లు? అన్నాడొక భక్తుడు.

మహర్షి: సూక్ష్మపదార్థమైన మనస్సుకు ఈ స్థూలదేహం ఘనీభవించిన రూపం. మనస్సు కరిగిపోయి తేజస్సుగా జ్వలిస్తే, ఆ సరళిలో దేహం హుతమై పోతుంది. నందనారుకు కూడా అలాగే అయింది.

ఎలీషా కూడా ఇలాగే అదృశ్యమయ్యాడు అన్నాడు చాడ్విక్. సమాధిలో క్రీస్తు దేహం కానరాక పోవడం గూడ అట్లే ఉండునేమో తెలియగోరాడు.

మహర్షి: కాదు. క్రీస్తు దేహము శవమైనది. దాన్ని సమాధిలో ఉంచారు. పై జెప్పినవారు అలాగ తనువును మిగిల్చి వెళ్ళలేదే.

మాటల సందర్భంలో మహర్షి తెలిపారు- సూక్ష్మదేహము శబ్దతేజో నిర్మితము. వాటి ఘనీభవించిన రూపమే స్థూల దేహము.

దాస్: ఆ శబ్ద తేజములు ఇంద్రియగోచరములా?

మహర్షి: కావు అవి ఇంద్రియాతీతములు. ఇది ఈ విధంగా

| | ఈశ్వర (సర్వగత) | జీవ (వ్యక్తిగత) |
|---|---|---|
| స్థూల | విశ్వము | దేహము |
| సూక్ష్మ | శబ్దతేజములు --నాదబిందు | మనస్సు మరియు ప్రాణము |
| ప్రధాన | ఆత్మ పరము (అతీతము) | ఆత్మ పరము (అతీతము) |

| | ఈశ్వర సర్వగత | జీవ వ్యక్తిగత |
|---|---|---|
| స్థూల | విశ్వము | దేహము |
| సూక్ష్మ | శబ్ద తేజములు, నాద బిందు | మనస్సు మరియు ప్రాణము |
| ప్రధాన | ఆత్మ, పరము, అతీతము | ఆత్మ, పరము,అతీతము |

చివరకు అవి అన్నీ ఒకటే.

సృష్టికర్త యొక్క సూక్ష్మ శరీరం, గూఢార్థమగు ప్రణవనాదము. అది శబ్దం, తేజం గూడా, విశ్వము నాదముగా, తేజముగా, తరువాత అతీతమైన పరమార్థంగా లయిస్తుంది.

## భాషణములు 216

అరుణాచలమంటే ఏమో మహర్షి చెప్పారు:

అరుణ = ఎర్రని, అగ్నివలె ఉజ్జ్వలమైన

అది సాధారణమగు అగ్నిగాదు. సాధారణమైన అగ్ని వేడిగ ఉంటుంది.

అంతే, కాని ఇది జ్ఞానాగ్ని (విజ్ఞానాగ్ని), వేడికాదు, చల్లనా కాదు.

అచల = గిరి, కొండ.

అరుణాచలమంటే, విజ్ఞాన గిరి (జ్ఞాన పర్వతము)

## భాషణములు 217

బాంబేనుంచి వచ్చిన ఇంజనీరు ఎ. బోసు అర్థించాడు. శ్రీభగవాన్ మాపై సానుభూతి చూపి అనుగ్రహింపరా?

మహర్షి: మెడలోతు నీటిలో నిలువబడి నీటికై ఏడవడమేమిటి? అంతలోతు నీళ్ళలోనుండి నతడు దప్పిగొన్నట్లు, నీటిలోని చేపకు గొంతెండినట్లు, నీటికే దాహమైనట్లున్నదే మీరు చెప్పేది.

భ: మనస్సును నశింపజేయు టెలాగ?

మ: అసలు మనస్సంటూ ఉన్నదా? నీ వనే మనస్సు, ఒక భ్రమ (భ్రాంతి)

అది 'నేను' ఆలోచననుండి వచ్చింది. స్థూలసూక్ష్మ ఇంద్రియములు లేకుంటే నీకు మనస్సుగాని దేహంగాని తెలియదు. అయినా ఇంద్రియాలు లేకనే నీ వుండగలవు? ఆ అవస్థలో నీవు నిద్రిస్తూ అయినా ఉండాలి లేదా ఆత్మ స్థితుడవైనా ఉండాలి. ఆత్మజ్ఞత ఎప్పుడూ ఉన్నదే. నీవు నిజంగా ఉన్నట్టుండు అప్పుడు ఈ ప్రశ్నేరాదు.

భ: దేహబుద్ధి ఆత్మసాక్షాత్కారానికి అడ్డా?

మ: మనమెప్పుడూ మనోదేహాల కతీతంగానే ఉన్నాము. ఒకవేళ నీవు దేహాన్ని ఆత్మగా భావిస్తే అది తప్పక ఆటంకము అవుతుంది.

భ: మనోదేహాల్లో ఏ ఒక్కటైనా ఆత్మకుపయోగిస్తుందా?

మ: అవి ఆత్మసాక్షాత్కారము పొందడానికి ఉపయోగపడతాయి.

30 25, 1936

భాషణములు 218

శివపురాణం తిరగవేస్తూ మహర్షి యన్నారు:

శివుడు సర్వాతీతుడు, అంతస్థితుడు. (లోన ఉండి నడిపించేవాడు) మొదటిది నిర్గుణము, రెండవది లింగాకృతి అయిన సగుణము. మొట్టమొదట అరుణాచలముగ ఆవిర్భవించిన లింగము ఇప్పటికీ అలాగే ఉంది. ధనుర్మాసంలో చంద్రుడు ఆర్ద్రా నక్షత్రయుక్తుడై ఉండగా (డిసెంబరు మాసంలో) ఈ ఆవిర్భావం జరిగింది. కాని హరిహరాదులు దానిని పూజించింది శివరాత్రినాడు. అది పుణ్యదినంగా ఇప్పటికి మన్నించబడుతోంది. వాచా తెలిపే ప్రణవము (ఓం) సర్వాతీత నిర్గుణ దశను, పంచాక్షరీ మంత్రము అంతర్గత సగుణ దశను తెలుపుతున్నాయి.

శ్రీ భగవాన్ మరొకమారు పార్వతి రాముని పరీక్షించిన వైనం చెప్పారు. ఆ

5 96:

Rama స్త్రీగా

సీతను వెదకుతూ రామలక్ష్మణులు అరణ్యంలో తిరుగుతున్నారు. రాముడు దుఃఖంతో క్రుంగియున్నాడు. ఆ తరుణంలో శివపార్వతు లాదిశగా వారి దగ్గరగానే పోవటం తటస్థించింది. శివుడు రామునకు నమస్కరించి సాగిపోయాడు. పార్వతికి ఆశ్చర్యమయింది. తాను విశ్వేశ్వరుడు, ఎల్లరికి ధ్యేయుడు, రాముడు సామాన్య మానవుడు, భార్యను పోగొట్టుకొని దుఃఖాకులుడై, వ్యగ్రుడై, అనాథవలె అడవిలో భ్రమిస్తున్నాడు. అతనికి శివునంత వాడు, ఎలా నమస్కరించాడు.? ఆమె ప్రశ్నిస్తే శివుడన్నాడు, "తానున్న స్థితిలోని సామాన్య మానవుడు వర్తిల్లేట్లు నటిస్తున్నాడు. అంతే కాని నిజంగా రాముడు విష్ణు అవతారం, నమస్కారార్హుడు కావాలంటే పరీక్షించుకో."

పార్వతి యోచించింది. రాముడు దుఃఖా వేగంతో ఎలుగెత్తి సీతను పిలుస్తూ పోతున్నాడు. పార్వతి సీతరూపంలో రామునెదుట నిలిచింది. ఆమెనా వేషంలో చూచి, రాముడు నవ్వి "ఇదేమమ్మా పార్వతీ, నీవిక్కడున్నావా? శంభు వెక్కడ? సీతరూపం దాల్చినావెందుకు?" అని ప్రశ్నించాడు. పార్వతి లజ్జించి జరిగిన కథంతా చెప్పింది.

రాముడన్నాడు. "మనమంతా శివుని అంశములమే. ఎదుటనున్నప్పుడు ఆయనను పూజిస్తాము. పరోక్షంలో స్మరిస్తాము."

## భాషణములు 219

చిరకాలంగా ఆశ్రమవాసి, శిష్యుడు రామకృష్ణస్వామి అరుణాచల పంచరత్నాల్లోని "త్వయ్యరుణాచల సర్వం..." అన్న శ్లోకాని కర్థమడిగాడు. మహర్షి: విశ్వం తెరపై చిత్రం వంటిది. ఆ తెర ఎర్రనికొండ, అరుణాచలమే.

వ్యక్తమవుతూ లయమవుతూ ఉండేది, అది దేనినుండి వ్యక్తమవుతోందో ఆ ద్రవ్యంతో నిర్మితమై ఉంది. అరుణాచలేశుడు విశ్వం యొక్క అవికల్పరూపం (Finality). ఆయన్నుగాని, ఆత్మనుగాని, ద్రష్టనుగాని ధ్యానం చేస్తుంటే, సకలారంభాలకు మూలమైన 'అహం'స్ఫూర్తి కలుగుతుంది. దాని మూలాన్ని అన్వేషిస్తే, ఆద్యమైన "అహం--మహం" ఒక్కటే మిగులుతుంది. దానిని వాచా చెప్పజాలము. అనుభవ స్థానము లోన ఉన్నది; అన్వేషించేవాడు తనకు వెలుపలగా దానిని కనిపెట్టలేదు. ఆ స్థానము ఆనందము, సకలానికీ అందుచేతనే దాన్ని హృదయమన్నారు. అంతర్ముఖులమై దాన్ని కనుగొనడమే ఈ పుట్టువుకున్న ఒకే ఒక ప్రయోజనము. అంతకుమించి చేయవలసింది ఏమీ లేదు.

భ: వాసనల నాశం ఎట్లు సాధించగలం?

మ: ఆత్మజ్ఞానమైనపుడు నీవు ఆ స్థితిలో ఉంటావు.

భ: అంటే ఆత్మ స్థితిలో ఉంటే వ్యక్తమౌతున్న వాసనలు ఎప్పటికప్పుడు దహించ బడతాయా?

మ: నీవు నిజంగా ఉన్నట్లే ఉండిపోతే, వాసనలు తామై నాశనమౌతాయి.

## భాషణములు 220

బి.సి. దాస్. మనసు స్వాధీనమైతేనే నిదిధ్యాననము (ధ్యానము) సాధ్యమౌతుంది. నిదిధ్యాసనము (ధ్యానము) వల్లనే మనస్సు స్వాధీన మౌతుంది. ఈ విషమ వలయం విడివడేదెట్లా?

మహర్షి: నిజమే. అవి ఒకదానిపై ఒకటి ఆధారపడి వున్నాయి. అవి జంటగా సాగిపోవాలి. అభ్యాసము, వైరాగ్యము క్రమంగా సత్ఫలితాలు సాధిస్తాయి. మనస్సును బహిర్ ముఖం అవకుండా ఆపేది వైరాగ్యం; మనస్సు నంతర్ముఖంగా నిలిపేది అభ్యాసం. నిగ్రహానికి, ధ్యానానికి మధ్య ఘర్షణ ఉంటుంది. లోపల ఆ పోరు నిరంతరంగా సాగుతూనే ఉంది. క్రమంగా ధ్యానానికి విజయం లభిస్తుంది.

భ: ప్రారంభం ఏ విధంగా? దానికీ భగవాన్ అనుగ్రహం కావలసి ఉంది.

మ: అనుగ్రహం ఎప్పుడూ ఉన్నదే. "గుర్వనుగ్రహం లేకుండా వైరాగ్యం కలుగదు, సత్యాన్ని తెలిసికోలేము, ఆత్మస్థితి అలవడదు" అనే వచనాన్ని మహర్షి ఉదాహరించారు.

అభ్యాసం చాలా అవసరం. అది ఒక బలిసిన ఆబోతును కొట్టంలోనే నిలిపి బయట తిరగకుండా ఉండడానికి లేతగడ్డిని ఆశ చూపడం వంటిది.

'అంత మహర్షి తిరువాచకం నుంచి మనస్సును సంబోధిస్తూన్న ఒక పద్యం చదివారు - ఝుంకరిస్తున్న ఓ తుమ్మెదా! (మనసా) లెక్కలేనన్ని పూలనుండి బిందువు బిందువుగా తేనెను సమకూర్చే శ్రమ నీకెందుకు? ఒకరున్నారు. అతని నొక్కమారు స్మరించినా, చూచినా, స్తుతించినా చాలు; నీకు మధునిధియే లభిస్తుంది. పో, లోనికి చొచ్చుకొనిపోయి ఝీంకరించు."

భ: నామ జపము, సత్ గ్రంథ పఠనంతోపాటు మానసికంగా ఒక రూపకల్పన గూడ ధ్యానాని కవసరమా?

మ: మనఃకల్పితం గాక ధ్యానం మరేమిటి?

భ: ఆ రూపానికి, మంత్రజపము దివ్యగుణ గానముల గూడా జత సేయవలెనా?

మ: జపము ప్రధానాంగమైతే, ముఖతః చేసే జపము క్రమంగా మానసికమౌతుంది. అదే ధ్యానం.

## భాషణములు 221

బోస్: రూపమంటే ద్వైత కల్పన. అది మంచిదా?

మహర్షి: అలా ప్రశ్న వచ్చిందంటే విచారమార్గం అనుసరించడం మేలు. రూపధ్యానం వానికి కుదరదు.

భ: నా ధ్యానంలో శూన్యం తోస్తోంది. అక్కడ ఏ రూపూ కన్పించటంలేదు.

మ: కనిపించదు.

భ: ఆ శూన్యం మాటేమి?

మ: దాన్ని చూచేదెవరు? చూచేందుకు నీవక్కడ ఉండాలి. రిక్తత చూచే

చైతన్యం అక్కడ ఉంది.

భ: అంటే నేనింకా లోపలికి వెళ్ళాలని అర్ధమా?

మ: అవును. నీవు లేని క్షణమే లేదు.

## భాషణములు 222

డాక్టర్ పోపట్లాల్ లోహారా ఉపదేశసారము మొదలైన అనేక గ్రంథాలు చదివారు. ఆయన లెక్క ప్రకారం సుమారు 1500 మంది మహాత్ములను, సాధువులను యోగులను దర్శించాడు. త్ర్యంబక్లో ఆయనకొక్క సాధువు కనబడి పోపటాల్ యింకా కొన్ని ఋణములు తీర్చవలసియుందనీ, అవి తీరిన పిదప అతనికాత్మసాక్షాత్కారము సాధ్యమౌనన్నాడుట. అతనికి తెలిసి మిగిలియున్న ఋణమొక్కటే. అతని పుత్రుని వివాహము అదీ అయింది ఇప్పుడు తాను పూర్తిగ కర్మఋణ విముక్తుడు. అట్లైగూడ మనశ్శాంతి కుదరటం లేదు. భగవాన్ మార్గం చూపవలెనని అర్థించాడు.

మహర్షి: ఉపదేశసార మే భాషలోనిది చదివావు.

భ: సంస్కృతంలో.

మ: నీ ప్రశ్నకు జవాబు అందులో ఉందే!

భ: ఎంత యత్నించినా మనస్సు స్థిరం కావడం లేదు. 1918 నుండి ఈ యత్నం చేస్తూనే వున్నాను.

మ: "హృత్ స్థలే మనః స్వస్థతా క్రియా, భక్తి యోగ బోధాశ్చ నిశ్చితం".

హృదయ స్థలంలో మనస్సు స్వస్థమై యుండుటే, కర్మము. అదియే భక్తి అదియే యోగము. జ్ఞానము అదే. ఇది సూక్ష్మంలో, పూర్ణసత్యము.

భ: కాని, నా సౌఖ్యాన్వేషణం అంతటితో తృప్తి జెందటం లేదు. మనస్సు స్థిరంగా నిల్పలేకపోతున్నాను.

మః "మానసంతు కిం? మార్గణే కృతే, నైవ మానసం, మార్గ ఆర్థవాత్". మనస్సు యేమో, నిరంతరం వెదకితే, అది లేదని తెలుస్తుంది. సూటియైన మార్గమిదే.

భ: అయితే మనస్సును వెదకే దెలా?

మ: మనస్సు తలపులమూట. తలపుల మూలం "నేను" ఆలోచన. "అహమయం కుతో, భవతి చిన్వతః, అయి పత త్యహం నిజ విచారణం".

"ఈ 'నేను' ఎక్కడ పుట్టునో ఆ స్థానమును వెదకే వానికి, అహంకారము నశిస్తుంది. నిజ విచారణ మిదియే" యథార్థమైన 'నేను' స్వయంగా వెలుగుతూ తెలుస్తుంది.

భ: నేనన్న తలపు నాలో జనిస్తుంది. కాని నాకు 'ఆత్మ' తెలియడం లేదు. మ: ఇవన్నీ మనో భావనలు. నిన్ను నీవు నిజముకాని "నేను"తో కలుపుకుంటున్నావు. అది లేస్తూ, అణుగుతూ ఉంటుంది. కాని నిజమైన 'నేను' ఆ రెంటికినీ అవ్వలిది. నీ ఉనికిలో ఏ విధమైన విరతీ ఉండకూడదు. నిద్రలోని నీవే, ఇప్పుడు మేల్కొనియున్నవాడవునూ, నిద్రలో నీకెట్టి కష్టమూ (దుఃఖము) లేదు; కాని మెలకువలో నీకు దుఃఖం ఉంది. నీ యనుభవంలోని ఈ భేదము ఎందుకు వచ్చినట్లు? నిద్రలో 'నే'నన్న ఆలోచన లేదు. ఆ "నేను" ఆలోచన ఇప్పుడుంది. నిజమైన "నేను" స్పష్టంగా తెలీదు. నిజంకాని "నేను" బాగా కనబడుతోంది. యథార్థ జ్ఞానానికిది ఆటంకము. ఈ తప్పు 'నేను' పుట్టుచోటును కనుక్కో అది మాయమౌతుంది. నిజంగా నీ వెవరవో నీవదిగా ఉంటావు - అంటే బ్రహ్మముగా నిలుస్తావు.

భ: అదెట్లు చేయటమో, ఏమో. ఇంతవరకూ నేను సఫలుణ్ణి కాలేదు.

మ: 'నే'నన్న ఆలోచన మూలం వెదకు. ఎవరైనా, చేయవలసిందంతే. 'నేను' అనే ఆలోచన ఈ విశ్వానికి ఆధారం. అది అంతమైతే దుఃఖాలూ అంతమౌతాయి. ఈ తప్పు "నేను"ను వెదకితే అది అంతమౌతుంది.

డా. లోహారా ఉపదేశసారంలోని ఒక శ్లోకాని కర్థమడిగాడు.

మ: నిద్రలోని అతడే, ఇపుడు మేల్కొని ఉన్నవాడునూ, నిద్రలో సుఖమూ, మెలకువలో దుఃఖము, నిద్రలో "నేను"లేదు. మెలకువలో అది ఉన్నది. నిద్రలోని సుఖస్థితి, "నేను" ఆలోచనలేని అయత్న సిద్ధస్థితి. ఆ స్థితిని మెలకువలో గూడ రాబట్టడం మన లక్ష్యం. దానికి యత్నం అవసరం.

| నిద్ర | మెలకువ | |
|---|---|---|
| స్వతస్సిద్ధముగా ఆనందం "నేను"ఆలోచన లేదు | ఆనందం లేదు "నేను" ఆలోచన ఉంది. | జాగ్రదవస్థలో కూడ నిద్రాస్థితిని తెచ్చుకొనుటే ఆత్మ సాక్షాత్కారము. ఆ ప్రయత్నము "నేను" ఆలోచన నాశనానికే కాని "నిజమైన నేను"ను తయారు చెయ్యడానికి కాదు. ఎందుకంటే నిజమైన నేను నిత్యము. దీనికి నీ ప్రయత్నం అవసరం లేదు. |

## భాషణములు 223

లోహారా: ధ్యానించేప్పుడు మనస్సు హృదయమగ్నం ఎందుకు కావడం లేదు?"

మహర్షి: తేలుతున్న దానిని ముంచి ఉంచటానికి ఏవో కొన్ని ఉపాయాలు చెయ్యాలి. శ్వాస నియమము మనస్సును కొంత శాంతింప చేస్తుంది. మనస్సు శాంతంగా ఉన్నా గూడ దానిని జాగరూకతతోనే ఉంచి, నిరంతరం ధ్యానాన్ని సాగించాలి. అప్పుడది హృదయంలో మునుగుతుంది. తేలే దానిని, బరువులతో నింపి ముంచవచ్చు. అట్లే సాధు సాంగత్యం గూడ మనస్సు హృన్మగ్నం కావడానికి సాయపడుతుంది.

అట్టి సాధు సంగం, దైహికమూ, మానసికము. ప్రత్యక్షుడగు గురువు మనస్సును లోనికి నెట్టుతాడు. గురువు అన్వేషియేగాక, హృదయస్థితుడు గూడా, కనుక అంతర్ముఖమైన మనస్సును హృదయంలోనికి ఆకర్షిస్తాడు.

ధ్యానాదులను నారంభించి, దాని కష్ట మెరిగినవారికే, ఈ ప్రశ్నలు వస్తాయి. అట్టివాడు శ్వాస నిరోధం కొద్దిగా అభ్యసించినా, వాని మనస్సు శుద్ధమవుతుంది. ఇప్పుడు వాని మనస్సును హృదయంలోనికి చొరనీకుండా నిద్రాణముల్లైయున్నవాని వాసనలు అడ్డగిస్తాయి. ఈ వాసనలు ప్రాణాయామంవలనగాని, సాధు సాంగత్యం వలనగాని తొలుగుతాయి. నిజానికి మనస్సు ఎప్పుడూ హృదయంలోనే ఉంది, కాని అది వాసనాబలం వలన చంచలమై అంతటా తిరుగుతుంది. ఆ వాసనలను శక్తిహీనం చేస్తే మనస్సు నిశ్చలంగా, శాంతంగా ఉంటుంది.

శ్వాసానురోధం వల్ల మనస్సు అణగడం తాత్కాలికమే, ఎందుకంటే వాసనలింకా మిగిలి ఉన్నాయి కాబట్టి. మనస్సు ఆత్మగా మారినపుడు అవి యిక బాధింపవు. ఇది ధ్యానం వల్ల సమకూరుతుంది.

## భాషణములు 224

సహజమూ, ఆద్యమూ, అయిన స్థితిని కనుగొనుట ఎలా? అని ఒక భక్తుడు ప్రశ్నించాడు.

మహర్షి: ఆలోచనలనుండి పూర్ణముక్తి అయితే అట్టి ఎరుక సులభమౌతుంది.

## భాషణములు 225

(ఇది పరిచారకుని నోటునుండి) శ్రీభగవాన్ పరిచారకుడు రంగస్వామి, కొండపై కూర్చుండి యుండగా, క్రింద ఆశ్రమంలో నొకరు ఊయల కుర్చీలో ఊగుతూ వారికి కన్పించారు.

మహర్షి: శివుడు తన సర్వస్వమూ విష్ణునకిచ్చివేసి, అడవుల్లో, కొండల్లో, స్మశానంలో తిరుగుతూ భిక్షాటనం చేస్తూ జీవించాడు. ఆయన దృష్టికి వస్తు సమృద్ధికన్నా, వస్తువులు లేకపోవడమే సుఖతరమనిపించింది.

భ: ఆ మేలి సుఖము ఎటువంటిది?

మ: చింతలు లేకుండా ఉండటం. సంపదలుండెనా, వానిని కాపాడటం, వినియోగించటం, యిత్యాదులు ఎన్నెన్నో - పెద్ద బాదరబందీ. తనవని ఏమీ లేనప్పుడు ఏ కలతాలేదు. అందువల్లే శివుడు తనవన్నీ విష్ణువు కప్పగించేసి, సుఖంగా వెళ్ళిపోయినాడు. విషయముల (possessions) త్యాగము ఉత్తమసుఖం.

## భాషణములు 226

తిరుక్కోయలూర్నుండి యొకరు ప్రశ్నించారు.

"మన శాస్త్ర గ్రంథాలు చదివితే సత్య దర్శనం అవుతుందా?"

మహర్షి: అదొక్కటే చాలదు.

భ: ఎందుకు చాలదు?

మ: సమాధి యొక్కటే దాన్ని దర్శింపజేసేది. ఆలోచనలు సత్యాన్ని కప్పుతాయి.

అందువల్ల ఇతర అవస్థల్లో అది స్పష్టం కాదు.

భ: సమాధిలో ఆలోచన ఉన్నదా, లేదా?

మ: కేవలం "నేను ఉన్నాను" అనే భావన మాత్రం ఉంటుంది. వేరే ఆలోచనలు ఉండవు.

భ: నే నున్నా ననేది గూడ ఆలోచన గదా?

మ: అహంకార రహితమైన "నేను ఉన్నాను" ఆలోచన కాదు. అది ఎరుక. అది అనుభూతి. "నేను" యొక్క అర్థము లేదా ప్రాముఖ్యత ఏమిటంటే అదే దైవం. "నేను-ఉన్నాను" (I am) యొక్క అనుభవం, నిశ్చలంగా ఉండడమే.

## భాషణములు 227

మ: "తన స్వభావము ఆనందమే అయితే తాను ఆ ఆనందం కోసం తృష్ణ ఏమిటి? ఆ తృష్ణను వదలించుకోవడమే మోక్షం. శాస్త్రము చెప్తోంది. "తత్త్వమసి" (నీవు అదే). ఆ జ్ఞానాన్ని బోధించడమే వాటి ప్రయోజనం. అనుభూతి ఏమిటంటే నీవెవరో నీవు తెలిసికొని అదే నీవుగా, ఆత్మగా నిలవటమే, ఆత్మసాక్షాత్కారము "నేనదే" "ఇదికాదు" ('అహం బ్రహ్మాస్మి" "నేతి నేతి") అని పలుమార్లు జపించడం (వల్లె వేయడం) కేవలం కాలయాపన మాత్రమే. యోగ్యమైన శిష్యునికి కర్తవ్యం అంతా లోపలే ఉంది. బయట కాదు.

శ్రీ భగవాన్ కొండదిగి వస్తూండగా ఆశ్రమాని కవతల పనివాడొకడు పనిమాని శ్రీభగవానకు సాష్టాంగ పడబోయాడు. అప్పుడు మహర్షి "నీ పని నీవు చూసుకుంటే, అదే నిజమైన సాష్టాంగ నమస్కారం" అన్నారు.

భగవాన్ పరిచారకు డదెట్లు అని అడిగాడు. "శ్రద్ధగా తన పని తాను చేయడం, భగవంతునికి చేసే ఉత్తమ సేవ" అని నవ్వుతూ భగవాన్ హాలులో ప్రవేశించారు.

## భాషణములు 228

మధ్యాహ్నం భోజనం జరుగుతున్నది. నెల్లూరు వారొకరు భగవాన్ విస్తరిలోనుండి కొంచెం ప్రసాదం ఇవ్వమని అడిగారు.

మహర్షి: అహంకారము మరచి అన్నం తిను. అపుడు నీవు తిన్నది, భగవాన్ ప్రసాదమే అవుతుంది.

భోజనానంతరం ఛలోక్తిగా భగవాన్ వానితో అన్నారు

"నా విస్తట్లో నుండి నీకొక్క ముద్దయిచ్చి ఉంటినా, ప్రతివాడూ తలా ఒక ముద్దా అడిగేవాడు. ఉన్నదంతా అందరికీ పంచిపెడితే ఇక నాకు మిగిలేదేముంది? చూడు. భక్తి అదిగాదు. నా ఆకులోని ముద్ద మ్రింగటంలో విశేషమేమీ లేదు. నిజమైన భక్తుడిగా ఉండు.

## భాషణములు 229

ప్రొద్దున 8 గంటలయింది. పెంపుడు ఉడుత బోనునుండి బయటికి పోజూస్తున్నది. మహర్షి యన్నారు: "అందరూ వెలుపలికి పారిపోవలెననే వారే. బయటకు పోవడానికి కంతులేదు. కాని ఉన్న సుఖమంతా లోనే ఉంది, వెలుపలగాదు."

## భాషణములు 230

భ: శ్రుతులూ, ఇతర గ్రంథాలూ అధ్యయనం చేస్తే ఆత్మసాక్షాత్కారం కలుగుతుందా?

మ: కలుగదు. మనస్సులో పూర్వవాసనలు నిహితమై యున్న వరకూ ఆత్మానుభవం సాధ్యము కాదు. శాస్త్ర పాండిత్యము తనంత తానొక వాసన. ఆత్మానుభూతి కేవలం సమాధిలోనే సాధ్యం.

## భాషణములు 231

భ: మౌనమంటే యేమి?

మ: నోరు మూసుకొన్న మాత్రాన మౌనం గాదు. అది నిత్య ప్రసంగము.

భ: నా కర్థం కాలేదు.

మ: మనోవాక్కుల కతీత స్థితి మౌనము.

భ: అది సాధించే దెలాగ?

మ: గాఢంగా ఏదేనొక ఆలోచన తీసుకో, దాని మూలం కనుక్కో ప్రతిసారీ చిత్తైకాగ్రత వల్ల మౌనం సిద్ధిస్తుంది. అభ్యాసం సహజం అయ్యాక, అది నిశ్శబ్దంగా పరిణమిస్తుంది. నిశ్చలమైన మనస్సుతో చేసే ధ్యానం మౌనం. మనస్సును వశం చేసుకోటం, ధ్యానం, గాఢమైన ధ్యానం, నిత్యవచస్సు. (నిత్య భాషణం)

భ: మౌనం దాల్చి కూర్చుంటే నిత్యవ్యవహారం ఎలా?

మ: నీరు నింపిన కడవలు నెత్తికెత్తుకొని స్త్రీలు తమలో తాము మాట్లాడుకుంటూ నడుస్తారు; కాని వారి ధ్యానం కడవలపైనే నిలిచియుంటుంది. అట్ల కర్మల్లో ప్రవృత్తుడైన యోగి కూడా, ఆ కర్మలు వానిని కలచవు. వాని మనస్సు బ్రహ్మమందే నిలబడి ఉంటుంది.

## భాషణములు 232

“యోగియే నిజమగు భక్తుడు" అని మహర్షి యొకమారన్నారు.

## భాషణములు 233

భ: రామజప ఫలమేమి?

మ: 'రా' అంటే సత్యం; 'మ' మనస్సు; ఆ రెంటి కలయికయే రామజప ఫలం. పద ముచ్చరించిన మాత్రం చాలదు. ఆలోచనలను పరిహరించడమే వివేకము. అదియే అనంతమైన సత్యం.

## భాషణములు 234

ముసల్మా నొకడు ఆసనమును గూర్చి ప్రశ్నించాడు.

మ: దైవమందు సుస్థిరంగా ఉండుట ఒక్కటే సరియైన ఆసనము.

## భాషణములు 235

శిష్యుడు, టి.కె. ఎస్. అయ్యర్ చాల ఉద్విగ్నుడై ఉన్నాడు. ఊరిలో ఎవ్వరో భగవాన్ను తూలనాడుతూ మాట్లాడారట. వారి నెదుర్కోకనే వచ్చేసాడు. కాని ఆవేగం అణగలేదు. భగవాన్ను సమర్థించకుండా తిరిగివచ్చినందుకు శిక్షయేమని అడిగాడు.

మ: ఓర్పు, మరింత ఓర్పు, సహనం, మరింత సహనం.

## భాషణములు 236

పంచమ జార్జి చక్రవర్తి మరణించాడు. హాలులో ఇద్దరు దాని విషయంగా మాట్లాడుకొంటున్నారు; వారు చాల వ్యాకులురై ఉన్నారు. వారితో మహర్షి యన్నారు

ఎవరు నష్టమైతే, కాక చనిపోతే, నీకు ఏంటి? నీవు మృతుడవై నష్టుడవై ప్రేమలో లీనంకా.

## భాషణములు 237

ఒకతడు సుబ్రహ్మణ్య స్వామి వెండి విగ్రహాన్ని, వల్లీదేవసేనల తామ్రవిగ్రహాలను తెచ్చి భగవాన్ తో అన్నాడు.

"వీనిని పదేండ్లుగా అర్చిస్తున్నాను. దుఃఖాలేతప్ప నాకింకేమీ జరగలేదు. వీని నేమి చేయమంటారు? ఇతరుల నడిగాను. విగ్రహ నిర్మాణంలో, వాని కుపయోగించిన లోహంలోని లోపాలే నా కష్టాలకు కారణమన్నారు. అది అలా ఉంటుందా?

మ: వారెవ్వరైనా అర్చన చెయ్యడం తప్పని చెప్పేరా?

## భాషణములు 238

ఎవరి ప్రశ్నకో బదులుగా మహర్షి --

“మాటలుడిగి నిశ్శబ్దము వెలసే అవస్థ ఒకటుంది."

భక్తుడు: అలా అయితే ఒకరి తలపులు మరొకరికి తెలిసే దెలాగ?

మహర్షి: ఇరువు రున్నారనుకొంటేనే ఆ ప్రశ్న.

భః శాంతిని పొందేదెట్లా?

మ: శాంతియే, సహజస్థితి, లోపల సహజంగా ఉండే శాంతిని భంగపెట్టేది మనస్సు. మన అన్వేషన అంతా మనస్సులోనే. మనస్సునే శోధించు. అది మాయమౌతుంది.

మనస్సని వస్తువేదీ లేదు. ఆలోచనలు కలుగుతుంటాయి. గనుక వాని పుట్టుచోటి నూహించి, దానిని మనస్సు అంటాము. తరచి చూస్తే, అట్టిదేమీ లేదు. ఆలోచనలు అదృశ్యమైనాక, మిగిలి వెలిసేది నిత్యశాంతి యని తెలుస్తుంది.

భ: బుద్ధియంటే ఏమిటి?

మ: ఆలోచించే లేదా వివక్ష చేసే శక్తి. ఇవన్నీ వట్టిపేర్లే. అహంకారము, మనస్సు, బుద్ధి - అన్నీ పేర్లే. ఎవని మనస్సు? బుద్ధి ఎవ్వనిది? అవన్నీ అహంకారానివే. అహంకారం నిజమా? కాదే! ఆ అహంకారాన్ని మనం తెలియక, మనస్సనీ, బుద్ధియనీ అంటాము.

భ: ఎమర్సన్ అన్నాడు: "ఆత్మ వేరొక ఆత్మకు తానై బదులు పలుకుతుంది. మాటలతో గాదు, వివరములతో కాదు".

మ: నిజమే, ఎంత నేర్చినా, నేర్వవలసింది ఇంకెంతో మిగిలే ఉంటుంది. సంశయించేవాడిని పట్టించుకోకుండా సంశయాలను నివారింప యత్నిస్తావు. అట్లుగాక, సంశయించేవాడిని పట్టుకొని వదలిపెట్టకు; అప్పుడు సంశయాలు మాయమౌతాయి.

భ: అంటే ప్రశ్న ఆత్మను తెలిసికోవడంలో అంతమౌతుందన్న మాట.

మ: అవును.

భ: ఆత్మను తెలిసికోవడం ఎలా?

మ: ఆత్మయేమో చూడు. ఆత్మయని నీవనుకొంటున్నది బహుశః మనస్సో, బుద్ధియో, అహంకారమో. "నేను" ఆలోచన పుట్టిన తర్వాతే ఇతరాలోచనలన్నీ. కాబట్టి నీవు నిజమైన 'నేను'ను పట్టుకో. వేరు ఆలోచనలన్నీ నశించి, ఆత్మ యొక్కటే మిగులుతుంది.

భ: అంతదాకా చేరడమే కష్టం.

మ: చేరడమేమి? ఎక్కడికి? అదినిత్యం, ఇప్పుడు, ఇక్కడే ఉంది. ఆత్మ క్రొత్తగా పొందేవస్తువైతే, అదినిత్యమెట్లౌతుంది?

భ: మనశ్శాంతినీ, సమచిత్తాన్నీ సంపాదించే దెలా? ఏది ఉత్తమ మార్గం?

మ: దానికి ముందే జవాబు చెప్పాను. మనస్సును శోధించు; అది పోయి నీవు మిగులుతావు. వివేక దృష్టి నలవరుచుకో. అప్పుడు ప్రపంచము భగవంతునిగా గోచరిస్తుంది.

"దృష్టిని జ్ఞానమయం చేసి చూస్తే, ఈ ప్రపంచమంతా బ్రహ్మమయంగా తెలుస్తుంది." అంటే అంతా చూసే దృష్టి మీద ఆధారపడి ఉంటుంది. అంతటా నువ్వు వ్యాపించి ఉన్నావు. నిన్ను నీవు చూసుకో. అందరూ అర్థమౌతారు. కాని ఇప్పుడు నిన్ను నీవు పోగొట్టుకున్నావు అందుచే మిగిలిన అన్ని విషయాలమీదా సందేహం.

భ: ఆత్మను తెలిసికొనేదెలా?

మ: రెండు "నేను'లు ఉన్నాయా? నీవు వున్నావు అనేది నీకు ఎలా తెలుస్తుంది? నిన్ను నీవు ఈ కళ్ళతో చూస్తేనే తెలుస్తుందా? నిన్ను నీవు ప్రశ్నించుకో. ఆ ప్రశ్న ఎలా కలిగింది? అసలు ఆ ప్రశ్నను అడగడానికి 'నేను' ఉండాలి కదా! నన్ను నేను అద్దంలోవలె చూడ గలనా?

నీవు నీ దృష్టిని బయటకు పెట్టడం వలన దానికి ఆత్మ గోచరం కాదు. ఆత్మ బయట వస్తువులలో కనబడదు. అంతర్ముఖడవుకా, లోన మునుగు. నీవే ఆత్మగా ఉంటావు.

భ: ఆత్మ సాధనకు వర్ణధర్మాలను పాటించాలా? వాటిని నెట్టివేయాలా?

మ: ప్రారంభంలో కాదు. వాటిని పాటించడంతో మొదలుపెట్టు. మనశ్చాంచల్యాన్ని అదుపులో పెట్టడానికి వర్ణధర్మాలు ఉపయోగపడతాయి. మనస్సు శుద్ధమౌతుంది.

భ: ఆ తెలిసికోవడం సాధ్యంకాని వానిని, వాని అనుగ్రహం వల్లనే తెలిసికోగలం కదా!

మ: అతడు దానికి సాయం చేస్తాడు. అదే అనుగ్రహం.

భ: మనస్సును స్వాధీన పరచుకొనే దెలా?

మ: దొంగ తానై దొరుకుతాడా? మనస్సు తను తానే కనుక్కోగలదా? మనస్సు తానే తన్ను వెదకి పట్టుకో లేదు. సత్యాన్ని పట్టించుకోకుండా నీవు అసత్యమైన మనస్సునే పట్టుకోవడమే కాకుండా అదియేమో కనుక్కోవాలని కూడ ప్రయత్నిస్తావు. నీ నిద్రలో మనస్సు ఉందా? అప్పుడు లేదే! కాని ఇప్పుడుంది. అందుచేత అది శాశ్వతం కాదు. మనస్సును నీవు కనుక్కోగలవా? మనస్సు నీవుగావు. నిన్ను నీవు మనస్సనుకొని దాని ఎట్లు వశపరచుకోవాలి అని నన్నడిగావు. అది అక్కడ నిజంగా ఉన్నదైతే, దాన్ని నీవు నిరోధించగలవు. కాని అది లేదుగా! శోధించి ఇది తెలుసుకో! నిజం కాని దాన్ని వెదకటం వృథా. అందువల్ల నిజాన్ని (ఆత్మను) వెదకు. మనస్సుపై అధికారానికి అదే మార్గం. ఉన్న సత్యం ఒక్కటే.

భ: ఆ ఏకైక సత్యస్వరూపమేమి?

మ: ఉన్నదేదో, అదే. మిగతావన్నీ పైకి కనిపించేవి మాత్రమే. నానాత్వము దాని స్వభావం గాదు. కాగితం పైని అక్షరాలను చదువుతాము, కాని దాని కాధారమైన కాగితాన్ని గమనించము. అలాగే మనఃకల్పితాలనే ఎన్నుతూ నీవు దాని ఆధారాన్ని వదిలివేస్తున్నావు. తప్పెవరిది?

భ: ఆత్మకు పరిమితి ఉందా?

మ: ఆత్మయంటే ఏమిటి?

భ: జీవాత్మయే ఆత్మ.

మ: జీవాత్మ అంటే? ఆ రెండూ వేర్వేరా? ఏకమా?

క్రొత్త వెపుడూ నశించేవే, సృష్టించబడేది నష్టమూ అవుతుంది. శాశ్వతంగా ఉన్నది, పుట్టనూ లేదు, చావనూ లేదు. మనం కనిపించే దాన్ని యథార్థమని భ్రమచెందుతున్నాము. కల్పనకు దానిలోనే దాని అంతం ఉంది. క్రొత్తగా అగుపించేది, ఏమది? అది కనుగోలేకపోతే, అన్ని కనిపించడాలకు ముఖ్యాధారమైన దానికి, మినహాయింపు లేవి పెట్టుకోకుండా, శరణాగతిచెందు. అప్పుడు శేషమై మిగిలేది సత్యం.

భః మృతి తరువాత మనిషికి ఏమి జరుగుతుంది?

మ: బ్రతికియున్న ఇప్పటి విషయం చూడు. భవిష్యత్తు అది చూసుకుంటుంది. దాన్ని గూర్చి నీవేమి బెంగపడకు. సృష్టికి పూర్వము స్థితినీ, సృష్టిక్రమాన్ని, శ్రుతులలో వివరించారు. మీకు వర్తమానం అర్థం కావాలని ఉద్దేశ్యం. నీవు పుట్టేను అంటావు కాబట్టి అవీ, అవునట్లే, యంటూ నిన్ను సృష్టించింది దైవమని శాస్త్రాలు చెప్తాయి.

కాని నిద్రలో నీకు దైవముగాని, మరేమైనా కనిపిస్తుందా? దైవము నిజమైతే నీ నిద్రలోగూడ అతడేల ప్రకాశించడు? నీ వెప్పుడూ ఉన్నవాడవే. ఇప్పుడున్న ఈ నీవె, నిద్రలోని ఆ నీవు. ఆ నిద్రలోని వానికి నీవిపుడు వేరుగావు. అటువంటప్పుడు, ఈ రెండవస్థల్లోని నీ భావాల్లోనూ అనుభవాల్లోనూ, భేదమెందుకు

నిద్రిస్తున్నప్పుడు నీ పుట్టువును గూర్చి ఏమన్నా అడిగావా? మృతి పిదప ఎక్కడికి పోతానని ప్రశ్నించావా? జాగ్రదవస్థల్లో యిప్పుడివన్నీ యోచించుటెందుకు? పుట్టినవాడే, పుట్టుక దాని నివారణం, దాని కారణం చివరకు దాని ఫలితాలు వీటన్నింటినీ తర్కించనీ.

పుట్టుక దేనికి - 'నేను' అనే ఆలోచనకా, దేహానికా? ఆ 'నేను' దేహానికి సమమా? భిన్నమా? 'నేను' ఆలోచన ఎట్లు కలిగింది? నీ స్వభావ మదేనా? మరేదైనానా?

భ: ఇవన్నీ అడగవలసిం దెవరు?

మ: అదే. ఉన్నదే అది. దాని కంతమంటూ లేదు.

భ: కాబట్టి, ప్రశ్నించడం మానేసి గమ్మని ఉండాలా?

మ: మోహాన్ని దాటిపోతే సంశయాలు బాధించవు.

భ: మీరు చెప్పింది ఎలా ఉందంటే విచారాన్నే (అన్వేషణనే) ఆపమన్నట్లు

ఉంది.

మ: ఆత్మవిచారం నిలిచిపోతే, లోకవిచారం ఆరంభమౌతుంది. (హాల్లో అందరూ నవ్వసాగారు).

ఆత్మ విచారం సాగించు. అప్పుడనాత్మ అదృశ్యమౌతుంది. ఆత్మ మిగులుతుంది. ఆత్మ తన్ను తాను విచారించటమంటే ఇదే. ఆత్మ పదానికర్థాలు ఎన్నో ... మనస్సు, దేహం, జీవం, వ్యక్తి, పరమాత్మ మరియు అన్నీ.

## భాషణములు 239

ఫ్రీడ్మన్: మనిషి విషయాలను కల్పించి, కల్పనా బలంవల్ల వానితో ఆనందిస్తాడు. అట్టి సృజనశక్తి బ్రహ్మకున్నది. ఇదే విషయం బ్రహ్మచేత సృష్టింపబడిన మానవునికి చెల్లుతుందా?

మహర్షి: ఇది కూడా ఆలోచనే.

భ: శ్రీ జిడ్డుకృష్ణమూర్తియంటారు "మానవుడు తన్ను ('నేను')ను కనుగోవలె. అపుడు, పరిస్థితుల సంచయమే అయినందున 'నేలయమౌతుంది. 'నేను' కవ్వల ఏమీ ఉండవు" ఇది బౌద్ధవాదనను పోలియుండలేదా? '

మ: అవునవును, మాటలకతీతం.

# భాగం - 2

## భాషణములు 240

భ: ప్రపంచం కేవలం విషయాసక్తంగా ఉంది. దానికేమి మందు?

మ: విషయాసక్తమో, అధ్యాత్మికమో, అది నీ దృష్టిని బట్టి.

"దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేత్ బ్రహ్మమయం జగత్" నీ దృష్టిని సరిగా ఉంచుకో. సృజించినవాడు తన సృష్టిని చూసుకుంటాడు.

భ: భవిష్యత్తును కాపాడే దెలాగ?

మః వర్తమానాన్ని జాగ్రత్తపెడితే, భవిష్యత్తు తన్ను తానే రక్షించుకొంటుంది.

భ: వర్తమానానికి ఫలం భవిష్యత్తు. వర్తమానం బాగుచేసే దెట్లు? కాక మేమూరక ఉంటే చాలా?

మ: ఎవరికీ సందేహం? ఈ కార్యప్రణాళికను కోరేదెవరు? వానిని కనిపెట్టుకో. సంశయాలు పోతాయి. "ఆత్మ"ను వదలుకొన్నావు; ఆలోచనలు చేరాయి. ప్రపంచాన్ని చూడడం జరుగుతుంది. సందేహాలు వస్తాయి. అలాగే భవిష్యత్తు గురించి కలవరం కల్గుతుంది.

ఆత్మను దృఢంగా పట్టుకో. నీ సందేహాలు పోతాయి.

భ: అది చేయడమెలాగ?

మ: ఈ ప్రశ్న అనాత్మ సంబంధమేగాని, ఆత్మ సంబంధం కాదు. నీ వున్నావో, లేవో ఎప్పుడైనా అనుమానించావా?

భ: లేదు. కాని ఆత్మ సాక్షాత్కార మెట్లో తెలుసుకొనే కోరిక ఉంది. దానికి మార్గమేమైనా ఉందా?

మః ప్రయత్నించు. బావి త్రవ్వడం ద్వారా నీరు ఎలా లభిస్తుందో అదే విధంగా నీవు ఆత్మ విచారం చేసి ఆత్మను పొందు.

భ: కొందరికి బావిలో నీరు సులభంగా పడుతుంది. ఇతరులెంతో శ్రమ పడాలి.

మ: కాని నీకు తడిపైనే తెలుస్తోంది కదా! అట్లే ఆత్మ నీకు సుమారుగా తెలుస్తోంది కదా. దాని ననుసరించు. ప్రయత్నం ఆగేక ఆత్మప్రకాశమవుతుంది.

భ: మనస్సు అంతర్ముఖం కావడానికేం చేయాలి?

మ: అభ్యాసం. వివేకస్థితిలో మనస్సు ఆత్మసిద్ధికై, తనకుతానే నష్టమయ్యే మార్గాన్ని ఎన్నుకుంటుంది.

భ: మనస్సును నశింపచేసే దేవిధంగా?

మ: నీరును తడియార్చి పొడినీరుగా మార్చగలమా? ఆత్మ నన్వేషించు, మనస్సు నష్టమౌతుంది.

## భాషణములు 241

భ: దుఃఖం రాకుండా చేసేదెలా?

మ: దుఃఖానికొక రూపున్నదా? దుఃఖమంటే, అనవసరమైన ఆలోచన.

మనస్సుకు దానిని నిగ్రహించే శక్తి లేకపోవడం వలన ఇది జరుగుతుంది.

భ: మనస్సు కా శక్తి కలిగే ఉపాయమేంటి?

మ: దేముని ఆరాధించడం వలన.

భ: లోని దైవాన్ని ఆరాధించడం చాలా కష్టం.

మ: దైవాన్ని వదలుకో, నీ ఆత్మనే పట్టుకో.

భ: మంత్రజపం చేసే దెలాగ?

మ: రెండువిధాలు స్థూలం, సూక్ష్మం. రెండవది దానిపై ధ్యానం. అది మనస్సుకు పుష్టినిస్తుంది.

భ: కాని ధ్యానానికి మనస్సు నిశ్చలం కావడం లేదు.

మ: అది మనస్సుకు శక్తి లేకపోవడం వలన.

భః సంధ్యావందనం యాంత్రికంగా చేస్తాము. అలాగే ఇతర మతాచారాలూనూ, వాని వల్ల ప్రయోజనమేమి? అంతకన్నా అర్థం చేసుకొని మంత్రం జపించుట మేలుకదా?

మ: ఊం, ఊం.

## భాషణములు 242

ఒక గుజరాతీ భక్తుడు ఇలా అడిగారు.

భ: మరణించిన పిదప పుణ్యఫలమో పాపఫలమో, దేన్ని ముందనుభవించటమో ఎన్నిక మనదైనట్లు చెపుతారు. అది నిజమా?

మ: మృతి తర్వాతి విషయ చర్చ ఇపుడెందుకు? నేను పుట్టెనా, నా పూర్వకర్మఫలం అనుభవిస్తున్నానా మొదలైన ప్రశ్నలు ఎందుకు? ఇక కొంచెం సేపులో నీవు నిద్రిస్తావు. ఆ నిద్రలో నీవీ ప్రశ్న లడగవు. ఎందువల్ల? నిద్రించిన నీకూ మేల్కొనియున్న నీకూ భేదమున్నదా? లేదే? మరి నిద్రలో అడుగని ఆ ప్రశ్న లిపుడెట్లు వస్తున్నవి? కనుక్కో

## భాషణములు 243

ఒక నడివయస్సు వ్యక్తి, కొంచెం బలహీనంగా ఉన్న అతడు, చేతిలో కర్రతో వచ్చి భగవాన్ ముందు మోకరిల్లి నమస్కరించి కూర్చున్నాడు. కొంతలో సవినయంగా లేచి ఆ కర్రను, అది గంధపు చెక్కతో చేసినదని చెప్పుతూ భగవాన్కు అర్పించబోయినాడు. భగవాన్ కర్రను వానిసే ఉంచకొమ్మన్నారు. “భగవాన్ కిచ్చేవేవి భద్రంగా ఉండవు. అది అందరిసొత్తే గాని కొందరే వాని కాశపడతారు. భగవాన్ అనుమతించినా, లేకున్నా, ఎవరో ఒక్కరు దాన్ని తీసుకొని పెడతారు. అప్పుడా ఇచ్చినవాని మనస్సు కష్టపడుతుంది.”

అప్పటికీ అతడు సవినయంగానే బలవంతం చేశాడు. వాని ప్రార్థనలను భగవాన్ కాదనలేక “దానిని భగవత్ప్రసాదంగా నీ వుంచుకో” అన్నారు. “సరే, కాని ముందు భగవాన్ దానిని గ్రహించి, ఆపై ఆశీస్సులతో తన కిం"డని అతడు వేడినాడు. భగవాన్ దానిని తీసుకొని, ఆఘ్రాణించి, బాగుందని తల నూపి మెచ్చి వానికి తిరిగి యిస్తూ “దీన్ని నీవు ఉంచుకో” ఇది ఎప్పటికీ నన్ను మరవనీయదు” అన్నారు.

## భాషణములు 244

ఒక మహారాణి సాహెబా, మృదువుగా, మందంగా, స్ఫుటంగా మాట్లాడింది: మహారాజ్, మిమ్మల్ని చూచే సౌభాగ్యం నాకు కలిగింది. మీ కంఠ ధ్వనిని వీనుల విందుగా విన్నాను.

“మానవు డభిలషించే సకల సంపదలూ నాకున్నాయి” ఆమె కంఠం రుద్ధమయింది -- ఎట్లో మనస్సు దిటవు చేసుకొని, మాట సాగించింది. "నేను కోరేవన్నీ, ఒక మానవుడు కోరదగ్గవన్నీ నాకున్నాయి. కాని... కాని... కాని... నాకు... నాకు మనశ్శాంతి లేదు. ఏదో దాన్ని అడ్డుతున్నది...బహుశః నా విధి... నా ప్రారబ్ధం ...

కొంతసేపు నిశ్శబ్దంగా గడచిపోయింది. అంత మహర్షి సహజ మధురంగా ఇలా అన్నారు

“సరి చెప్పవలసినదంతా అయింది. మంచిది. విధి యంటే ఏమి? విధియంటూ ఏమీలేదు. స్వాత్మార్పణం చేసుకో. అంతా చక్కబడుతుంది. అంత భారమూ దైవం పైన వెయ్యి. ఏ బరువూ నీపై ఉంచుకోవద్దు. అప్పుడు విధి నిన్నేమి చేయగలడు?

భక్తురాలు: శరణాగతి అసాధ్యము.

మ: నిజమే. ఆరంభంలో పూర్ణశరణాగతి కష్టమే. పాక్షిక శరణాగతి అందరికీ సాధ్యమే. కాలక్రమేణ అదే పూర్ణశరణాగతికి దారి తీస్తుంది. సరి; స్వార్పణం అసాధ్యమైతే, మరేం చేయాలి? మనశ్శాంతి లేదన్నావు. దాన్ని నీవుగా తెచ్చుకోలేకున్నావు. అది శరణాగతి వలననే వస్తుంది.

భ: పాక్షిక శరణాగతి చేస్తే కూడా ప్రారబబలం తగ్గుతుందా?

మ: తప్పకుండా.

భ: ప్రారబ్ధం పూర్వకర్మవలన కదా?

మ: భగవంతుని శరణుజొచ్చితే, భగవంతుడే దాన్ని చూచుకుంటాడు.

భ: ప్రారబ్ధం దైవనిర్ణీతమే, దైవమే దానినెలా తొలగిస్తాడు?

మ: అన్నీ ఆయన లోనివే.

భ: దేముని చూడడం ఎలాగ?

మ: లోపల. మనస్సు నంతర్ముఖం చేస్తే, లోని చైతన్యంగా భగవంతుడు దర్శనమిస్తాడు.

భ: భగవంతుడందరిలో, మనం చూచే అన్నిటిలో నున్నాడు. అన్నింటిలో మనం దైవాన్నే చూడవలె నంటారు గదా.

మ: దైవమందరిలోనూ, చూచేవానిలోనూ, ఉన్నాడు. దైవాన్ని మరెక్కడ చూడటం? మనకు వెలిగా వానిని చూడలేము. అతన్ని లోనే తెలిసికోవాలి. విషయాలను చూడడానికి మనస్సు అవసరం. అందరిలో భగవంతుని భావించటం మనస్సు యొక్క పని. కాని మనస్సు నిజం కాదు. మనస్సును తొలగిస్తే లోనతోచే చైతన్యమే దైవము.

భ: అందమైన రంగులెన్నో ఉన్నాయి. వానిని చూస్తే ఎంతో ఆనందం కల్గుతుంది. వానిలో భగవంతుని చూడవచ్చు.

మ: అవన్నీ మనో కల్పనలు. (మనోభావనలు)

భ: రంగులు మాత్రమే కాదు, మరెన్నో ఉన్నాయి. రంగులను ఉదాహరణగా మాత్రమే చెప్పేను.

మ: అవి కూడా మనో కల్పితాలే. (మనో భావనలే)

భ: దేహమూ ఉంది. ఇంద్రియాలు, మనస్సు ఉన్నాయి. విషయ పరిజ్ఞానానికై ఆత్మ వీని నన్నింటినీ ఉపయోగిస్తుంది.

మ: విషయాలూ, భావనలూ, అన్నీ మనస్సు కల్పించినవే. అహంకారము (లేదా నేను-ఆలోచన) పుట్టి తర్వాత మనస్సు పుడుతుంది. అహంకారం ఎక్కడనుండి పుడుతోంది? అహంకారం పూర్ణజ్ఞానం నుండి (అనంత చైతన్యం నుండి) పుడుతోంది.

భ: ఆత్మ అదేనా?

మ: ఆత్మ, అహంకారం, మనస్సు - అన్నీ మాటలు మాత్రమే. ఆ విధమైన సత్యములు లేవు. చైతన్య మొక్కటే యథార్థం.

భ: ఆ చైతన్యం ఆనందాన్నీయలేదు.

మ: దాని స్వభావమే ఆనందము. ఉన్నదానంద మొక్కటే; ఆనందించు వ్యక్తి ఎవ్వడూ లేని ఆనందము.

ఆనందము, ఆనందించువాడు - ఈ రెంటి సమ్మేళనమే అది.

భ: సాధారణ జీవితంలో సుఖ దుఃఖాలున్నాయి. కేవలం సుఖంగానే ఉండవచ్చు కదా?

మ: మనస్సు నంతర్ముఖం చేసి, అందులో నిల్పితే కలిగేది సంతోషం; ఆ మనస్సును వెలికి పంపిస్తే, కలిగేది దుఃఖం. ఉన్నది సుఖమే. దాని అభావమే దుఃఖం. ఆనందమే మనష్యుని సహజ స్వభావము.

భ: ఆత్మ అదేనా?

మ: ఆత్మా, దైవమూ, రెండూ మనోభావనలే.

భ: దైవము గూడా మనోభావమేనా?

మ: అవును. నిద్రలో నీవు దైవాన్ని తలచుకుంటున్నావా?

భ: కాని నిద్ర ఒక స్తబ్ధ స్థితి గదా?

మ: దైవము సత్యమైతే, సదా ఉండాలి నీవు నిద్రలో వున్నావు. మెలకువలో వున్నావు -- అప్పుడూ యిప్పుడూ సమమే. నీ 'ఆత్మ'లాగే దైవమూ అయితే, ఆత్మలాగే దైవమూ నిద్రలో ఉండాలి? దైవభావన మెలకువలోనే వస్తుంది. ఇప్పుడు ఆలోచించేదెవరు?

భు నేను.

మ: ఈ 'నే'నెవరు? నేనన్న దెవరు? దేహమా?

భ: దేహమే మాట్లాడేది.

మ: దేహం మాట్లాడదు. నిద్రలో మాట్లాడిందా? ఈ 'నేను' ఎవరు.

భ: నా దేహంలోని 'నేను'.

మ: నీవు దేహంలో ఉన్నావా, వెలుపలనా?

భ: నిస్సందేహంగా నా దేహంలోనే.

మ: నీ నిద్రలో గూడ అది అట్లేయని నీకు తెలుసా?

భ: నేను నిద్రలో గూడ నా దేహంలోనే ఉన్నాను.

మ: అలాగని అపుడు నీకు తెలుసా?

భ: నిద్ర ఒక మంద స్థితి.

మ: నిజమేమంటే నీవు లోనా లేవు, వెలుపలా లేవు. నిద్ర చైతన్యము యొక్క

ఒక అవస్థ.

భ: అయితే మెలకువకన్న నిద్రావస్థే మేలు గదా?

మ: అవస్థల్లో ఉచ్చనీచములు లేవు. జాగ్రన్నిద్రా స్వప్నములు. ఈ మూడవస్థల్లోనూ నీవు సమంగానే ఉన్నావు. నిద్ర ఒక సుఖావస్థ; అప్పుడే బాధాలేదు. ఒకటి లేదేయని, బాధయని - యిలాంటి భావనలన్నీ జాగ్రత్ అవస్థలోనే కలిగేవి. నిద్రాజాగ్రత్తుల అంతరంలో కల్గిన ఈ మార్పు స్వరూపమేమి? రెంటిలోనూ నీవు సమమే కాని, తేడా అంతా సౌఖ్యంలోనే.

ఎందువల్ల? జాగ్రత్తులో మనస్సు వెలుపలికి వచ్చింది గనుక. ఈ మనస్సు 'నే'నన్న భావన పుట్టేక మొదలౌతుంది. ఈ "నేను" ఆలోచన పుట్టేది చైతన్యంలో. దానిలో సంస్థితుడైన వానికి సదా సుఖమే.

భ: నిద్రావస్థలో మనస్సు అణగుతుంది. అట్టి అవస్థ అధమమని నా భావన.

మ: అలా అయితే అందరూ నిద్రను కోరుకొంటారేం?

భః బాగా అలసిపోతే దేహం నిద్రను కోరుతుంది.

మ: నిద్రించేది దేహమా?

భ: అవును. ఆ స్థితిలోనే శరీరంలో కలిగే మార్పులు, అరుగుదలకు మరమత్తు జరుగుతుంది.

మ: ఉండనీ, అయితే నిద్రించేది దేహమే; మేల్కాంచేది దేహమే. అవునా? ఇంతకు మునుపే, నిద్రలో మనస్సు అణగి ఉంటుందన్నావు. ఆ మూడవస్థలూ మనస్సువే.

భ: అవి ఇంద్రియముల ద్వారా ప్రవర్తించే ఆత్మకు సంబంధించిన అవస్థలు కావా?

మ: అవి ఆత్మవి కావు, దేహానివీ కావు. ఆత్మనేది కళంకితం చేయజాలదు. అదే ఈ మూడవస్థలకూ ఆధారము. జాగ్రదావస్థ పోతుంది, నేనున్నాను; స్వప్నావస్థ పోతుంది, నేనున్నాను; నిద్రావస్థ కూడా అయిపోతుంది. నేనున్నాను. అవి మాటిమాటికి వస్తూపోతూ ఉంటాయి. నే నట్లే ఉన్నాను. అవి సినీతెరపై కదలిపోయే చిత్రాల వంటివి. అవి తెరను బాధించవు. అలాగే నేను - ఈ అవస్థలెన్ని మారినా, వానిచేత నేను బాధితుణ్ణి కాను. అవి దేహ సంబంధులే అయితే, నిద్రలో నీవు దేహాన్నెరుగుదువా?

భ: ఎరుగను.

మ: అక్కడ దేహమున్నది తెలియకుండా, దేహము నిద్రిస్తున్న దనడం ఎలా వీలవుతుంది?

భ: మేల్కొన్న తరువాత గూడ దాన్ని చూసాము గనుక.

మ: దేహబుద్ధి యొక ఆలోచన. ఆ ఆలోచన మనస్సుది. మనస్సు 'నేను' ఆలోచన తర్వాత జనిస్తుంది. మూలభావన 'అహం'. (నేను) దాన్ని పట్టుకుంటే ఇతర తలపులన్నీ నశిస్తాయి. అప్పుడు మనస్సు, దేహము, అహంకారం సైతం వుండవు.

భ: అప్పుడు మిగిలేది యేమిటి?

మ: శుద్ధాత్మ.

భ: మనస్సును మాయంచేసేదెలా?

మ: దానికి ఏ యత్నాలు వద్దు. అట్టి ఆలోచనలు గాని, కోరికగాని, దేనికది ఒక ఆలోచనే. ఆలోచించే వానిని వెతికితే ఆలోచనలు మాయమౌతాయి.

భ: వాటంతట అవే మాయమౌతాయా? ఇది చాలా కష్టం అనిపిస్తోంది.

మ: అవి యథార్థంగా కావు గనుక; మాయమౌతాయి. కష్టమనుకోడమే, ఆత్మసిద్ధికొక ఆటంకము. దాన్ని దాటాలి. ఆత్మగా ఉండడం అంత కష్టం కాదు.

భ: దైవాన్ని బాహ్యంగా చింతించడం తేలికనిపిస్తుంది. కాని ఆలోచనలు లేకుండుటం చాలా కష్టమనిపిస్తోంది.

మ: అది అర్థం లేనిది. బయటవి చూడటం తేలికానూ, లోనివి చూడటం కష్టమూనా? నిజానికి దానికది విరుద్ధం.

భ: కాని నాకది అర్థం కావడం లేదు. అది చాల కష్టంగా వుంది.

మ: కష్ట మనుకోటమే పెద్ద అడ్డు. కొద్దిగా అభ్యాసం చేస్తే, నీకు మరోవిధంగా అనిపిస్తుంది.

భ: ఆ అభ్యాసమేమిటి?

మ: "నేను" యొక్క మూలాన్ని కనుగోటం.

భ: అది పుట్టుకకు ముందుగల స్థితి.

మ: పుట్టుచావుల మాటెందుకు? నిజంగానే నువ్వు పుట్టావా? మనస్సు మొదలైతే దాన్ని పుట్టుక అంటారు. మనస్సు తర్వాత దేహబుద్ధి కలుగుతుంది. దేహం అగుపిస్తుంది. ఆ తర్వాత పుట్టువు. దానికి పూర్వపుస్థితి; చావు, దాని తర్వాతి స్థితి -- అన్నీ మనోభావనలే. ఆ పుట్టు వెవరిది?

భ: నే నిప్పుడు పుట్టిలేనా?

మ: దేహము దృష్టితో చూస్తే పుట్టుక నిజమే, కాని దేహం "నేను" కాదు. ఆత్మ పుట్టదు, చావదు. కొత్త యేమీ లేదు. ఋషులు, అన్నింటినీ ఆత్మనుండి, ఆత్మలోనే చూస్తారు. దానిలో అభిప్రాయభేదం లేదు. అందుచేత పుట్టుకా లేదు, గిట్టుటా లేదు.

భ: నిద్రావస్థ అంత మంచిదైతే ఏల అందులోనే ఎప్పుడూ ఉండి పోకూడదు?

మ: మనిషి సదా నిద్రావస్థలోనే ఉన్నాడు. ఇప్పటి మెలకువ స్వప్నానికి పేరుగాదు. స్వప్నం నిద్రలోనే గదా వచ్చేది. ఈ మూడవస్థల్లోనూ సమానము నిద్రే. ఈ మూడవస్థల ఆవిష్కరణమూ స్వప్నమే. ఆ స్వప్నము, దాని మటుకది మరల నిద్రే. ఇట్లు ఈ నిద్రాస్వప్నావస్థలు నిరంతరంగా సాగేవే.

ఈ అవస్థలవలనే పుట్టు చావులూ నిద్రలోని కలలే. నిజానికి పుట్టుకా లేదు, చావూ లేదు.

## భాషణములు 245

కుమారి గుల్బాయి, కుమారి షిరీన్బాయి బైరాంజీ, ఇద్దరు పార్సీవనితలు, భగవాన్నెన్నో ప్రశ్న అడిగారు. అన్నిటిలో ప్రధానమైనదిగా ఒక విషయమే ఉంది. ఆత్మ అహంకారాని కవ్వలిది అని తెలుస్తున్నది. నే నెరిగినదంతా సిద్ధాంత రీత్యానేగాని, అనుభవపూర్వకం గాదు. ఆత్మసాక్షాత్కారం అనుభవపూర్వకంగా ఎలా పొందాలి?

మహర్షి: ఆత్మస్థితి క్రొత్తగా పొందవలసింది గాదు. అది పూర్వంనుంచి ఉన్నదే. 'నాకాత్మ సాక్షాత్కారం కాలేదన్న తలపును పోద్రోయటమే చేయవలసిన పని.

భ: దానికై ప్రయత్నం అక్కరలేదన్న మాట.

మ: -లేదు. నిశ్చల మనస్సు లేదా శాంతియే. ఆత్మసాక్షాత్కారము. ఆత్మలేని క్షణమంటూ లేదు.

“నా కాత్మానుభవం కాలేదు" అని ఏపాటి సందేహమున్నా, ఆ ఆలోచనలను తొలగించే ప్రయత్నం చెయ్యవలసిందే.

అనాత్మయందు ఆత్మబుద్ధి ఉండటంవల్లే, ఈ ఆలోచనలు వస్తాయి. అనాత్మపోతే మిగిలేది ఆత్మయే. ఎవరికిగాని, దేనికిగాని తావీయవలసి వస్తే అచ్చట ఉంచిన వస్తువులను తీసివేస్తే చాలు, కొత్తగా జాగాని ఎక్కడనుండైనా తీసుకు రాగలమా? అంతేగాదు. ఎంత ఇరుకైనా, అక్కడ జాగా ఉంటుంది.

తలపులు లేనంత మాత్రాన అది శూన్యమని కాదు. శూన్యాన్ని గుర్తించే వాడొకడుండాలి. జ్ఞానాజ్ఞానాలు రెండూ మనస్సువే. అవి ద్వంద్వ భావనలవల్ల జనించినవి. వానికినీ అవ్వలిది ఆత్మ. అది కేవలం తేజమే. ఆత్మను మరొక ఆత్మతో చూడవలసిన పని లేదు. ఆత్మలు రెండుండవు. ఆత్మకానిది అనాత్మ. - అనాత్మ ఆత్మను చూడలేదు. ఆత్మకు చూపు లేదు, వినికిడి లేదు. వీని కవ్వల ఏకైకమై, శుద్ధచైతన్యమై ఆత్మ వెలుగొందుతుంటుంది.

ఒకావిడ, మెడలో నగ మెడలో నుండగానే, పోయినదనుకొని, అన్నిచోట్లా వెదకుతూ స్నేహితులు ఒకరు చూపగా, మెడలో ఉన్నదని గుర్తించింది. ఆమె తనకుతాను కల్పించుకొన్నవెన్నో చూడు; నష్టభావన, అన్వేషణలో ఆతురత, తిరిగి కనుగొన్న ఆనందము. అట్లే నీవు వెదకినా, వెదకక పోయినా ఆత్మ సదా ఉండనే ఉంది. పోయిన నగ మరల లభించిందని ఆమె అనుకొన్న రీతిగానే, అజ్ఞానం తొలగి, మిథ్యాత్మబుద్ధి నశించగానే, నిరతం ఉంటున్న ఆత్మ ప్రకాశమానమవుతుంది. అదే ఆత్మానుభవమంటే, ఇదేమీ కొత్తవిషయం కాదు. అది అజ్ఞానం తొలిగించడం తప్ప వేరేమీ కాదు.

శూన్యం, మనస్సును వెదకుటలో కల్గు చెడు ఫలితము. మనస్సును సమూలముగా ఛేదించాలి. ఆలోచించేదెవరో, అన్వేషించేదెవరో గమనించు. వారుగా నీవు ప్రతిష్ఠితవుకా. అన్ని ఆలోచనలూ మాయమౌతాయి.

భ: అంతట అహంకారం -- ఆలోచించేవాడు మిగులడా?

మ: ఆ జీవాత్మ శుద్ధము. దానికి ఆలోచనలు లేవు. అది ఆత్మకు భిన్నం కాదు. మిథ్యాత్మభావన ఉన్నంత కాలం సందేహాలు ఉంటాయి. ప్రశ్నలూ వస్తాయి. వాని అంతం ఉండదు. అనాత్మ నంతం చేస్తేనే సందేహాలు ఆగుతాయి. దాని ఫలం, ఆత్మసిద్ధి. ఆ పైన సంశయించుటకుగాని, ప్రశ్నించుటకుగాని ఎవ్వరూ ఉండరు. ఈ సందేహాలన్నీ తముతామై తొలగిపోతాయి. మాటలెన్నైనా తృప్తి నీయవు. యోచించువానిని పట్టుకో. ఆలోచించే వాడిని పట్టుకోకపోతేనే, విషయాలు బయట కనిపిస్తాయి లేదా మనస్సులో సందేహాలు వస్తాయి.

భాషణములు 246

ఒకరి భావాలు మరొకరికి తెలిపేందుకై భాష ఒక సాధనము. ఆలోచనలు వచ్చిన తరువాతనే, భాషకు ఉపయోగం; "నేను" ఆలోచన తర్వాతనే, అన్ని ఆలోచనలూ, అన్ని సంభాషణల కాధారం 'నే'నన్న తలపే. ఒక వ్యక్తి ఆలోచనలు లేకుండా ఉంటే, అతడు విశ్వజననీయమైన భాష అయిన మౌనం ద్వారా ఇతరులను అర్థం చేసుకుంటాడు.

మౌనం సదాప్రసంగి. అది ఆగని భాషాప్రవాహం. మాటలు దాన్ని అడ్డే కట్టలు. వాక్కులు ఆ మౌనభాషకు అవాంతరాలు కల్పిస్తాయి. తీగలో విద్యుచ్ఛక్తి ప్రసారిత మౌతున్నది. ఆ ప్రసారం ఆపితే ఒక దీపం వెలిగించేదిగనో, ఫేన్ ను కదలించేదిగనో మారుతుంది. అలాగే మౌనం నిర్నిబంధన ప్రవాహమయిన భాషా స్రవంతి. మాటలు దాని కానకట్టలు.

ఏండ్ల తరబడి సంవాదములలో తెలియని విషయం, మౌనంలో, వారి నల్వురు శిష్యులకు శ్రీ దక్షిణామూర్తి ప్రసాదించిన లాంటి మౌన సన్నిధిలో ఒక్క త్రుటిలో అర్థమవుతుంది. మౌనం అత్యుత్తమమూ, శక్తివంతమూ అయిన భాష.

భాషణములు 247

భ: "అహ-మహం" స్ఫురణ నిర్వికల్పసమాధి సమమా, దానికి పూర్వమే ఉన్నదా?

మః హృదయంలోని సూక్ష్మరంధ్రం ఎప్పుడూ మూసికొనే వుంటుంది. విచారము దాని తలుపు తెరుస్తుంది - అహ -మహం స్ఫూర్తి అప్పుడు ప్రకాశమానం అవుతుంది. అది సమాధి సమమే.

భ: మూర్ఛకు నిద్రకు భేదమేమి?

మ: నిద్ర అకస్మాత్తుగా కలిగి మనిషిని బలవంతంగా లోగొంటుంది. మూర్ఛ ఆలస్యంగా వచ్చేది; చివరివరకూ దాన్ని ప్రతిఘటించే యత్నం అల్పాల్పమైనా ఉంటుంది. మూర్ఛలో ఆత్మానుభవం సాధ్యం: కాని నిద్రలో అసాధ్యం.

భ: మృతికి ముందు, ఆఖరి క్షణంలో ఉండే స్థితి ఎటువంటిది?

మ: మనిషి శ్వాసకై కష్టపడుతూ, పెద్ద ఊపిరి తీసుకొనేప్పుడు, వానికి దేహస్మృతి ఉండదు. మరొక దేహాన్ని చిక్కించుకొని, ఈ దేహానికి దానికి మధ్య ఇటూ అటూ ఊగిసలాడుతుంటాడు. ఊపిరి పీల్చుకునేటప్పుడు ఒక్కొక్క మారు అతి దీర్ఘంగా ఊపిరి తీసుకోవడం జరుగుతుంది. అతడిప్పటి దేహంపై అభిమానాన్ని పూర్తిగ త్రెంపుకోలేక ఊగిసలాడడాన్ని అది సూచిస్తుంది. నా తల్లి విషయంలోనూ, పళనిస్వామి విషయంలోనూ నేనది గమనించాను.

భ: ఆ అవస్థలో ఉండే నూతన దేహం వాని తర్వాత జన్మను సూచిస్తుందా?

మ: అవును. ఊపిరికై కొట్టుకొనే సమయంలో వ్యక్తి స్వప్నంలాంటి స్థితిలో ఉంటాడు. అప్పటి పరిసరాలు అతనికి తెలియవు.

(అమ్మ చనిపోయేప్పుడు శ్రీభగవాన్ ఆమె యొద్ద ప్రొద్దుట 8 గంటల నుండి రాత్రి 8 గంటల వరకు, ఆమె చనిపోయినంతవరకూ ఉన్నారు. అంతసేపూ వారి ఒక చేయి ఆమె శిరస్సుపైన రెండవది ఆమె హృదయం మీదా ఉంచేయున్నారు. దాని కర్ణాన్ని వారే వివరించారు. ఆమె హృదయస్థానంలోనే లీనమయ్యేవరకు, అమ్మకూ తనకూ ఘర్షణ జరిగిందని చెప్పారు.

అంటే జీవుడు ఎన్నెన్నో సూక్ష్మానుభవ పరంపరలను గడుపుతాడు. భగవాన్ స్పర్శ ప్రసరింపచేసిన శక్తి జీవుని వెలికి నిర్గమించనీయక, హృదయ స్థానానికి చేరుస్తుంది.

సంస్కారాలుండడం వలన ఈ ఘర్షణ ఉంటుంది. వారి స్పర్శనుండి "ఉద్గమించిన ఆధ్యాత్మిక శక్తికిని అంతర వాసనలకును పోరు జరుగుతుంది. దాని చివర ఆ వాసనలు సర్వనాశమై, జీవుడు హృదయంతో చేరి, అందు నిత్యశాంతుడూ ముక్తుడుగా నిలుస్తాడు.

జీవుడు హృదయం చేరుకున్నట్లు ఏదో విశిష్ట చలనం, చిరుగజ్జెల రవళివలె, మహాత్ములకు తెలుస్తుంది.

పళనిస్వామి మరణశయ్యపై నున్నపుడు మహర్షి యతని పక్కనే ఉన్నారు. ఆ చెప్పిన శబ్దం వినగానే మహర్షి వానిపైనుండి తమ చేతిని తీసి వేసారు. కాని తక్షణమే పళనిస్వామి కండ్లు తెరచుకొన్నవి. అంటే వాని ప్రాణము కండ్లనుండి వెలికి పోయిందన్నమాట. అతనికి పునర్జన్మ ఉత్తమం అనేగాని మోక్షం లభించలేదు. పళనిస్వామితోడి ఈ

యనుభవం వల్ల, వారి అమ్మగారి విషయం వచ్చినపుడు మహర్షి తన చేతిని, ఆ శబ్దం విన్న తరువాత గూడ, ఎక్కువ సేపే ఉంచారు. అట్లామె ముక్తి సునిశ్చితమైంది. ఈ విషయం ఆమె ముఖమూ దేహమూ అంత శాంతంగా, సుప్రసన్నంగా ఉండడం బట్టి దృఢపడింది.)

## భాషణములు 248

శ్రీ భగవాన్ వచించారు -
జ్ఞాని అజ్ఞానిగూడ "నేను దేహము" నంటారు. ఇందులో భేదమేమి? రెంటికినీ సమముగా 'నేను' అన్నది నిజం. దేహం పరిమితం. అజ్ఞాని "నేను"ను దేహానికి పరిమితం చేస్తాడు. నిద్రలో 'నేను' దేహప్రసక్తి లేక స్వేచ్ఛగా ఉంటుంది. ఆ 'నేను' ఇప్పుడు మెలకువలో గూడ ఉంది. దేహం లోపలనే ఉన్నానని భావించినా, 'నేను' దేహం లేకనే ఉన్నది. ఇచట భ్రాంతి, "నేను దేహము" అనడం కాదు.

ఈ విషయాన్ని "నేను" అనడం భ్రాంతి. ఎందుకంటే దేహము జడము గనుక అట్లనలేదు. తప్పిదమేమంటే "నేను"ను నేనుకాని దానితో సరిబెట్టడం. 'నేను' జడము కాదు. "నేను" అచేతనమైన శరీరం కాజాలదు. దేహం కదలికను 'నేను'గా భ్రమజెందుటవల్లనే దఃఖం కల్గుతుంది. దేహం ప్రవృత్తమైనా, కాకపోయినా, 'నేను' స్వేచ్ఛగా, సుఖంగా నిలుస్తుంది. అజ్ఞానికి, 'నేను' దేహమాత్రమే. ఉన్న భ్రాంతే అది. జ్ఞానికి, దేహంతో సహా సర్వమూ 'నేను'లో ఇమిడి ఉన్నవి. ఈ రెంటికీ నడుమ అడ్డంగా మరేదో విషయం వచ్చి యింత అవ్యవస్థ కలిగిస్తున్నదనడం స్పష్టమే.

న్యాయవాది శ్రీ వైద్యనాథయ్యర్:

భ: జ్ఞాని తాను దేహాన్నంటే, చనిపోయినపు డతని గతియేమి?

వ: అతనికి దేహాత్మ బుద్ధి ఇప్పుడు కూడా లేదు.

భ: ఇంతకుముందు, జ్ఞానికూడ తాను దేహాన్నంటాడని సెలవిచ్చారే.

మ: అవును. కాని అతని 'నేను'లో శరీరం ఒక భాగం. ఆయన దృష్టిలో ఆత్మకు భిన్నం మరేమీ ఉండదు. దేహం నశిస్తే, అతని 'నేను'కు పోయేదేమీ లేదు. దేహము చనిపోయా ననుకొంటే, ఈ ప్రశ్నను దాని నడగమను. అది జడం, గనుక అడగలేదు. "నేను" ఎప్పుడూ చావదు, ఆ ప్రశ్న నడగనూ అడగదు. ఇక చనిపోయే దెవరు? ప్రశ్నించే దెవరు?

భః మరైతే, శాస్త్రాదులన్నీ ఎవరికి? అవి యథార్థమైన 'నేను' కక్కరలేదు. నిజముకాని "నేను" కొరకే ఇవన్నీ. ఆత్మకు వానితో పని లేదు. నిజంకాని దానికోసం ఇన్ని శాస్త్రాదు లుండటం ఆశ్చర్యం కదా!

మ: అవును. నిజమే. మృత్యువొక తలపు. అంతకుమించి మరేమీ కాదు. యోచించే వానికే అన్ని ఇబ్బందులూ. ఆ ఆలోచించేవాణ్ణి చెప్పమను, చనిపోయాక వాని కేమవుతుందో. నిజమైన 'అహం' మౌనంగా వుంటుంది. ఎవ్వరూ 'నేనిది', 'నే నది కాను' అనుకోగూడదు; ఇదీ, అదీ, కావడమే తప్పు. అవి అన్నీ పరిధులే. 'అహమస్మి'యే నిజం. "నేను ఉన్నాను" మాత్రమే నిజం. మౌనం "నేనే". 'నేనిది'యని యొకడంటే, 'నే నది'యని మరొకడంటాడు. అట్లే ప్రతివాడూ. ఆలోచనలతో పరస్పర ఘర్షణ. ఫలితము ఇన్నిమతాలు. ఇంతకూ సత్యం మాత్రం అదున్నట్లే ఉంటుంది. రాగాదులవల్ల ప్రతిరోధాల వల్ల ఏవిధంగానూ బాధితంగాదు.

భ: మృతియంటే ఏమి? దేహం చనిపోవడం గాదా?

మ: నిద్రలో నీవు కోరేది అది: మరి ఇందులో ఇబ్బందేమిటి?

భ: మరల మేలుకొంటానని నాకు తెలుసు.

మ: అవును. మళ్ళీ అదీ ఆలోచనే. తత్పూర్వపు తలపు 'నేను మేల్కొంటానని? జీవితాన్ని నడిపించేవే ఆలోచనలు. ఎవరైనా సరే. వాని సహజ స్వభావం ఆలోచనా విమోచనము ఆనందము.

## భాషణములు 249

మ: అజ్ఞానము రెండు విధాలు -

1. ఆత్మ విస్మృతి 2. ఆత్మజ్ఞానానికి అవరోధాలు.

ఆలోచనలను నిర్మూలించుట కుపయోగించేవి, సహాయకాలు; బీజరూపేణ ఉన్న వాసనలు క్రొత్తగా తాల్చిన రూపాలే, ఆలోచనలు. అన్ని కష్టాలకూ కారణమైన భిన్నత్వానికి అవే మూలం.

సహాయకాలు: శ్రవణమననాదులు. శ్రవణం వల్ల వెంటనే ఫలితాలు కలుగవచ్చు; శిష్యున కనుభవం హఠాత్తుగా సంభవించవచ్చు. అభ్యాసంలో పరిణతుడైన వానికే ఇది సాధ్యము.

శ్రవణం ఎంతగాసైనా, సత్యానుభవం కలుగలేదని శిష్యులు పరితపించటం కూడా చూస్తూ ఉంటాం. దానికి కారణం వాని మనస్సులోని కల్మషమే. అజ్ఞానము, సంశయము, మిథ్యాత్మ బుద్ధి -- ఈ ఆటంకాలను తొలగించవలసి ఉంది.

1. అజ్ఞానం పూర్తిగ తొలగడానికి సత్యప్రవచనం, బోధ్యవిషయం పూర్తిగ గ్రాహ్యమయ్యేవరకు, పలుమార్లు వినాలి.

2. సంశయ విచ్ఛేదానికై, విన్న దానిని తిరిగి మననం చేయాలి. చిట్టచివరకు వానికి బోధసునిశ్చితమై, సర్వసంశయాలూ పోతాయి.

3. అనాత్మను (దేహేంద్రియ మనోబుద్ధులను) ఆత్మగా నెన్నే మిథ్యాబుద్ధి పోద్రోలడానికి, చిత్తైకాగ్రతను సాధించాలి.

ఇన్నీ సాధించిన తర్వాత అడ్డులన్నీ అంతరించి, సమాధి కుదురవుతుంది. శాంతి నెలకొంటుంది.

శ్రవణ మనన నిదిధ్యాసలను మాననే రాదనే వారున్నారు. ఇవి గ్రంథపఠన మాత్రాన లభించవు. నిరంతరం అభ్యాసం వల్ల మనస్సును అంతరముఖం చేసి నిగ్రహించాలి.

'ముముక్షువు కృతోపాసకుడుగానో, అకృతోపాసకుడగనో ఉండవచ్చు. ఏ కొద్దిపాటి ప్రోత్సాహమున్నా కృతోపాసకునికి ఆత్మసిద్ధి అవుతుంది. ఏదో ఒక చిన్న సంశయం దారిలో అడ్డుకుంటుంది; గురు ప్రవచనం ఒక మారు వినగానే, అది తొలగిపోతుంది; తక్షణమే అతనికి సమాధిస్థితి వస్తుంది. పూర్వజన్మలలోనే అతడు శ్రవణ మననాదుల నాచరించి యుంటాడని భావన. వానికిక శ్రవణాదులక్కరలేదు.

అకృతోపాసకునికి ఈ సహాయకాలన్నీ అవశ్యకమే; ఎన్నిమార్లు విన్నా, అతనికి సందేహాలు కలుగుతూనే ఉంటాయి. అందువల్ల సమాధిస్థితి వచ్చేదాకా అతడా సహాయకాలను వదలగూడదు.

శ్రవణం వల్ల దేహాత్మ బుద్ధి, తదితర భ్రాంతులన్నీ వదలిపోతాయి. మననం వల్ల జ్ఞానమే ఆత్మయని ధ్రువపడుతుంది; చిత్తైకాగ్రతవల్ల ఆత్మయే అనంతమని, ఆనందమే యని అనుభవ గోచరమౌతుంది.

27 36, 1936

భాషణములు 250

మహర్షిని బాగా ఎరిగినాతడే ఒకరు వారిని గూర్చి అమర్యాదగా మాట్లాడినాడట. ఆ ఉదంతం మహర్షి నడిగా డొక భక్తుడు.

మ: “అట్లు చేయటానికి వాని ననుమతించాను. ఈ అనుమతి ఇప్పటిది గాదు. మునుపెప్పుడో ఇచ్చేసాను. ఇతరులను వానిననుసరించనీ; వారు నా మటుకు నన్ను వదలితే చాలు. వాని ఈ ప్రచారం వల్ల ఎవరూ నా వద్దకు రారా, మరీ మంచిది. అపనిందలతో నింపి నా మీద పుస్తకాలు వ్రాసి డబ్బు గడించాడా, మరీ మంచిదే. ఇతర పుస్తకాలకన్నా, అలాంటివే బాగా అమ్ముడుపోతాయి. మిస్ మెయో పుస్తకం చూడు, ఎన్ని అమ్ముడయినవో, వాడు మాత్రం అలా ఎందుకు చేయగూడదు? నిజంగానే వాడు నాకెంతో మేలు చేస్తున్నాడు" అంటూ భగవాన్ నవ్వసాగారు.

మహర్షి ఒంటరిగానున్నప్పుడు మరల అదే ప్రస్తావన వచ్చింది. తన అనుచితకృత్యంవల్ల, ఆ దుష్ప్రచారకుడు చిక్కుల్లో బడ్డట్టున్నాడు. "వాడు భద్రంగానే ఉన్నాడు కదా?” భగవాన్ ఆతురంగా అడిగారు.. వానిపై కరుణ స్పష్టం. ఇట్లన్నారు "ఇట్లు వాడు డబ్బు చేసుకొనేందుకు మనం అనుమతించినా వానికి కష్టాలు తప్పలేదు. మన ఉపేక్ష నుపయోగించుకొని సరిగా ప్రవర్తించియుంటే, వాని పని బాగానే ఉండేది. మనమేం చేస్తాం."

## భాషణములు 251

సంపన్నురాలు, తెలివైన ఆమెగా కనిపిస్తోంది. కాని దుఃఖంగా కనబడింది. ఆమె భగవాన్ నడిగింది

భక్తురాలు: మహారాజ్ జీ! తామెంతో దయాపరులనీ, ఉత్తమోత్తములనీ మేము విన్నాము. తమ దర్శనాన్ని ఏండ్లుగా కోరుకుంటున్నాము. మునుపొకమారు, పోయిననెల 14వ తేదీన ఇక్కడికి వచ్చియుంటిని కాని, ఆశించినంతకాలము దివ్యసన్నిధిలో నుండలేకపోయాను. స్త్రీని, అందులో వయస్సులో ఉన్నాను; ఇక్కడ ఎక్కువ మంది చుట్టూ ఉండడం వలన తొందరగా వెళ్ళిపోయాను. ఆ ఉన్నంతలో ఒకటి రెండు సామాన్య ప్రశ్నలకన్నా ఎక్కువ అడిగి తెలుసుకొన వీలుగాలేదు. మా ప్రాంతంలో తమవంటి సాధుపుంగవులు లేరు. నాకు కావలసినవన్నీ ఉన్నాయి. కాని ఆనందాన్ని కల్గించే మనఃశాంతి మాత్రం దుర్లభమైంది. ఆ శాంతి తమ ఆశీర్వాదం వల్లనే లభింపగలదన్న ఆశతో మళ్ళీ వచ్చాను.

మ: భక్తి నీ కోరికను తీరుస్తుంది.

భ: నాకు కావలసింది మనశ్శాంతి. అది ఎట్లు లభిస్తుందో కరుణించి నాకు తెలియచేయండి.

మ: ఆలాగే. భక్తి మరియు శరణాగతి.

భ: భక్తురాలనయ్యే అర్హత నా కున్నదా?

మ: ఎవరన్నా భక్తులు కావచ్చు. ఆధ్యాత్మిక సామాగ్రి అందరికీ వుంది. వృద్ధులైనా, యువకులైనా, స్త్రీలైనా, పురుషులైనా భక్తిని ఎవ్వరూ ఆపలేరు.

భ: నేను తెలియగోరింది ముఖ్యంగా అదే. నేను చిన్నదానను, గృహిణిని. గృహిణిగా నిర్వహించవలసిన ధర్మాలూ ఎన్నో ఉంటాయి. వానికీ భక్తికీ పొత్తుకుదురుతుందా?

మ: నిస్సందేహంగా, నీవు ఎవరు? దేహానివి గావు. శుద్ధ చైతన్యానివి. ఈ ప్రపంచము, గృహస్థ ధర్మములూ శుద్ధ చైతన్యం పై దృశ్యాలు. ఇవి శుద్ధ చైతన్యాన్ని బాధించవు. నీవు నీవుగానుంటే అడ్డుపడేది ఏమిటి?

భ: నిజమే. మహర్షి ఉపదేశవిధానం కొంతకు కొంత నాకిప్పటికే తెలుసు. అది ఆత్మవిచారము. కాని అది గృహస్థ ధర్మానికి అనుకూలమైనదా, కాదా యన్న సందేహము నన్నింకా వదలలేదు.

మ: ఆత్మ ఎప్పుడూ ఉంది. అది నీవే. నీవు తప్ప మరేమీ లేదు, నీకు వేరుగా వేరే ఏమీలేదు. ఇక అనుకూలము, ఇది విరోధము అనే ప్రశ్న లేదు.

భ: నేనింకా స్పష్టంగా అడుగుతాను. నేను ఇక్కడ క్రొత్త అయినా నా

ఉత్కంఠతకు కారణం వెల్లడించక తప్పేట్లు లేదు. నాకు పిల్లలున్నారు - ఒక

పిల్లవాడు - సత్బ్రహ్మచారి - మొన్న ఫిబ్రవరిలో గతించాడు. ఆ దుఃఖంలో నాకీ జీవితం అంటే రోతపుట్టింది. ఆధ్యాత్మిక జీవితానికి నన్నర్పణం చేసుకుందా మనుకున్నాను. కాని నా గృహిణీ ధర్మం వివిక్త జీవితానికి (retired life) తావీయడం లేదు. అందుచేత ఈ సందేహం.

మ: వివిక్త జీవనం (retired life) అంటే ఆత్మలో నిలిచియుండటం. అంతకన్న మరేం కాదు. ఉన్న పరిసరాలను విడిచి, మరో పరిస్థితుల్లో చిక్కుపడ్డంగాని, స్థూలజగత్తును మాని మానసిక ప్రపంచంలో సంచరించడం కాని, వివిక్త జీవనం కాదు.

శిశుజననం, మరణం మొదలైనవి అన్నీ ఆత్మలోనే గోచరమయ్యేవి.

నిద్రావస్థను జ్ఞప్తికి తెచ్చుకో. అప్పుడేమేమి జరిగినవో నీ వెరుగుదువా? పుత్రుడుగాని ప్రపంచంగాని నిజమే అయితే అవి నిద్రలో గూడ నీతో ఉండాలి కదా? నిద్రలో నీవు లే వనలేవు. అప్పుడు నీవు సుఖంగా లేవని కూడా అనలేవు. ఆ వ్యక్తిగానే ఇప్పుడు మాట్లాడుతూ సందేహాలు వెలిబుచ్చుతున్నావు. నీవు చెప్పేరీతిగనే నీవు సుఖంగా లేవు. కాని నిద్రలో సుఖంగా వున్నావు కదా! అప్పటికీ, యిప్పటికీ మధ్య తేడా ఏమయింది, నీ నిద్రా సుఖం పోవడానికి? అదే అహంకార విజృంభణము. నీ మెలకువతో క్రొత్తగ ప్రవేశించినది అది. నిద్రలో అహంకారం లేదు. అహంకారం జన్మయే వ్యక్తిపుట్టుక. వేరే విధంగా పుట్టుకే లేదు. పుట్టినది గిట్టనేవలె. అహంకారాన్ని మట్టుపెట్టు; మరి మృత్యుభయ ముండదు; ఒక మారు చచ్చినది మరల మరల చచ్చిపోతుందని భయంముండదు. అహంకారం మరణించిన తర్వాతగూడ 'ఆత్మ'మిగిలే వుంటుంది. అదే ఆనందం, అమరత్వమదే.

భః అది చేయడం ఎలా?

మ: ఈ సంశయాలెవరికో పరికించు. ఆ సంశయించే దెవరు? ఆ యోచించేదెవరు? అదే అహంకారం. దానిని చిక్కించుకో. ఇతర యోచనలన్నీ అంతరిస్తాయి; అహంకారం శుద్ధమౌతుంది. దాని పుట్టుక ఎక్కడో శోధించు; అదే శుద్ధచైతన్యం.

భ: ఇది చాల కష్టమనిపిస్తున్నది. భక్తిమార్గాన్ని అనుసరించవచ్చా?

మ: అది వారి వారి అభిరుచినిబట్టి, పరిణతిని బట్టి యుంటుంది. భక్తి విచారము ఒకటే.

భ: నే నన్నది ధ్యానాదుల విషయం.

మ: మంచిదే. ధ్యానం ఏదో రూపం పైన ఉంటుంది. అది ఇతర ఆలోచనలను తొలగిస్తుంది. దైవముపై ఏక చింతన, వేరు చింతనలెల్ల తరిమివేస్తుంది. అదే చిత్తైకాగ్రత. ఈవిధంగా ధ్యానం యొక్క గమ్యం, విచారం యొక్క గమ్యం ఒకటే.

భ: దైవాన్ని స్థూలరూపంలో చూడలేమా?

మ: దైవాన్ని చూసేది మానసికంగా. స్థూలరూపంలో చూడవచ్చు; కానీ అదీ భక్తుని మనస్సులోనే. దైవసాక్షాత్కారం, మరియు ఆ రూపము నిర్ణయించేది భక్తుని మనస్సే. కాని అది అంతిమ నిర్ణయం కాదు. అచట ద్వంద్వభావన ఇంకా ఉంది.

అది కలలోని దృశ్యం లాంటిది. దైవాన్ని చూసిన తర్వాత విచారం మొదలవుతుంది. అది ఆత్మానుభవంగా పర్యవసిస్తుంది. విచారమే అంతిమ మార్గం. కొందరికి విచారమార్గం సాధ్యమవుతుంది. ఇతరులు భక్తి సులభమనుకొంటారు.

భ: బ్రంటన్ మిమ్ము లండన్లో చూడలేదా? అది కేవలం స్వప్నమేనా?

మ: అవును. అతనికి దర్శనం కల్గింది. అతడు నన్ను తన మనస్సులో చూసాడు.

భ: ఇచటి ఈ స్థూలరూపాన్ని చూడలేదా?

మ: అదే, కాని అదీ అతడి మనస్సులోనే.

భ: నే నాత్మను చేరే దెలాగ?

మ: ఆత్మను చేరడం లేదు. అది చేరవలసినదైతే, ఇప్పుడిచట లేనట్లు దాన్ని క్రొత్తగా పొందవలసినట్లేగా? క్రొత్తగా వచ్చేది అంతలో పోనే పోతుంది. అంచేత అది శాశ్వతం గాదు. శాశ్వతం కానిది ప్రయత్నయోగ్యం కాదు. అందుకే అంటాను 'ఆత్మను చేరడం' అనేది లేదు అని. ఆత్మవు నీవే. నీ వదిగా ఇప్పుడే ఉన్నావు. కాని నీ యా ఆనందస్వరూపాన్ని గుర్తింపలేకున్నావు. అజ్ఞానం అడ్డువచ్చి తెరగా బ్రహ్మానందాన్ని కప్పివేస్తుంది. అన్ని యత్నాలూ ఈ తెరతీయుటకే. ఈ అజ్ఞానం ఏమిటంటే అది తప్పు జ్ఞానం. ఆత్మను మనోదేహాదులుగా భావించడమే ఈ మిథ్యా జ్ఞానం. ఇది పోవాలి. అప్పుడు ఆత్మ మిగులుతుంది.

భ: అదెట్లు జరుగుతుంది.

మ: ఆత్మవిచారం వల్ల.

భ: అది చాలా కష్టం. మహారాజ్! నాకు ఆత్మజ్ఞానం కల్గుతుందా? దయచేసి సెలవీయండి. ఎంతో కష్టంగా అనిపిస్తోంది..

మ: ఇప్పుడే నీవు ఆత్మవు. కనుకనే ఆత్మానుభవం సర్వసాధారణం. ఆత్మానుభవం సాధకుల్లో ఏ భేదాన్ని పాటించదు. నే నాత్మను కాగలనా అన్న సంశయమూ, నే నాత్మానుభవం పొందలేదన్న భావనా, అవి ఆటంకాలు; వాని నుండి గూడ విడుదల పొందు.

భ: దానికి అనుభవం కలగాలి. అనుభవం లేకపోతే ఈ ఆలోచలన బాధ నుండి విమోచన ఎలా?

మ: ఇవి నీ మనస్సులోనివే. నీవు దేహం అనుకొన్నందువల్లనే ఆ ఆలోచనలు వచ్చాయి. ఈ మిథ్యాబుద్ధి వదలిపోతే, అజ్ఞానం మాయమై, సత్యం ప్రకాశిస్తుంది.

భ: ఏమి చెప్పినా, అది కష్టమే. శ్రీ భగవాన్ శిష్యులలో కొందరు వారి అనుగ్రహం వల్ల పెద్ద శ్రమలేకనే అనుభవం పొందగల్గారు. నేనూ ఆ అనుగ్రహం కోరుచున్నాను. స్త్రీనై ఎంతో దూరంలో ఉన్న నేను కోరినన్ని మారులు వచ్చి,

కోరినంత కాలం తమ దివ్యసన్నిధిలో ఉండలేను. బహుశః మరల రానేలేనేమో, భగవాన్ నన్నునుగ్రహించాలి. మా ఊరికి తిరిగి వెళ్ళిన తర్వాత భగవాన్ను స్మరిస్తూ ఉండగోరుతున్నాను. నా ప్రార్ధనను భగవాన్ అంగీకరింతురు గాక,

మ: నీవు పోవటం ఎక్కడికి? ఎక్కడికీ పోవడమే లేదు. దేహానివే నీవు అనుకున్నా, లక్నోనుండి తిరువణ్ణామలై వచ్చింది నీ దేహమా? నీవు కార్లో కూర్చున్నావు, ఏదో వాహనము, ఒకటి కాకపోతే మరొకటి, కదలింది; చివర కిక్కడికి వచ్చినది నీవంటావు. నిజంగా నీవు దేహానివి గావు. ఆత్మ చలించదు. దానిలో జగత్తు కదలుతుంది. నీవు నీవుగానే ఉన్నావు. నీలో ఏ మార్పులేదు. ఇక పైకి నీ విక్కడినుంచి వెళ్ళిపోయినట్లే ఉన్నా నీవు అక్కడా, యిక్కడా అంతటా ఉన్నావు. ఈ దృశ్యాలు మారుతూ ఉంటాయి. అంతే!!

అనుగ్రహం మాటకి వస్తే, అది నీలోనే ఉంది. అది బాహ్యం అయితే వ్యర్ధము. ఆత్మయే అనుగ్రహము. దాని ప్రభావానికి బయట నీవు ఎప్పుడూ లేవు. అనుగ్రహము ఎప్పుడూ ఉంది.

భ: నేను కోరేదే ఇది. మీ రూపాన్ని నేను తలచుకొన్నంతనే, నా మనస్సు దృఢం కావాలి. నా తలపునకు ప్రతిగా తమవైపునుండి కూడా జవాబు రావాలి. వ్యక్తిగతంగా నా యత్నం దుర్బలం. నన్ను కేవలం దానిపైనే ఆధారపడేట్టు చేయకండి.

మ: అనుగ్రహమే ఆత్మ. ముందే చెప్పియున్నానే. నీవు భగవాన్ను జ్ఞప్తియుంచుకొంటే, అది కూడ ఆత్మ ప్రోత్సాహంవల్లనే. అందులో ఆ అనుగ్రహం లేదా? అనుగ్రహం నీలో మెదలని క్షణం ఉన్నదా? అనుగ్రహానికి దారి జూపేది, నీ జ్ఞప్తియే. అదే ప్రత్యుత్తరము, ప్రోత్సాహమూ, అదే ఆత్మ. అనుగ్రహమూ అదే. వ్యాకులత కెట్టి కారణమూ లేదు.

భః సంసారంలో ఉండిగూడా నేను ఆధ్యాత్మిక సాధన అభ్యసించవచ్చునా?

మ: ఆహా, తప్పక. అలాగే చెయాలి కదా.

భ: సంసార మాటంకము కాదా? శాస్త్రాలన్నీ త్యాగాన్ని చెప్తున్నాయి కదా!

మ: సంసారమున్నది నీ మనస్సులో. తాను ప్రపంచాన్నని, ప్రపంచం ఘోషించుటం లేదు. అది సదా ఉందా? ఉంటే, నీ నిద్రలో గూడ ఉండాలి. కదా! నిద్రలో అది లేదు గనుక, అది అశాశ్వతము; నశ్వరం గనుక, అది అసారము. అది నిస్సారము గనుక, ఆత్మ దాన్ని అణచివేస్తుంది. ఆత్మయొక్కటే శాశ్వతం, అనాత్మను ఆత్మగా భావించక పోవడమే త్యాగము. అజ్ఞానం పోగానే, అనాత్మ నష్టమౌతుంది. అదే నిజమైన త్యాగము.

భ: అట్లే అయితే, చిన్నతనంలోనే తమరెందుకు ఇల్లు వీడివచ్చారు?

మ: అది నా ప్రారబ్ధం. ఈ జన్మలో ప్రతివాని జీవితం వాని వాని ప్రారబ్ధం నిశ్చయిస్తుంది. నా ప్రారబ్ధం అలా వుంది. నీ ప్రారబ్ధం మరొక విధం.

భ: నేను గూడ సన్న్యసించ వచ్చా?

మ: అదే నీ ప్రారబ్ధమయ్యుంటే ఈ ప్రశ్నే రాదు.

భ: అయితే నేను సంసారంలో ఉండి అధ్యాత్మిక సాధన చేయవలెనన్నమాట.

సరే! నాకీ జీవితంలోనే ఆత్మలబ్ధి అవుతుందా?

మ: దీనికి ఉత్తరము ముందే చెప్పాను. నీవెప్పుడూ ఆత్మవే. శ్రద్ధతోడి సాధన వృథాపోదు. సత్ఫలితాలు తప్పక వస్తాయి.

భ: మహర్షి కరుణతో నాపై అనుగ్రహం ప్రసరింప చేస్తారా?

మ: (చిరునవ్వుతో) "ఊఁ, ఊఁ"

నమస్కారాలతో, ఆశీస్సులతో సంవాదం ముగిసింది. ఆమె వెంటనే వెళ్ళిపోయింది.

## భాషణములు 252

భక్తుడు: శ్రీ రామకృష్ణులు వివేకానందులను ఒకసారి ముట్టుకున్నారు. వెంటనే వివేకానందుడికి తీవ్రమైన ఆనందస్థితి కలిగింది. ఇది సాధ్యమా?

మహర్షి: శ్రీరామకృష్ణు లందరినీ ఆ విధంగా తాకలేదు. "ఆత్మ" ను వారు తయారు చెయ్యలేదు. ఆత్మానుభవమూ వారి తయారీకాదు. వివేకానందుడు పరిణతుడై ఉన్నాడు. ఆత్మానుభవానికై అతడెంతగానో ఆతురతపడ్డాడు. పూర్వాంగమంతా పూర్వజన్మలోనే పూర్తిజేసి ఉంటాడు. అట్టి అనుభవం పరిపక్వత ఉన్నవాళ్ళకే సాధ్యం.

భ: అందరికీ అట్టి అద్భుతాలు పనిచేస్తాయా?

మ: వారర్హులైతే. యోగ్యత ప్రధానం. బలవంతుడు దుర్బలుని అధీనం చేసుకోగలడు. దృఢ మనస్కుడు దుర్బల మనస్కుణ్ణి వశం చేసుకోవచ్చు. నీవు చెప్పినవారి విషయంలో జరిగినదదే. దాని ప్రభావం తాత్కాలికమే. వివేకానందులు ఎందుకు శాంతంగా కూర్చోలేదు? ఇలాంటి అద్భుతం జరిగేక కూడా ఆయన ఎందుకు చాలా చోట్ల తిరిగారు? ఎందుకంటే స్పర్శా ప్రభావం తాత్కాలికం గనుక.

భ: మనస్సు హృదయంలోనికి మునిగే దెలాగ?

మ: మనస్సు తాను ప్రపంచంగా విస్తరిల్లినట్లు కనబడుతుంది. విభిన్నత

పోయినపుడు అది అంతస్సారంగా నిలిచి యుంటుంది. అదే హృదయం.

హృదయంలోనికి చొచ్చుకొనడమంటే విక్షేపం లేకుండటం.

హృదయమే ఏకైక సత్యం. మనస్సు తాత్కాలిక స్థితి. హృదయంలో మునుగుట అంటే, తాను తానుగా వుండటం.

దేహాత్మ బుద్ధి కారణంగా వ్యక్తి ప్రపంచం తనకు వేరనుకుంటాడు. ఈ తప్పు తాదాత్మ్యం ఎందుకొస్తుందంటే ఆ వ్యక్తి తన సహజస్థితినుండి తప్పి తన శాంతిని తప్పాడు గనుక. అతని కొక్కటే సలహా - అసత్య భావనలను (తప్పు భావనలను) వదలి, వచ్చినదారినే వెనుకకు, మూలమునకు, వెళ్ళు. ఆత్మగా స్థిరపడు. ఆ స్థితిలో భేదాలు లేవు. సందేహాలు రావు.

అన్ని శాస్త్రాల ప్రయోజనమూ, మనుజుని వెను తిరిగి తన మూలస్థానాన్ని చేరుకోవడమే. అతడు క్రొత్తగా ఆర్జించవలసిందేమీ లేదు. తన అసత్య భావనలనూ, తెచ్చిపెట్టుకొన్న వ్యర్థాచరణలనూ వదలడ మొక్కటే వానికి కర్తవ్యము. అది మాని ఏవో కొత్తవి, విచిత్రమైనవి చిక్కించుకోవాలని ప్రయత్నం. తనకు సుఖమిచ్చేవన్నీ ఎక్కడో బయట నున్నట్లు! అసలు పొరపాటే అది.

ఆత్మలో స్థిరపడితే, అదే ఆనందము. నిశ్చలంగా ఉండటం ఆనందం కాదని బహుశ వాని భావన. అది అజ్ఞానం, అభ్యసించవలసిం దొక్కటే -- ఈ ప్రశ్న లెవరికో కనుగొనడం.

భ: కామక్రోధాదుల నణచే దెలా?

మ: ఎవరివీ ఆవేశాలూ, ఆకాంక్షలూ కనుక్కో నీ వాత్మగానుంటే నీకు భిన్నంగా మరేవీ గోచరింప వీలు లేదు. అప్పుడు అణచవలసినవీ వుండవు,

భ: మనం ప్రేమించినవా రెవరైనా మరణిస్తే దుఃఖం కలుగుతుంది. దాన్ని నివారించడానికి మార్గం. అందర్నీ సమంగా ప్రేమించటమా, అసలెవ్వరినీ ప్రేమించకనే ఉండటమా? ఏది ఉపాయం?

మ: ఒకరు చనిపోతే దుఃఖము ఆ బ్రదికి యున్నవానికి కల్గుతుంది. దుఃఖం పోగొట్టుకునే మార్గం బ్రతకకుండా ఉండడమే. దుఃఖి ఎవ్వడో వానిని నాశనం చెయ్యి. అపుడిక బాధపడే వాడుండడు. అహంకారం చావాలి. అది ఒక్కటే మార్గం.

నీవు అడిగిన రెండు పద్ధతులూ, ఒక రకమైనవే. అందరూ ఒకే ఆత్మ అయినపుడు

పేనిని ప్రేమించడం, పేనిని ద్వేషించడం?

భ: సూర్య మార్గమేమి? చంద్ర మార్గమేమి? ఆ రెంటిలో సులభమేది?

మ: సూర్య మార్గం జ్ఞానం, చంద్ర మార్గం యోగం. శరీరంలోని 72000 నాడులను శుద్ధి చేశాక, సుషుమ్నలో ప్రవేశించి మనస్సు సహస్రారాన్ని చేరుతుందనీ, అంత అమృతము బిందువులుగా కురుస్తుందనీ వారంటారు.

ఇవన్నీ మనోభావనలు. ప్రపంచ భావనలతోనే తల మున్కలుగా ఉంది. అది చాలక, యోగరూపేణ మరికొన్ని భావనలను కల్పిస్తారు. అసలు ఉద్దేశ్యం భావనలన్నీ వదలగొట్టి శుద్ధాత్మలో స్థిరపడవలెనని - భావశూన్య సద్భావసుస్థితి. సూటిగా అక్కడకే పోరాదా? ఉన్న బరువులకు తోడు మరిన్ని బరువులను చేర్చుకోవడం ఎందుకు?

## భాషణములు 253

గ్వాలియర్ సింధియా స్కూల్ ప్రిన్సిపాల్ శ్రీ ఎఫ్.జి.పియర్స్ -

భక్తుడు: భగవాన్ సద్విద్యలో (అనుబంధము, శ్లో, 36) "చదివి కూడా, ఆత్మవిచారం వల్ల అహంకారనాశం చేయనివారికన్నా, చదువుకోనివారే మే"లన్నారు. అది నిజమని నమ్మే బడిపంతులను నేను. తమ సలహా పేడుతున్నాను. ప్రధానమైన ఆత్మానుసంధానానికి అడ్డురాకుండా, అక్షర జ్ఞానం, బుద్ధిని పెంపొందింపడం కోసం బోధనాపద్ధతిని ఎలా మలచాలో తెలుప గోరుతున్నాను. అవి పరస్పర విరోధులా? కాని పక్షంలో ఏ వయస్సు పిల్లలకు ఏ పద్ధతులో నేర్పితే వారు అంతస్సత్యాన్ని వెదకి తెలుసుకోవడానికి త్వరగా సుముఖులౌతారు?

మహర్షి: మీ రుదహరించిన శ్లోకంలో ఖండింపబడినది విద్యా గర్వము, కీర్తి సమ్మానాల వాంఛలనే గాని, విద్యను కాదు, సత్యానుసంధాన వాంఛ, వినయములను కూర్చే విద్య చాల మంచిది.

(ఈ పృచ్ఛకుడు భగవత్సన్నిధిలో అమూల్యమగు రెండు దినముల కాలము గడిపాడు. తరువాత 17 ఏండ్లలో గిరిపై ఏ కొద్ది నిముషములో తప్ప భగవానును చూడనేలేదు. అతని కిష్టం లేకపోయినా వాని విధులతని దేహాన్ని ఉత్తరానికి సుదూరము కొనిపోతున్నాయి. తిరిగి ఇచటికి వచ్చుటకు కొన్ని సంవత్సరాలు కావచ్చు

సవినయంగా భగవాన్ను ప్రార్థిస్తున్నాను. వారికి నాకూ దృఢానుబంధము నెలకొని, నా ఆత్మాన్వేషణ యత్నంలో సాయము అనుగ్రహమూ ప్రసాదింతురుగాక. దీనికి మహర్షి చిరునవ్వే బదులైంది.)

## భాషణములు 254

శ్రీ డంకన్ గ్రీన్ లీస్ శ్రీమద్భాగవతంనుండి కొన్ని శ్లోకాలు ఉదాహరించాడు... "బాహ్యాంతరాల్లో అన్నింటిలోనూ నిండియున్న ఆకాశం వలె, ఆత్మను నీలోనే చూడు."

సిగ్గును వదలి ఆవుకు, గాడిదకు, చివర పంచమునికైనా (సాంఘిక ఆరోగ్య నియమనిష్ఠలను పాటించనివాడు) సాష్టాంగపడు"

"అన్నింటనూ ఆత్మను చూడనన్నాళ్ళు, అన్నింటినీ మనోదేహములతో అర్చించు."

"సుజ్ఞానంతో అన్నింటిని బ్రహ్మముగా చూడు. ఇది ఒక్కటీ స్పష్టంగా ఉంటే, అన్ని సంశయాలూ నశిస్తాయి. నీవు ఆత్మలో స్థిరంగా వుంటావు.

వీనిని వల్లించిన పిదప, గ్రీన్ లీస్ అడిగాడు:

భక్తుడు: ఏకాత్మానుభవానికి ఇది సరియైన మార్గమేనా? "నేను ఎవడను" అనే మానసిక విచార మార్గంలో మనోబుద్ధులకు అతీతమైన వానిని వెదకుటకన్న, మనస్సు గుర్తించేప్రతిదానిలో భగవాన్ను చూడ నభ్యసించడం కొందరకు సులభం కాదా?

మహర్షి: అవును. అన్నింటిలో భగవంతునే చూస్తే, భగవంతుని గురించి ఆలోచిస్తావా లేదా? నీ చుట్టూరా ఈశ్వరునే చూడాలంటే నీ తలపుల్లో (మనస్సులో) దైవాన్ని తప్పక నిలుపుకోవాలి కదా! మనస్సులో భగవంతుని నిల్పటమే ధ్యానము. ధ్యానము ఆత్మానుభవానికి ముందు మెట్టు. అనుభవము ఆత్మయందే; ధ్యానం దానికి ముందుగా రావల్సిందే. ధ్యానించేది దైవాన్నా, ఆత్మనా అనేది ప్రధానం గాదు; వాటి గమ్యం ఒకటే.

కాని నీవు ఆత్మను తప్పించుకోలేవు. దైవాన్ని నీవు చూచేది అన్నింటిలోనేగాని నీలో గాదన్న మాట, సర్వమూ దైవమైతే, ఆ సర్వంలో నీవు లేవా? నీవే దైవం అయితే సర్వమూ దైవం కావడంలో వింత ఏమి? అభ్యాసానికి అయినా సరే చూచేవాడూ, ఆలోచించేవాడూ, ఒకడుండాలి కదా; వాడెవడు?

భ: కవిత, గానమూ, జపమూ, భజన, సుందర ప్రకృతి దృశ్యములు, తత్త్వవేత్తల చరితలూ -- ఇట్టివి ఒక్కొక్కప్పుడు యథార్థమైన సర్వైక్యతానుభూతి కలిగిస్తాయి. అక్కడ అహంకారానికి స్థానం లేదు. ఆ గాఢ సుఖము శాంత స్థితియేనా. భగవాన్ పలుమార్లు ప్రస్తావించే హృదయంలో మునగడం అదే నా? దాన్ని అభ్యసించటం వల్ల గాఢతర సమాధిస్థితి, దాని మూలాన పూర్ణసద్దర్శనమూ లభిస్తాయా?

మ: మళ్ళీ అదే సుందర దృశ్యాలవలన ఆనందము .... ఆ ఆనందము ఆత్మలోనిదే. అది నూతనమూ దూరమైనది కాదు. నీకు సుఖమనుకొన్న పరిస్థితిలో శుద్ధచైతన్యంలోనే మునుగుతున్నావు. ఆ మునగడమే స్వస్వరూపానందాన్ని తెలుపుతోంది. కాని తలపుల కలపోతవల్ల, ఇతర విషయాలనూ, సంభవాలనూ ఆనందానికి కారణాలనుకుంటున్నావు. నిజంగా ఆనందము నీలోనే ఉంది. ఆయా సమయాల్లో నీ ఎరుకలేకనే హృదయంలో మునగడం జరుగుతోంది. అది తెలిసిచేస్తే ఆత్మానుభవం అంటావు. తెలిసి ఆత్మలో (అంటే హృదయంలో) నీవు మునగాలనేదే నా కోరిక.

# భాషణములు 255

భ: ఆత్మానుభవం ఎప్పుడూ కలగాలంటే మనస్సు నిశ్చలంగా ఉంటే చాలు, అవునా?

మ: వేరే యే ప్రవృత్తులూ లేక నిశ్చలంగా ఉండగల్గితే చాల మంచిది. అలా చెయ్యలేకపోతే, ఆత్మజ్ఞానం పొందడం కోసం ఊరికే ఉన్నంత మాత్రాన ప్రయోజనం ఏంటి? కర్మప్రవృత్తి ఉన్నంతకాలం ఆత్మసాధనా యత్నం కూడా మానకుండా చెయ్యనీ.

# భాషణములు 256

భ: జ్ఞానం స్పష్టంగా లేని వాని గూర్చిన చర్చ వచ్చింది. అట్టి మందజ్ఞాని, కేవల నిర్వికల్పస్థితి పొందకుండానే ఆగిపోతాడా?

మ: తనుమానసి దశలో గూడ (ఒక పరిస్థితులకు అలవాటు పడ్డ మనస్సుతో కూడా; సన్నగిల్లిన మనస్సుతో కూడా) కేవల నిర్వికల్ప స్థితి రావచ్చు.

భ: మధ్యమ, ఉత్తమ జ్ఞానులను జీవన్ముక్తులంటారే. తనుమానిసి స్థితిలో కేవల నిర్వికల్పము. మందజ్ఞానికి స్థానమెక్కడ?

మ: ఆత్మానుభవము సత్త్వాపత్తి దశలో; మధ్యమోత్తములు, అసంసక్తి, పదార్థాభావనీ దశల్లో వారు. మంద, మధ్యమ, ఉత్తమ అని జ్ఞాని విభజన: వారివారి ప్రారబ్ధ బలాన్నిబట్టి చేసినది. ప్రారబ్ధం బలీయమైతే, అతడు మందజ్ఞాని; అది మధ్యమమైతే, అతడూ మధ్యముడే; అది దుర్బలమైతే, అతడుత్తమ జ్ఞాని; అది మరీ దుర్బలమైతే, వానిది తుర్యగస్థితి.

సమాధి స్థితిలోగాని, జ్ఞానంలోగాని, జ్ఞానులలో తరతమాలు లేవు. ఈ విభజన ద్రష్ట (చూచేవాని) దృష్టిని బట్టి చేయబడినది.

భ: తనుమానిసి ముముక్షుత్వములు ఒకటేనా?

మ: కావు. షడ్గుణములు, వివేచన, వైరాగ్యము, ముముక్షుత్వమూ మొదలైనవి శుభేచ్ఛకు పూర్వములు. ముముక్షుత్వము తరవాతి ప్రథమ దశ, శుభేచ్ఛ, ఆ వెంట విచారణ. అటుపైన తనుమానసి; సాక్షాద్దర్శనము సత్త్వాపత్తిలో కల్గుతుంది.

ఇటువంటి విషయాలు వితర్కించవలసిన పనిలేదు. జీవన్ముక్తి, విదేహముక్తి వీనిని శాస్త్రజ్ఞులు వివిధంగా వర్ణించారు. శరీరిగా ఉన్నపుడే విదేహముక్తి కొన్నిచోట్ల కలిగినట్లు చెప్పారు. నిజంగా ముక్తి 'అహ'మునకు మరోపేరు.

జ్ఞాన భూమికలు ఏడు -- 1. శుభేచ్ఛ (జిజ్ఞాస) 2. విచారణ (శ్రవణ, మననములు), 3. తనుమానని (సన్నగిల్లిన మనస్సు), 4. సత్త్వాపత్తి (ఆత్మజ్ఞత), 5. అసంసక్తి, (అసంగత్వము, బంధము లేకుండుట) 6, పదార్థాభావని (పూర్ణమైన విషయ అగోచరత్వము), 7. తుర్యగ (వాగాతీతము). చివరి నాల్గు భూమికల వారిని క్రమముగా బ్రహ్మవిత్, బ్రహ్మవిద్వర, బ్రహ్మవిద్వరీయ, బ్రహ్మవిద్వరిష్ఠులంటారు.

# భాషణములు 257

దిండిగల్లునుండి వచ్చిన యువకుడొకడు, తానాశ్రమంలో ఉన్న కొద్ది దినాల్లో నేర్చుకొన్నది, నేనెవరన్న విచారణ ఒక్కటి చేస్తే, సర్వమూ చేసినట్లే అని, అతడది భగవాన్కు మనవి చేస్తూ, అందుకై ఏదన్నా వ్రతదీక్ష ఉన్నదేమో తెలుపగోరాడు.

భక్తుడు: విచారము నే నెక్కడ చేయాలి (గురుసన్నిధిలోనా, అని భావము)

మహర్షి: 'నే'నెక్కడున్నదో, అక్కడినుంచే విచారణ మొదలు పెట్టాలి.

భ: జీవిత పరమార్థానికై జనులు శ్రమిస్తారు. అది సరియైన దారి కాదనుకుంటున్నాను. ఎంతో తపస్సుచేసి భగవాన్ గమ్యం చేరారు. అందరూ ఆ గమ్యం చేరవలెనని భగవాన్ తాత్పర్యము. వలసిన సాయమివ్వడానికి గూడ వారు సుముఖులే. అది వారకై భగవాన్ పడిన క్లేశం వారు పడనక్కరలేదు. భగవాన్ వారికి దారి సుగమం చేసారు. నేనన్నది సరియే గదా?

మహర్షి నవ్వారు -

మ: అట్లే అయితే ప్రతివ్యక్తి సులువుగా చేరాలి. కాని ఎవని ప్రయత్నం వాడే చేయవలసి ఉంది.

భాషణములు 258

మైసూరు నుండి ఒక యువకుడు ఏదో కాగితాన్ని భగవానుకందించాడు. దానిలో ఏవో ప్రశ్నలున్నాయి. బదులుకై వేచియున్నాడు. ఇతర మహాత్ములెందెందు గలరో తెలిపితే, తాను వారిని దర్శించి వారివలన మార్గదర్శనం పొందాలని కోర్కె ఇంట్లో ఎవరికి తెలియచేయకుండా, మహాత్ముల ఉపదేశాలవల్ల దైవాన్ని అనుసంధానము చేయవచ్చాడు. తనకు దైవమేమో, అందుకై అన్వేషణయోమో, ఏమీ తెలియదు. నిజమే. అందుకే తాను మహాత్ములను దర్శించటం.

ఆ చీటిని తిరిగి యిచ్చివేస్తూ మహర్షి అన్నారు

"నేను ప్రతి ప్రశ్నకూ, అది ఏదైనా సరే, బదులివ్వవలెనన్న మాట; ఇవ్వకపోతే నేను గొప్పవాణ్ణికాదు."

ఆ చీటిని చింపేసి, ఆ కుర్రవాడు మరొకటి వ్రాసి చూపినాడు: "తాము ఉడుతలను, కుందేళ్ళను దయగా జూస్తారు. పారిపో యత్నించేప్పుడు వానిని లాలిస్తారు. కాని మనుష్యులంటే తమకు ఉదాసీనం. నేనిల్లు విడిచి పదిహేను దినాలుగా ఇక్కడ కాచుకొని పడివున్నాను. కొన్ని రోజులు తిండిలేక కూడ పస్తున్నాను. ఎంతో ప్రయాసపడుతున్నాను. అయినా తాము నన్ను పట్టించు కోవడం లేదు"

మ: ఇటు చూడు, నాలో ఏ టెలివిజన్ లేదు. దైవం నా కా శక్తి ప్రసాదించలేదు. నేనేం చేయను? నీ ప్రశ్నలన్నింటికి జవాబులేం చెప్పను? జనులు నన్ను మహర్షి అంటారు, మహర్షి లాగే మన్నిస్తారు. కాని నన్ను నేను మహర్షి అనుకోవడం లేదు. అంతేకాదు, నాకందరూ మహర్షులే. నీవింత చిన్నవయస్సులో దైవాన్ని అన్వేషిస్తున్నావు. చాల మంచి పని. ఆయన పైనే చిత్తం ఏకాగ్రంగా నిలుపు. ఫలాలకేమీ ఆశింపక, నీ పని నీవు చేయి. నీవు చేయవలసిందంతే.

## భాషణములు 259

నాద, బిందు, కళలు వరుసగా ప్రాణ, మనో, బుద్ధులు, ఈశ్వరుడు నాదాని కతీతుడు.

నాద, జ్యోతి ఇత్యాదులను యోగశాస్త్రాల్లో చెప్పిఉన్నారు. కాని దైవము వీనిలో దేనికినీ అందదు. రక్తప్రసరణమూ, ఉచ్ఛ్వాస నిశ్వాసాది శరీర కర్మలూ నాదాన్ని కలుగచేస్తాయి. ఆ శబ్దం అప్రయత్నమూ, నిరంతరమూ. నాదము అది.

# భాషణములు 260

సండే టైమ్స్ పత్రికలో, బ్రంటన్ వ్రాసిన "హిమాలయములోని ఒక యోగి (హెర్మిట్ ఇన్ ద హిమాలయాస్)" లోనుంచి కొన్ని భాగాలు ముద్రించారు. అది పూర్వజన్మలను గుర్తు తెచ్చుకోవడానికి సంబంధించినవి. అందు ఆ శక్తి సంపాదనకై బౌద్ధులవలంబించే విధానాలను బ్రంటన్ వివరించాడు.

మహర్షి: "ఒక రకం మనుష్యులున్నారు. వారికి ఎంతసేపూ భూత భవిష్యత్తులను తెలుసుకోవాలని తీరని ఉబలాటం. వారికి వర్తమానం అక్కరేలేదు. ఈ వర్తమానంలోని దుర్గతి, గతజన్మల బరువే. గతాన్ని స్మరించట, కాలం వ్యర్థపరచటమే."

# భాషణములు 261

పునర్జన్మపై ఒక ఉల్లేఖము. శాంతిదేవి పూర్వజన్మగాథ మానవ కాలమానంతో సరిపడుతుంది. ఇటీవల ప్రకటితమైన 7 ఏండ్ల పిల్లవాని కథ వేరే విధంగా వుంది. పిల్లవానికి ఇప్పుడు 7 సంవత్సరాలు. కాని పూర్వజన్మల నతడు గుర్తుతెచ్చుకున్నాడు. విచారిస్తే తేలింది. ఇంతకు ముందు శరీరాన్ని అతడు 10 నెలల క్రితం వదిలిపేసాడు.

ఈ దేహంలో ఆ జీవుడు 10 నెలలుగనే ఉంటే, మిగత ఆరేండ్ల రెండు నెలలు ఏ జీవుడున్నట్లు? జీవాత్మ సమకాలంలో రెండు దేహాలలో ఉండగలదా? భగవాన్ వివరణ మిట్లు - పిల్లవాని దృష్ట్యా వానికేడేండ్లు. చూసేవాని దృష్ట్యా 10 నెలలు. ఈ భేదం భిన్నములైన రెండు ఉపాధులవల్ల వచ్చినది. ఏడేండ్లు విస్తరించిన పిల్లవాని అనుభవం చూసేవానీ కాలమానంలో పదినెలల మాత్రమే wOఛి.

ఈ సందర్భంగా మహర్షి యోగవాసిష్టంలోని లీలాగాథను మరలా వర్ణించారు.

భాషణములు 262

ప్రొఫెసర్ సయ్యద్ ప్రస్తుతం ఇక్కడికి వచ్చియున్నాడు. హేతువాది, అవిశ్వాసి అయిన అతని మిత్రుడొకడు "మీ మహర్షి చేసే మహిమలు ఏమి" అని అధిక్షేపించాడు. “పశుప్రాయులైన సామాన్యులు వారి వద్ద మానవులౌతారు. చిన్నపిల్లలవంటి మాకు ఆయన బలాన్ని ఇస్తారు. అంతశ్శాంతికి మించిన మహాద్భుతం వేరే ఏమైనా ఉంటుందా? అది వారికున్నది" అన్నాడు సయ్యద్. “అది ఉంటే, మన కేంటి”అన్నాడు ఆ మిత్రుడు. దానికి తానన్నాడు. "వారి వద్దకు వచ్చే వారందరికీ ఆ శాంతి పంచి పెట్టబడుతుంది. ఈ విషయం బ్రంటన్ తన పుస్తకంలో ప్రస్తావించాడు. ప్రతిరోజూ మహర్షి సన్నిధిలో వారు ఆ ఆనందము అనుభవిస్తూంటారు.

తాను సరిగానే బదులిచ్చాడో, లేదో తెలుసుకోవలెననిగూడ సయ్యద్ ఆశ. ఆ సంవాదమంతా ఏకరువుపెట్టి సయ్యద్ తాను కొంత కలిపాడు. దారిలో సంవృత్తుణ్ణి కలుసుకొన్నప్పుడు తనకెంతో సుఖశాంతి లభించిందని పరశురాముడు వచించాడు. దాన్నిబట్టి సంవృత్తుడు పరమయోగియని అతడు నిశ్చయించాడు. అట్టి శాంతి మహాత్ముల సాన్నిధ్యానికి ఏకైక లక్షణము కాదా? ఇంకా ఏమైనను కలదా?

మహర్షి: తత్త్వరాయరని ఒక మధ్వయోగి. ఆయన వారి గురువగు స్వరూపానందులపై యొక 'భరణి'ని రచించారు. పండితులా రచన కధిక్షేపించారు. “భరణి” రచన యుద్ధంలో పరాక్రమించి వేయి ఏనుగులను హతమార్చిన వీరుని విషయంగా చెప్పబడేది. స్వరూపానందులు వట్టి ఆలసులు. మనుషులు తిరగని ఏ తావుల్లోనో, కూర్చొనే కాలం గడుపుతారు. వానిపై ఈ స్తుతి ఏమి?

తత్త్వరాయరు వారొక మారు తమ గురువుల వద్దకు వచ్చి, వారొక్క ప్రేటున్నే వేయి. ఏనుగులను చంపగలరో లేరో పరిశీలించవచ్చునన్నాడు. వారట్లే చేశారు. వారు స్వరూపానందుల ఎదుటికి రాగానే, ఒక్కడూ కిమ్మనలేదు,

కమ్మనలేదు. మూగలై పరమశాంతితో మునిగి నిశ్చలులై కొన్ని దినాలు గడిపారు. వారికి మళ్ళీ చైతన్యం వచ్చాక గురుశిష్యుల కిరువురికి నమస్కరించి తమ తృప్తిని ప్రకటించారు. "స్వరూపానందులు యుద్ధవీరుల కందరికంటే మిన్న. వేయి ఏనుగుల చంపుటకన్నా ఎన్నో మడుగులు కష్టమైన "అహంకార దమనం" నెరవేర్చ గలిగినా"రని కొనియాడారు.

ఈ కథ తాత్పర్యము స్పష్టమే యన్నారు మహర్షి, మహాత్ముల సాన్నిధ్యానికి ఏకైక లక్షణము పరమశాంతి.

## భాషణములు 263

సయ్యద్: హృదయమే ఆత్మయన్నారు భగవాన్. మానసిక శాస్త్రం (సైకాలజీ) అది మదమాత్సర్యాదు లన్నిటికీ స్థానం అంటుంది. దీనికి సమన్వయం చేయడం ఎలా?

మహర్షి: సృష్టి సకలమూ హృదయంలో ఒకే ఒక సూక్ష్మరంధ్రంలో ఉంది. ఈ మదాదులన్నీ సృష్టిలోని అంశాలే. అవి అవిద్యకు చెందినవి.

భ: అవిద్య ఎట్లు పుట్టింది.

మ: అవిద్య మాయ వంటిది. యా (ఏది) మా (లేదో) అలాగే, లేనిది అవిద్య. మరి నీ ప్రశ్నకు ఆధారం లేదు. అయినా ఆ ప్రశ్న నడగనే అడుగుతారు. అప్పుడు నీవు ఎదురు ప్రశ్నవేయి - "ఎవరికీ అవిద్య" అని. అవిద్య అజ్ఞానము. దానికి కర్త, విషయములున్నవి. కర్తవే నీవైతే, విషయముండదు.

భ: అవిద్య అంటే ఏమి?

మ: ఆత్మ తెలియకపోవడం. ఎవరికి తెలియక పోవడం? ఆత్మకా? ఆత్మ ఆత్మకు తెలియదనేనా? ఆత్మలు రెండా?

## భాషణములు 264

భక్తుడు: ప్రపంచం తనలో భాగమంటారా, భగవాన్? ప్రపంచాన్ని మీరు ఎలా చూస్తారు?

మహర్షి: ఉన్నది ఆత్మయొక్కటే. వేరేమీ లేదు. అజ్ఞానం వల్ల దాన్ని వికల్పంగా చూస్తారు. ఈ విభజన మూడు విధాలు. 1. సజాతీయము 2. విజాతీయము. 3. జాతిభేదమేమియు లేనిది (తనలో అంశమైనది, స్వగత భేదము) ప్రపంచం ఆత్మవంటి మరియొక ఆత్మకాదు. అది ఆత్మకు భిన్నము కాదు. అది ఆత్మలో అంశమూ కాదు.

భ: ప్రపంచమాత్మలో ప్రతిబింబింపదా?

మ: ప్రతిబింబము ఉండాలంటే దానికి ఒక వస్తువు ఉండాలి. అప్పుడు బింబము, అద్దము, ప్రతిబింబము వుంటాయి. కాని ఆత్మకి ఈ విభేదాలు లేవు.

భ: అట్లైతే, భగవాన్ ఈ జగత్తునే చూడరా?

మ: భగవాన్ అంటే యేమని నీ ఊహ?

భ: నాకంటే పరిణతుడైన జీవుడని.

మ: నీ జీవుడు నీ కర్థమైతే ఆ ఇతర జీవుడూ అర్థమౌతాడు.

భ: నేను వాదించడానికి రాలేదు, నేర్చుకోటానికి వచ్చాను. దయచేసి బోధించండి.

మ: నీవు నేర్చుకో నొచ్చావు గనుక వాదం తప్పదు. ఇదంతా అవతల ఉంచు, నీ నిద్ర విషయం యోచించు. అందులో నీ బంధనాలు, విమోచనోపాయాలూ ఏమైనా అనుకొన్నావా? అధమం నీ దేహాన్నైనా ఎరిగి ఉన్నావా? దేహంతో బాటు బద్ధ భావము కలిసే ఉంటుంది. అలా కాకపోతే బంధనము లేదు, బంధించే వస్తువు లేదు, బంధించేవాడు లేడు, బంధింపబడువాడూ లేడు. కాని ఇవన్నీ నీ జాగ్రదవస్థలో కనిపిస్తాయి. ఆ కనిపించడం ఎవరికో ఆలోచించు.

భ: మనస్సుకు.

మ: మనస్సును గమనించు. నీవు దానికి దూరంగా ఉండాలి. నీవు మనస్సువు కావు. ఆత్మే మిగులుతుంది.

భ: భగవాన్ పరిణామవాదాన్ని నమ్ముతారా?

మ: పరిణామం ఒక స్థితి నుండి మరొక స్థితికి. భేదాన్ని ఒప్పుకోనప్పుడు పరిణామ మేమి?

భ: 'ఎన్నో జన్మల విదవ, ముముక్షువు జ్ఞానాన్ని పొంది, నన్ను తెలుసుకుంటా'డని శ్రీ కృష్ణులనలేదా? కాబట్టి ఒక దశనుండి మరొకటికి పరిణామముండియే తీరాలి.

మ: భగవద్గీత ఎట్లు ప్రారంభమైందో చూడు. "నేను లేను, నీవు లేవు, ఈ రాజలోకమూ లేదు' 'ఇది పుట్టనూ లేదు, దీనికి చావూ లేదు... కాబట్టి పుట్టుచావులు లేవు. నీవు చూచేట్లు వర్తమానమూ లేదు. సత్యముండినదీ, ఉన్నది, ఇక ముందూ ఉంటుంది. అది మారదు. అర్జునుడా తర్వాత ఆదిత్యునికన్నా పూర్వము నీ వెట్లుంటివని శ్రీ కృష్ణుణ్ణి అడుగుతాడు. అర్జునుడు తన్ను దేహంగానే చూస్తున్నాడని ఎరిగి, దానికి తగినట్లుగా శ్రీ కృష్ణులు ఉపదేశించారు. ఆ ఉపదేశం విభిన్నతా బుద్ధికి, నిజానికి జ్ఞాని దృష్టిలో తనకుగాని ఇతరులకు గాని బంధమూలేదు, ముక్తియూ లేదు.

భ: అందరూ ముక్తులేనా?

మ: అందరెవరు? ముక్తి లేదు. బంధముంటే గదా, విమోచనము? బంధమే లేదు. అంటే మోక్షము కూడా లేదు.

భ: అనేక జన్మలలో పరిణతి చెందటానికి ఏండ్ల తరబడి అభ్యాసం అవసరం గాదా?

మ: సహజమైన అంతశ్శాంతి భంగంకాక నిలవడం కోసమే అభ్యాసం. ఏండ్ల ప్రశ్నే లేదు. ఆ మాట తక్షణం వదలివేయి. అభ్యాసమున్నా లేకున్నా నీ సహజస్థితిలో నీవుంటావు.

మరొకరు అడిగారు: అట్లైతే అందరికి ఆత్మానుభవమేల కాదు?

మ: వాని ప్రశ్ననే మరోరూపంలో అడిగావు. ఈ ప్రశ్న ఎందుకు వచ్చింది? అభ్యాసం సందర్భంలో గనుక, నీ కభ్యాసం అవశ్యకమని తెలుస్తున్నది కనుక అభ్యాసం చేయి.

కాని ప్రశ్నలూ, సంశయాలూ లేని స్థితియే సహజస్థితి.

దైవం - మానవుని సృష్టించాడు. మానవుడు దైవాన్ని సృష్టించాడు. ఇద్దరూ నామరూప కల్పనలో భాగస్వాములే. నిజానికి దైవముగాని మానవుడుగాని సృజింపబడనే లేదు.

## భాషణములు 265,

ఇంతక్రితం వచ్చిన ఉన్నత వర్గానికి చెందిన సంస్కారయుక్తమైన వనిత తిరిగి వచ్చారు. నేరుగా భగవాన్ వద్దకు వెళ్ళి నమస్కరించి ఆమె అన్నారు పోయినమారు, నా భర్తా పిల్లలతో వచ్చాను. ఉన్న కాలమంతా వారి భోజనాదుల విచారింపుతోనే గడచిపోయింది. కోరినంత కాల మిక్కడ ఉండలేకపోయినాను. అంత త్వరగా వెళ్ళిపోయినందుకెంతో చింతించాను. ఈసారి సన్నిధిలో నిశ్శబ్దంగా కూర్చుని భగవాన్ అనుగ్రహాన్ని ఆస్వాదిస్తామని వచ్చాను. కావలసిన మనోశక్తిని భగవాన్ నాకిస్తారని ప్రార్ధన.

హాలునుండి అప్పటికే చాలామంది వెళ్ళిపోయారు. ఆమె భగవాన్ సమ్ముఖాన ఒక ముతక కంబళిపై కూర్చుంది. చిరునవ్వుతో భగవాన్ అన్నారు ... "నిజమే, మౌనమే నిరంతర సంవాదము. సాధారణ భాషణ హృదయం నుండి హృదయానికి జరిగే సంవాదాన్ని అడ్డగిస్తుంది."

ఆమె అటులే గ్రహించి నిశ్శబ్దంగా కూర్చున్నది. భగవాన్ సోఫాపై మేను వాల్చియున్నారు. ఆయన దృష్టి, ఆమెవైపే నిలిచి యున్నది. పెదవులపై చిరునవ్వు వెలసి వుంది. ఇర్వురూ నిశ్శబ్దంగా నిశ్చలంగా సుమారొక గంటవరకట్లే వున్నారు.

ప్రసాదంపంచి పెట్టారు. ఆమె అన్నది "ఇక నేను వెళ్ళిపోతాను. బెంగుళూరుకు ఇక్కడికి మధ్య నది వరదపారుతున్నది. ఆ ప్రవాహంలో ఒక బస్సు బోరగిలి పడియున్నది చూసాను. నాకారు ఆ తరువాత వచ్చింది కనుక ఆ విషాద దృశ్యం కంటపడింది. అయినా నదిని దాటడానికి నాకు ఏ జంకూ కలగలేదు. నా కారు భద్రంగా ఒడ్డుచేరింది. వెలుతురుండగనే తిరిగి వెళ్ళవలెనని ఉన్నాను.

పూర్వమన్నట్టుగా ఇక్కడికిదే నా చివరి రాక అనను. నాకు తెలియదు. కాని అది అట్లే అవునేమో, అయినా, భగవాన్ నాకు మనోబలం ప్రసాదించమని ప్రార్ధన.

నేను భక్తిని కోరుకుంటున్నాను. ఈ కోర్కె గాఢమూ, గాఢతరమూ అవుగాక. ఆత్మానుభవాన్ని గూడ నే నంతగా కోరుకోవడం లేదు. నా ఈ వాంఛ దృఢమౌగాక.

మ: కోరిక అంతగా ఉన్నప్పుడు నీవు మెచ్చినా మెచ్చకున్నా ఆత్మానుభవం బలవంతంగా కల్గుతుంది. శుభేచ్ఛ ఆత్మసాక్షాత్కారానికి ద్వారం,

భ: అలాగే కానీయండి. కాని నేనా కోర్కెతో తృప్తి చెందుతాను. ఇక్కడికి దూరంగా ఉన్నా నా భక్తి యే మాత్రమూ సడలకుండుగాక, వలసిన బలాన్ని భగవాన్ అనుగ్రహింతురుగాక, వారి అనుగ్రహం లేక అట్టి అభిలాష కలుగదు. వ్యక్తిగతంగా చాలా బలహీనురాలుని,

మునుపిక్కడ ఉన్నప్పుడు ఎన్నో ప్రశ్న అడిగాను. భగవాన్ చెప్పినవి నాకంత కర్థం కాలేదు. ఇక ప్రశ్నించటం మాని మౌనంగా వారి సన్నిధిలో కూర్చుని వారు నాపై ప్రసరింపచేసే అనుగ్రహాన్ని ఆస్వాదిస్తామని ఆశించాను. అందుచేతనే ఈమారు నేను భగవాన్ను ఎక్కువ ప్రశ్నించలేదు. నాకు వారి అనుగ్రహముంటేచాలు.

మ: ఇన్నిమార్లు నీ విక్కడికి రావడమే అనుగ్రహ ప్రసారాన్ని సూచిస్తోంది. ఆమె కాశ్చర్యమయింది. నేనే అడగవలెననుకొన్నాను. భగవానే నన్ను ఇక్కడికి పిలుస్తున్నారా అని. ఉన్నట్టుండి ఈ ప్రొద్దుటే నా భర్త "నాకు రెండు రోజుల సెలవుంది. నీ కిష్టమైతే భగవాన్ను చూచిరా" అన్నారు.

నాకెంతో ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగింది. అది భగవాన్ ఆహ్వానమనే నేను భావించాను.

ఆమె భగవాన్కు సమీపంగానే ఉండవలెనన్న కోరిక వెల్లడించింది. మహర్షి అన్నారు "బలవత్తర శక్తి ఒకటి నిన్ను నడుపుతున్నది. అది నడిపినట్లే నడచుకో." భ: నాకది తెలియరావడం లేదు. దయతో నాకది తెలిసేట్టు చేయండి.

మ: ఏమి చేయవలెనో, ఎట్లు చేయవలెనో ఆ శక్తికి తెలుసు. దాని యందు శ్రద్ధ ఉంచు.

## భాషణములు 266

దా. సయ్యద్: కోరికలు వదలుకొమ్మన్నారు. కాని శరీర ధర్మాలు, అణచలేనివి ఉంటాయి. ఏమి చెయ్యాలి?

మహర్షి; ముముక్షువునకు మూడు అర్హతలుండాలి 1. ఇచ్ఛా 2. భక్తి, 3. శ్రద్ధలు. ఇచ్ఛ అంటే క్షుత్పిపాసాది దేహ అవసరాలను శరీరము నెడల యేమమతా లేకుండా నెరవేర్చటం. అది జరగకుంటే ధ్యానం ముందుకు సాగదు. భక్తిశ్రద్ధలు నీ పెరిగినవే.

భ: దేహధర్మాలలో గూడ నీచములు, ఉచ్చములున్నవి. వానిలో నీచములను ఉచ్చములుగా మార్చుట మన కర్తవ్యమా?

మ: అవును.

భ: ఇచ్ఛ ఏమో భగవాన్ వివరించారు. నేను రోజుకు మూడు నాల్గు మార్లు ఆహారం పుచ్చుకుంటాను. ఈ దేహావసరాలను చూచుకోవటంతో, దేహమొక భారమనిపిస్తున్నది. ఈ శరీర అవసరాల బాధ నుండి తప్పించుకొనే దేహరహిత స్థితి ఏదైనా ఉందా?

మ: అసలు చెడ్డ చేసేది రాగద్వేషాది సంసక్తి. కర్మలు తామై చెడు కావు. రోజుకి 3,4 సార్లు ఆహారం తీసుకోడం తప్పేమీ లేదు. కాని నాకీవిధమైన భోజనం కావాలి, ఆ విధమైనది కావలెనని మాత్రం పట్టుండరాదు.

ఆ ఆహారం కూడా మేల్కొనియున్న 12 గంటలలోనే పుచ్చుకొంటావు. నిద్రిస్తున్న సమయాల్లో ఏమీ తినవు. నిద్ర నీకు ముక్తినిస్తున్నదా? ఏ పనీ చేయనంత మాత్రాన ముక్తి వస్తుందనుకోవడం తప్పు.

భ: సదేహ ముక్తులని, విదేహ ముక్తులని ఉన్నారట గదా?

మ: ముక్తే లేదే! ముక్తులెక్కడనుంచి వస్తారు?

భ: హిందూ శాస్త్రాలు ముక్తిని గురించి చెప్పలేదా?

మ: ఆత్మ, ముక్తి పర్యాయ పదములు. జీవన్ముక్తి, విదేహముక్తి యివి అజ్ఞానుల ఊహాలు. జ్ఞానికి బంధమనీ, మోచనమనీ స్పృహయే ఉండదు. బంధమోచనలు, ముక్తిలో వివిధ దశలు. ఇవన్నీ అజ్ఞానికి, వాని అజ్ఞానాన్ని సడలించడానికి చెప్పినవి. ఉన్నది ఒక ముక్తియే. మరేమీ లేదు.

భ: భగవాన్ దృష్టిలో అవన్నీ సరియే - మా గతి ఏమి?

మ: "అతడు" "నేను" అనే భేదదృష్టి జ్ఞానానికి ఆటంకము.

భ: కాని భగవాన్ ఎంతో ఉన్నతస్థానంలో ఉన్నారని, మాకెన్నో పరిధులున్నవని కాదన లేము గదా? భగవాన్ తమతో నన్ను సమానం చెయ్యగలరా?

మ: నీ నిద్రలో ఈ పరిధులను చూసావా?

భ: ఇప్పటి స్థితిలో నిద్రావస్థ విషయం మాట్లాడే దెలాగా?

మ: అక్కరలేదులే. ఈ మూడవస్థలూ, ఏ మార్పులేని ఆత్మ ఎదుట ఒకటి వెనుక నొకటిగా మారుతూ ఉండే స్థితులు. నీ నిద్రావస్థను నీవు స్మరింపగలవు.అది నీ నిజస్థితి. అప్పుడు పరిధులేవీ లేవు. “నేను” ఆలోచన లేచినపుడే పరిధులు గూడ తలెత్తాయి.

భ: ఆత్మను పొందుటెట్లు?

మ: ఆత్మను పొందలేవు. ఎందుకంటే నీవే ఆత్మవు.

భ: నిజమే. మార్పులేని ఆత్మ ఒకటే. మారేది మరొకటి. నాలో రెండు ఆత్మలున్నాయి.

మ: మార్పు అన్నది తలపే. అన్ని తలపులూ, “నేను” ఆలోచన తర్వాతవే. అవి ఎవరికో చూడు, అప్పుడు వానిని దాటిపోతావు. వెంటనే అవి అణగిపోతాయి. అంటే “నేను” ఆలోచనకు మూలం జాడదీస్తే నీకు పూర్ణమైన “నేను-నేను" స్ఫురణ అనుభూత మౌతుంది. “నేను” ఆత్మకు పేరు.

భ: "నేను బ్రహ్మను” (అహం బ్రహ్మాస్మి) గురించి ధ్యానించేదా?

మ: ఆ మహావాక్యం “నేను బ్రహ్మమని” ఆలోచించుటకు గాదు. అహం = నేను, అందరెరిగినదే. బ్రహ్మమే 'నేను'గా అందరిలో వెలసింది. 'నేను'ను కనుక్కో “నేను” బ్రహ్మమే. నీ వట్లు యోచించ నక్కర లేదు. “నేను”ను కనుక్కుంటే చాలు.

భ: శాస్త్రాలు పంచకోశాలను విసర్జించవలె ననలేదా?

మ: “నేను” భావన కలిగాక దానిని దేహేంద్రియ మానసములని భావించడమూ తలఎత్తింది. ఈ సంసర్గము తప్పు. దానితో నిజమైన 'నేను' కనుమరిగి పోతున్నది. యథార్థమైన 'నేను'ను కలుషితమైన 'నేను' నుండి వేర్పరచడంలో ఈ పంచకోశ విసర్జనం ప్రస్తావించారు. కాని అది 'అనాత్మ'ను పరిహరించటంతో సాటిరాదు. కాని యథార్థమైన ఆత్మను తెలిసికొనడమే దాని అర్థం.

సత్యమగు 'ఆత్మ' అనంతమైన 'అహ-మహం' పరమమైన 'నేను'. దాని కాద్యంతాలు లేవు. ఆ రెండవ 'అహం' పుట్టుతుంది. గిట్టుతుంది. అది శాశ్వతము గాదు. మారుతున్న ఆలోచన లెవరికో పరికించు. అవన్నీ “నేను” ఆలోచన వచ్చాకనే వచ్చినవి అని నీకు తెలుస్తుంది. "నేను" ఆలోచనను వదలక పట్టుకో. అన్ని తలపులూ అణగిపోతాయి. "నేను" ఆలోచన మూలం జాడతీయి. ఆత్మ ఒక్కటే మిగులుతుంది.

భ: ఇది సులభం కాదు. సిద్ధాంతమైతే అర్థమవుతున్నది, గాని అభ్యాసం ఏమిటి?

మ: విచార మార్గం అవలంబింపలేనివారికి ఇతర మార్గాలున్నాయి. 'అహం బ్రహ్మాస్మి'యని జపించడానికి గాని, ధ్యానించడానికిగాని కర్త ఒకడుండవలెను గదా? అతడెవడు? అది “నేను”గా వుండు. ఇది సూటిమార్గం. ఇతర మార్గాలను పాటించినా, అవియన్నీ చివరకు విచార మార్గంలోనికి తీసుకుని వచ్చేవే.

భ: నాకు 'నేను' తెలుసు. కాని నా కష్టాలు పోవడం లేదు.

మ: ఈ 'అహం'భావన శుద్ధమైనది గాదు. అది దేహేంద్రియ బుద్ధితో కలుషితమైనది. ఆ కష్టాలెవరికో గమనించు. అవి 'అహం' భావనవి. దాన్ని చిక్కించుకో; మిగిలిన ఆలోచనలు పోతాయి.

భ: కాని అది చేసేదెలాగ? ఉన్న కష్టమే అది.

మ: 'నేను, నేను, నేను' అని ఆలోచిస్తూ మరేమీ ఆలోచించకుండా ఈ ఒక్క ఆలోచననే పట్టుకో.

## భాషణములు 267

హాలులోని జంతు సహచరులను పేర్కొంటూ భగవాన్, అవ్వైయార్ రచించిన తమిళ పద్యమొకటి వినిపించారు.

ఆ వృద్ధురాలు అలా పోతూండగా ఎవరో కంబర్ను పొగుడుతుండగా విన్నది. దానికి బదులుగా ఆమె ఒక పద్యం చెప్పింది

"ప్రతివాడూ వాని వాని విధంగా గొప్పవాడే. పక్షులు తమ గూడునతి నిపుణంగా కడతాయి. పురుగులు మైనం ఇస్తాయి. తుమ్మెద తేనెతెట్టను కడుతుంది. పెద్ద నగరాలే నిర్మిస్తాయి చీమలు; సాలీడు తంతువుల వెలువరిస్తుంది; వీనితో పోలిస్తే కంబర్ ఏమి గొప్ప?"

అంతట భగవాన్ వానివాని చర్యల వివరించారు --

కొండమీద తాముండగా అచట ఒక కుటీరం చూసాను. అది రాళ్ళతో మన్నుతో కట్టి, పైన పూరి కప్పి ఉంది. కాని ఒకటే చెదలు, ఆ ఇంటి వారు ఆ పీడ వదల్చుకోవలెనని, కప్పు లాగేసి, మట్టి గోడలంతా త్రవ్వేసారు. రాళ్ళు రాళ్ళకు మధ్య చెదలు కట్టుకొన్న నగరాలకు నగరాలే కనబడుతున్నవి. వాని గోడలన్నీ నల్లరంగులో వున్నవి. అక్కడినుండి ఆ ప్రక్క నగరాలకు దారులు. ఆ పట్టణాలలో గోడలుగూడ నల్లరంగు పూసినవే. వానిపై తెల్లటి చారలే వీధులు. ఆ నగరంలో ఎన్నో రంధ్రాలు. అవి చెదల నివాసాలు. ఆ గోడలెల్లా వ్యాపించిన చెదలా ఇంటి కప్పును జీర్ణింప చేశాయి.

శ్రీ భగవాన్ ఒక మారొక సాలీడు వలపన్నడం చూసి దాని గురించి వివరించేరు. ఒకటి గాదు, రెండు గాదు. మూడుస్థలాల్లో అది వలపన్నింది. ఒక స్థలంలో జిగురు వదలి దాని వెంటనే సాలీడు కదలుతుంది. క్రిందికి దిగి, పైకి ప్రాకి, చుట్టూరా పలుమార్లు తిరుగుతుంది. అప్పటికి వలపూర్తి అయి, బాగా పరిష్కృతమైన రేఖలతో సుందరంగా వుంటుంది. రోజు పొద్దుటే వలపన్నడం, సాయంకాలానికి లోన చుట్టివేసుకోవడం, సాగుతూనే ఉంటుంది.

అలాగే కందరీగ, దానిమైనంతో గూడుకడుతుంది.

ఇట్లే ప్రతి ప్రాణికీ దాని విశిష్టమైన నైపుణ్యం వుంటుంది. కంబర్ వైదుష్యంలో ఆశ్చర్యమేముంది? ఇతరముల్లోలాగే కంబరు నందుగూడ, అది దైవేచ్ఛ.

## భాషణములు 268

డా. సయ్యద్: మోక్షం అంటే ఏమి? దాని విషయంలో క్రీస్తు ఉద్దేశం ఏమిటి?

మహర్షి: మోక్షమా, ఎవరికి, దేనినుండి?

భ: వ్యక్తికి, దుఃఖమునుండి, సంసార బాధలనుండి.

మ: నీవు పలికే దుఃఖాదు లెవరికి?

భ: మనస్సుకు.

మ: నీవు మనస్సువా?

భ: ఈ ప్రశ్న ఎలా వచ్చిందో చెప్తాను. ధ్యానం చేస్తున్నాను. కొందరు శిష్యులపై (వారు తర్వాత ముక్తులైనారు) క్రీస్తు చూపిన అనుగ్రహాన్ని మననం చేస్తున్నాను. శ్రీభగవాన్ కూడా అలాగే అని నా భావన. మోక్షం అంటే అనుగ్రహ ప్రసాదం కాదా? నా ప్రశ్న ఉద్దేశం అది.

మ: అది సరిగానే ఉంది.

భ: 'నేనెవరు' అన్న గ్రంథంలో స్వరూపదృష్టి (సారాన్ని చూడటం)ని పేర్కొన్నారు. అట్లైతే చూచువాడు, చూడబడినదీ ఉండవలెగా? దీనిని పరమైక్యంతో సరిపెట్టే దెట్లు?

మ: నీవు దుఃఖ నివృత్తికి మోక్షాన్ని కోరేదెందుకు? వానిని కోరే వాడు వానిని చూచే ఉంటాడు. విషయమిది -- దృష్టి చైతన్యం. అదే కర్తా, విషయమూనూ, ఆత్మకు వేరుగా దృష్టి ఉంటుందా? దృష్టి సర్వమూ ఆత్మయే.

భ: అహంకారాన్ని శుద్ధమైన 'అహ - మహం' స్ఫూర్తికి వేరుగా గుర్తించేదెలా?

మ: లేస్తూ అణగిపోతూ ఉండేది నశ్వరమైన 'నేను'; ఆద్యంతములు లేనిది, " నిత్యమైనది "నేను-నేను" స్ఫూర్తి. భ: ఆత్మవిచారం నిరంతరం చేస్తూ ఉంటే, మనస్సు సూక్ష్మమూ,

సూక్ష్మతరమూనై పరమార్థాన్ని తప్ప మరి దేనినీ తలపోయనట్లుగా అవుతుందా? మ: ప్రశాంతమైన మనస్సు, అదే పరమము. దానికి విక్షేపం కలిగినపుడు అశాంతమై, ఆలోచనలలో చిక్కుతుంది. మనస్సు ఆత్మయొక్క క్రియాశక్తి మాత్రమే.

భ: పంచకోశాలు, భౌతికమైనవా? అవి ఆత్మకు భిన్నములా?

మ: పదార్థానికీ పరమార్థానికీ భేదం లేదు. ఆధునిక భౌతికవిజ్ఞానం, పదార్థ - సర్వమూ శక్తియని అంగీకరిస్తుంది. తేజస్సే శక్తి, కాబట్టి సర్వమూ శివునిలో, శక్తిలో (ఆత్మలో, మనస్సులో) ఐక్యమయ్యేదే.

పంచకోశములు కేవలం కనిపించేవి మాత్రమే. వానిలో యథార్థమేమీ లేదు.

భ: రోజు కెన్ని గంటలు ధ్యానం చెయ్యాలి?

మ: ధ్యానం నీ సహజ ధర్మం.

భ: పరిణత దశలో అట్లే; కాని ఇప్పుడు గాదు.

మ: అది నీకు తెలిసేది తర్వాత. అంతమాత్రాన నీ స్వభావం ధ్యానానికి భిన్నం కాదు.

భ: మరి అభ్యాసం మాటయేమిటి?

మ: ధ్యానం సదా అభ్యసించవలసిందే.

భ: ఒక పార్సీ మర్మకవి (మిస్టిక్) "దైవానికి పేరు ఏమియు లే"దన్నాడు. ఖురానులో "దైవ మన్నిటా అంతర్లీనంగా ఉన్నాడు" అని ఉంది.

మ: భగవంతుడు వ్యాపించడానికి ఆయనకు భిన్నంగా "సర్వము" ఏమీ లేదు. ఉన్నది భగవంతుడు మాత్రమే.

భ: ఆత్మవిచారం ఉత్తమోత్తమ విధియని తెలిసి, కుటుంబ విధులను, కుటుంబాన్ని త్యజించడం, నైతికంగా ధర్మమేనా?

మ: పరిత్యాగ భావన ఒక ఆటంకము. ఆత్మ, సరళమైన త్యాగము. ఆత్మ అన్నింటిని త్యజించింది.

భ: అది భగవాన్ దృష్టిలో, కాని మాకు? నా విధులు నెరవేర్చటంలో నాకాలం అధికాధిక వ్యయమౌతుంది, అలసిపోతాను. పలుమార్లు ఆత్మచింతన చేయటానికి శక్తి చాలడం లేదు.

మ: నేను చేస్తున్నాననే భావన ఒక అడ్డు. పనిచేసేది ఎవరో పరిశీలించు. 'నే నెవరు?' అది గుర్తుంచుకో. నీ విధి నిన్ను బాధించదు. తానై అది జరిగిపోతుంది. చేయటకుగాని మానుటకు గాని నీవేమీ యత్నించకు. యత్నించినావో, అది బంధనం. జరగవలసింది జరగనే జరుగుతుంది.

విధి నీవు పని చేయరాదని ఉంటే, నీవెంత వెదకి వేసారినా, నీకు పని దొరకదు. పని చేయవలనని విధి వ్రాస్తే, బలవంతంగానైనా ఆ పని చేస్తావు. కాబట్టి అదంతా ఆ పరమశక్తికి వదలు. వహించటం, వర్జించటం, రెండూ నీ వశంలోనివి గావు.

## భాషణములు 269

భ: సర్వాంతర్యామియైన దైవం దహరాకాశం (హృదయాకాశం)లో వసించుట మెట్లు సాధ్యం?

మ: మనమొకచోట నివసించటం లేదా? నీవు దేహంలో నున్నాననటం లేదా? అలాగే దైవం హృత్ పద్మంలో ఉన్నాడంటారు. హృత్పద్మం ఒక స్థానం కాదు. మన దేహంలో ఉన్నామనుకుంటున్నాం గనుక, దైవవాసంగా దానికి ఒక పేరు పెట్టారు. సాపేక్షంగా తప్ప మరో రకంగా అర్థం చేసుకోలేనివారికిగా, ఇన్ని గుర్తులూను.

సర్వాంతర్యామి దైవానికొక చోటేమి? మనం దేహంలో ఉన్నామనుకొంటాం గనుక మనం పుట్టామని నమ్ముతాము. కాని గాఢనిద్రలో దేహాన్ని, దైవాన్ని, ఆత్మానుభవసరణినీ, దేనినీ స్మరించము. జాగ్రదవస్థలో మాత్రం శరీరాన్ని అంటిపెట్టుకొని దానిలో మనమున్నట్లు తలపోస్తాము.

పరమాత్మనుండి ఈ శరీరం జనించినది. అందులోని నివసిస్తుంది, అందులోకే లయమౌతుంది. కాని మనం దేహంలోనే ఉన్నట్లు నమ్ముతాం గనుక, దైవం హృదయంలో వున్నాడు అంటాం. దాని అర్థం "లోన చూడు"మని, అంతే.

## భాషణములు 270

నెల్లూరు వెంకటగిరి రాజా కాలేజిలో ఇంగ్లీషు లెక్చరర్ గుర్రం సుబ్బరామయ్య అడిగేరు.

బ్రహ్మము సర్వవ్యాపి (యేన సర్వమిదం తతమ్). మరి భగవద్గీతలో (10 అధ్యాయం) శ్రీ కృష్ణులు విభూతులను ఎలా ప్రస్తావించారు?

మహర్షి: అది అర్జునుని నిర్దిష్ట ప్రశ్నకు కృష్ణుని ఉత్తరము, ఉపాసనా సౌకర్యానికై అర్జునుడు భగవంతుని విభూతుల నెరుగ గోరాడు; అందువల్ల యథార్థంగా దైవమే సర్వమూ - వానికి వేరుగా మరేమీ లేదు.

భ: జీవుడు జీర్ణ శరీరాన్ని వదలి నూతన దేహాన్ని తాల్చుతున్నాడు. ఇది శిశు మరణములకు కూడా అన్వయిస్తుందా?

మ: నీ కసలు 'జీర్ణాని' అంటే ఏమో, 'నవాని' అంటే ఏమో, ఏమీ తెలియదు.

ఆ రెండు పద్యాలు సాపేక్షాలు (relative terms) ఒక రాజుకు పాతయైనది, బిచ్చగానికి కొత్తది కావచ్చు. మోక్షము వచ్చేవరకు, నిజానికి వ్యక్తిత్వము అనేది శరీరధారణం అనే విషయాన్ని మాత్రమే తెలియజేస్తుంది.

## భాషణములు 271

డా. సయ్యద్: అనుగ్రహాన్ని పొందేదెలా?

మహర్షి: ఆత్మను పొందేదెలాగో అలాగునే.

భః ఆచరణలో అదెట్లు సాధ్యం.

మ: శరణాగతి వలన.

భ: అనుగ్రహమే ఆత్మ గదా? నేను నాకే శరణాగతి చెయ్యాలా?

మ: అవును. ఎవనినుండి అనుగ్రహం కోరుతావో, అతడినే శరణు వేడు.

దైవము, గురువు, ఆత్మ -- ఒకే దానికి మూడు పేర్లు.

భ: నా కర్థమయ్యేట్లు దయచేసి చెప్పండి.

మ: నీవు వ్యక్తివనుకొన్నంత కాలం, దేవుని నమ్ముతావు. భగవంతుని పూజిస్తే, ఆయనే గురు రూపేణ నీకు లభిస్తాడు. ఆ గురువును సేవిస్తే దైవం ఆత్మగా సిద్ధిస్తాడు. ఇదే సిద్ధాంతము.

## భాషణములు 272

భక్తుడు: కరువులూ, కాటకాలు వంటి విపరీతాలు ప్రపంచాన్ని విస్తారంగా పీడిస్తున్నాయి. ఆ స్థితిగతులకు కారణమేమి?

మహర్షి: ఇదంతా ఎవరికి కనిపిస్తున్నాయి?

భ: ఆ తర్కం లాభం లేదు. నా చుట్టూరా దుఃఖాన్ని చూస్తూనే ఉన్నాను. మః ప్రపంచమూ, దాని దుర్గతి నీకు నిద్రలో అగుపించాయా? మెలకువలో ఇప్పుడు వానిని స్మరిస్తున్నావు. అవేవీ నిన్ను బాధించని స్థితిలో ఉండిపో. అంటే ప్రపంచాన్ని నీ వెరుగనపుడు ఆ కష్టాలేవీ నిన్ను బాధించవు. నిద్రలోవలె నీ వాత్మగా ఉండిపోతే, నిన్నీ ప్రపంచము, దాని దుఃఖమూ కలవర పెట్టవు. కాబట్టి అంతర్ముఖుడవుకా. ఆత్మను చూడు! ఈ జగమూ, దాని బాధలూ అంతమౌతాయి.

భ: అది చాలా స్వార్థం.

మ: ప్రపంచము నీకు బాహ్యం కాదు. నిన్ను నీవు దేహంగా భ్రమపడ్డావు. గనుక, నీకీ జగం వెలిగాతోచి, దాని బాధలూ గోచరిస్తున్నాయి. అవి నిజంగావు. సత్యానికై వెదకు. ఈ మిథ్యాజ్ఞానాన్ని వదల్చుకో.

భ: మహనీయులు, ప్రజాసేవకులు ఎందరో ఉన్నారు. కాని వారు ప్రపంచ సమస్యలను పరిష్కరింపలేకున్నారు.

మ: వారు 'అహం' ప్రత్యయులు (Ego-centred). వారి అశక్తత అందువల్లనే. వారు ఆత్మస్థితులే అయితే, వేరువిధంగా ఉండేవారు.

భ: మహాత్ములేల సాయపడరు?

మ: వారు సాయపడలేదని నీకెలా తెలుసు? బహిరంగోపన్యాసాలు, శరీరకర్మలూ, వస్తుప్రదానాలు, ఇవన్నీ మహాత్ముల మౌనానికి సాటిగావు. ఇతరులు చేసేదానికంటె వారు హెచ్చు సాయం చేస్తారు.

భ: ప్రపంచంలో దుఃఖాన్ని తగ్గించడానికి మేమేమి చేయాలి?

మ: ఏ నొప్పీ లేకుండా నీవుంటే, మరెక్కడా నొప్పిఉండదు. అసలు బాధ ఏమంటే ప్రపంచాన్ని నీవు బహిరంగా చూస్తావు. అక్కడ దుఃఖాలున్న వనుకుంటావు. ఆ జగత్తూ, ఆ దుఃఖమూ రెండూ నీలోనే ఉన్నవి. నీ వంతర్ముఖుడవైతే ఏ నొప్పీ ఉండదు.

భ: దైవము సర్వసంపూర్ణుడు. ప్రపంచాన్నెందు కింత అసంపూర్ణంగా సృష్టించాడు? తయారుచేసే వాని గుణాలు, ఆ కన్పిస్తుంది. ఇక్కడ అట్లు లేదే? వ్యక్తి తయారుచేసిన వాటిలో

మ: ఈ ప్రశ్న నడిగేదెవరు?

భ: నేను, వ్యక్తిని.

మ: ఇట్లు ప్రశ్నించటానికి, నీవు దైవానికి వేరా?

నీకు దేహ బుద్ధి వదలనంత కాలం ప్రపంచం నీకు వెలిగానే తోస్తుంది. లోపాలూ కన్పిస్తాయి. దైవము పరిపూర్ణుడు. వాని క్రియగూడ పూర్ణమే. కాని నీవు దేహబుద్ధివి గనుక నీకది లోపభూయిష్టంగా తోస్తుంది.

భ: ఇంత దుర్భర ప్రపంచంగా ఆత్మ ఎలా వ్యక్తమౌతోంది?

మ: దానిని నీవు వెదకవలెనని. నీ కండ్లు తమ్ముతాము చూడలేవు. వాని ముందొక అద్దానుంచు. అవి తమ్ము చూచుకొంటాయి. సృష్టి విషయమూ అంతే. మొదట నిన్ను చూడు. ఆ పిమ్మట ఆత్మగా జగత్తును చూడు.

భ: నేను సదా అంతర్ముఖుణ్ణి కావాలని తాత్పర్యము.

మ: అవును.

భ: ప్రపంచాన్ని చూడనే కూడదా?

మ: ప్రపంచం అనగానే కళ్ళు మూసికొమ్మని ఎవరూ చెప్పడం లేదు. నిన్ను మొదట చూసుకొని, ఆ తరువాత ప్రపంచాన్ని ఆత్మగా చూడు. నిన్ను నీవు దేహమనుకుంటే, ప్రపంచం నీకు వేరుగా వెలిగా కనుపిస్తుంది. నీ వాత్మవైతే ప్రపంచం బ్రహ్మమై నిలుస్తుంది.

## భాషణములు 273

డా. సయ్యద్: నేను స్తుతిపంచకం చదువుతున్నాను. అన్నీ అరుణాచలుణ్ణి సంబోధిస్తున్నవి. తాము అద్వైతులు. దైవాన్ని వేరు సత్తాగా ఎట్లు స్తుతించారు?

మహర్షి: భక్తుడూ, దైవమూ, స్తుతులూ అన్నీ ఆత్మయే.

భ: కాని తాము దైవాన్ని సంబోధించారు. అరుణాచలాన్ని దైవంగా స్పష్టంగా వర్ణించారు.

మ: ఆత్మను దేహంగా నీవు భావించవచ్చు? భక్తుడు ఆత్మను అరుణాచలుడుగా భావించకూడదా?

భ: అరుణాచలుడే ఆత్మ అయితే, కొండలెన్ని లేవు? అరుణాచలాన్నే ప్రత్యేకంగా ఎన్నుకోనేల? భగవంతుడు సర్వవ్యాపి కదా! దానిని అరుణాచలుడని ఏల నిర్దేశించవలసి వచ్చింది?

మ: అలహాబాదునుండి ఇక్కడికి నిన్నేమాకర్షించింది? ఈ మిగిలిన అందర్నీ కూడా ఏమి ఆకర్షించింది?

భ: శ్రీ భగవాన్

మ: నన్నిక్కడికి తెచ్చిందెవరు? అరుణాచలం. ఆ శక్తిని కాదనలేము. కాని గుర్తుంచుకోవలసింది అరుణగిరి ఉన్నదిలోన; వెలుపలగాదు. ఆత్మయే అరుణాచలుడు.

భః శాస్త్రాల్లో చాల పదాలుపయోగించారు ఆత్మ, పరమాత్మ, పరా, ఇత్యాది. వీనిలో తరతమా లేవన్నా ఉన్నవా? అవి ఏమి?

మ: వాని నుపయోగించి నాతనికి అవి సమానార్థకాలే. కాని ఇతరులు, వారి వారి పరిణతి కనుగుణంగా వేరువేరుగా అర్థం చేసుకున్నారు.

భ: ఒక దాన్నే ఉద్దేశిస్తే, దానికన్ని పదాలెందుకు?

మ: అది సందర్భాన్నిబట్టి. అన్నింటికి ఆత్మయనే అర్థం. 'పరా అంటే సాపేక్షం కానిది, లేదా 'సాపేక్షాతీతమైన', అంటే బ్రహ్మ'మని అర్థం.

భ: హృదయాన్ని ధ్యానించటానికి, గుండెకుడి భాగాన్ని, లక్ష్యంగా ఉంచుకోవాలా?

మ: హృదయం శారీరకం కాదు. ధ్యానానికి కుడి ఎడమూ లేదు. ఆత్మను ధ్యానించు. ప్రతివానికి తానున్నానని తెలుసు. ఈ “నేను" ఎవరు? అది లోనా బయటాగూడ ఉండదు; దక్షిణాన ఉండదు. వామభాగంలో ఉండదు. “నేను - ఉన్నాను" అంతే.

హృదయం కేంద్రం. దానినుండే సర్వమూ వెలువడేది. జగత్తు దేహాదులూ నీకు కనబడతాయి గనుక, వాటన్నిటికీ ఉత్పత్తి స్థానాన్నొకటి నూహించి, దానిని హృదయమన్నారు. నీవు హృదయంలో ప్రతిష్ఠితుడవైనపుడు, హృదయం కేంద్రమూ కాదు, వలయపరిధీ కాదు. అన్యమే లేదు. మరెవరికది కేంద్రం?

భ: ఆత్మ అనాత్మలను, వస్తువూ దాని ఛాయలుగా గ్రహించవచ్చునా?

మ: వస్తువు, ఛాయ -. ఈ పదాలు నీడను మాత్రమే చూచి వస్తువుగా భ్రమించి, దాని ఛాయను తిరిగి చూచేవానికి, సత్యాన్నెరిగి నాతనికి పదార్థమూ లేదు - దాని నీడా లేదు.

భ: అహంకారమున్నదా, అంటే మౌనం; లేదా అంటే మౌనం; దైవమున్నదా అంటే మౌనం; లేదా అంటే మౌనం:, మౌనమే అన్ని ప్రశ్నలకూ బుద్ధికి సమాధానం. ఈ మౌనాన్ని తప్పుగా వ్యాఖ్యానించి, హీనయాన మహాయాన శాఖలు రెండూ బుద్ధుని నాస్తికుడన్నారు.

అతడు నాస్తికుడైతే నిర్వాణాన్ని, పుట్టు చావులనూ, పునర్జన్మలనూ, ధర్మాన్ని గురించి ఎందుకు బోధిస్తాడు? వారి వ్యాఖ్యాత లెల్లరూ పొరపాటుపడ్డారు. అవునా?

మ: నీవన్నదే సరి.

## భాషణములు 274

డా.సయ్యద్: వైష్ణవ సిద్ధాంతానికి అద్వైతానికీ సమన్వయం చేయడం ఎలా?

మ: వైష్ణవులు తాము విశిష్టాద్వైతులమంటారు. అదీ అద్వైతమే. వ్యక్తికి ఆత్మ, అహంకారము, స్థూల దేహములవలెనే దైవానికి పరమాత్మ, జగత్తు, వ్యక్తులూ.

భ: భక్తి ద్వైతాన్ని సూచించదా?

మ: స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే" (ఆత్మస్వరూప మననము, ) -- భక్తి ఆత్మవిచారము లొక్కటియే. అద్వైతుల ఆత్మయే, భక్తుల దైవము.

భక్తి భ: మానవుని ఆధ్యాత్మిక బాగోగులను రక్షించే వివిధ మత మూల ఆచార్యులతో ఆధ్యాత్మికంగా హెచ్చుతగ్గులు ఉన్నాయా?

మ: ఉండనీ, లేకపోని, మహా అయితే అది ఊహయేగాని వేరు కాదు. ఆత్మ ప్రత్యక్షము. స్వత సిద్ధము. ఊహలతో పని ఏమి? అట్టి తారతమ్యాలను కొందరు అంగీకరిస్తారు. కొందరు ఒప్పుకోరు. కాని ఆత్మనెవ్వరూ కాదనలేరు.

భః ప్రవృత్తి, నివృత్తి మార్గములపై భగవాన్ అభిప్రాయమేమి?

మ: అవును. రెంటిని చెప్పియే ఉన్నారు. అయితే ఏమి?

భ: రెంటిలో మేలేది? అని.

మ: ఆత్మను సూటిగా, సరళంగా (simple) చూస్తే, అది నివృత్తి. జగంతో కలిపి చూస్తే ప్రవృత్తి. అంతర్ముఖ మనస్సు, నివృత్తి; బహిర్ముఖ మనస్సు ప్రవృత్తి రెండూ ఆత్మకు భిన్నాలు కావు, రెండూ ఒకటే.

ఆచార్యుల హెచ్చుతగ్గుల విషయం కూడా అంతే. అవేవీ ఆత్మకు భిన్నంగా ఉండలేవు. అవి ఆత్మలోనే ఉన్నవి, ఆత్మగనే ఉండేవి. అందరికీ ఆత్మసాక్షాత్కారమే గమ్యం.

## భాషణములు 275

నలుగురూ కలసి మాట్లాడుకుంటుండగా ఒకరన్నారు: 'పాల్ బ్రంటన్ మరియొక యువతి, ఇర్వురూ రాత్రివేళ తిరిగి వస్తూండగా, కొండలో సగభాగంలో ఒక జ్యోతి మెల్లగా, శాంతంగా ఉత్తరంనుంచి దక్షిణముఖంగా కదలాడుతూ కనిపించిందట. రూపుగొన్న జ్ఞానమే ఈ కొండయని భగవాన్ అన్నారు.

భ: స్థూల దృష్టికది ఎట్లు కన్పిస్తుందో?

మ: సంబంధర్ ఇట్లు పాడారు: "నా హృదయాన్ని బంధించిన వానిని, నా హృదయాన్ని కొల్లగొట్టిన వానికి నా మనస్సులోని గానం చేస్తాను." హృదయం బందీ అయింది. ఫలితంగా మనస్సు హృదయంలో జొచ్చికొనిపోయింది. కాని అప్పటికీ దాని స్మృతి ఉండనేవుంది. లేకపోతే ఆ యతీంద్రులు తరువాత ఎప్పుడో దానిని కీర్తించేదెలా?

ఒక యువకడు చదువుకొన్నవాడు, కొంత స్థితీ, స్థోమతు ఉన్నవాడు, ఆరోగ్యవంతుడు, మంచి చెడ్డా ఎరిగినవాడు అతడి అనుభవం ఇలా వుంది. ఒకనాడు ఇంట్లో భగవాన్ పటం ఎదురుగా కూర్చుండి ఆయన్ను ధ్యానిస్తున్నాడు. ఉన్నట్లుండి చిత్రం సజీవమైనట్లు తోచింది. భయంతో మూర్ఛపోయేంతపని అయ్యింది. అమ్మను కేకవేశాడు. ఆమె వచ్చి ఏమయింది అని అడిగింది. చుట్టూ వున్న మూగిన బంధువులు వాని స్థితి చూచి కలవరపడ్డారు. వాళ్ళందరూ అక్కడే ఉన్నారని వానికి తెలుస్తూనే వుంది. కాని ఆ తెలియని శక్తి వానినింకా అణచేస్తున్నది, అతడు దాని నెదుర్కొంటూనే ఉన్నాడు. కొంతసేపు స్మృతిని కోల్పోయాడు. తెలివి వచ్చాక వానిని భయమావేశించింది. ఆతరులైన బంధువులు వానికి మందులు ఇచ్చి సహాయం చేయసాగారు.

తరువాత కొంతకాలాని కతడు తిరువణ్ణామలై వచ్చాడు. ఏదో మునుపటి లాగే ముంచుకొస్తుందనే భయం ఉండనే ఉంది. భగవాన్ సన్నిధి, అట్టిదేమీ జరగనీయలేదు. కాని హాలునుంచి బయటకు వెళ్లినపుడెల్లా, వానికా పూర్వపు శక్తి పూనకం వచ్చి, భయావేగంలో చిక్కేవాడు.

భగవాన్ అడిగారు: అలాగా? నాకెవరూ ఇంతవరకూ ఇలా చెప్పలేదే?

అది శక్తిపాతం (దివ్యశక్తి అవతరించటం) కాదా? అని అడిగాడొక భక్తుడు.

మ: అవును, అది అంతే. పెర్రివాడు సంస్కారాలను పట్టుకొని ఊగులాడుతాడు; జ్ఞాని అట్లు చేయడు. వారిద్దరిలో భేదమది. జ్ఞానం కూడ ఒక విధమైన పిచ్చే.

భ: కాని శక్తిపాతం కర్మసామ్యము (లోపాలు, సుగుణాలు సమపాళ్ళు) ఉంటేగదా?

మ: అవును. మలపరిపాక, కర్మసామ్య, శక్తిపాతముల కర్థం ఒకటే. మనిషి తన సంస్కారగతిని సాగిస్తున్నాడు; ఆత్మ తానే అని బోధించినపుడు వాని ఊహాశక్తి, మనస్సు ఉద్వేగంలో కట్లు త్రెంచుకుంటాయి. ఉరకలువేస్తూ వస్తూన్న ఆ శక్తి ఎదుట తాను అసహాయుడననుకొంటాడు. వానికి అర్థమైన రీతిలో తానాత్మయని అతడేస్థితిగ ఊహించాడో దాన్ని బట్టే వాని అనుభవాలుంటాయి. శక్తిపాతంవల్ల కలిగే అనుభవం యథార్థము, సరి అయినది.

ఎవరైనా బోధను గ్రహించేంత పక్వబుద్ధి అయి, వాని మనస్సు హృదయంలో ప్రవేశించే తరుణంలో ఈ బోధ వినెనా, అది మెరుపువలె పనిచేస్తుంది. వాని కాత్మసాక్షాత్కారం నిశ్చయం అవుతుంది; అలాగాకపోతే ఘర్షణ తప్పదు.

మనోనాశము, చిత్తైకాగ్రత, జ్ఞానము -- ఇవన్నీ సమానార్థకాలే.

## భాషణములు 276

ఉత్తరప్రదేశ్ నుండి ఒకామె, తమ్మునితో, పరిచారికతో, ఒక లావుపాటి అంగరక్షకునితో వచ్చి చేరింది.

హాలులోకి రాగానే, ఆమె భగవాన్కు భక్తి వినయములతో నమస్కరించి, ఎదుటనే ఉన్న ఉన్ని కంబళిపై కూర్చుంది. అప్పుడు భగవాన్ తెలుగుపత్రిక త్రిలింగంలో ఒక పిల్లవాని పూర్వజన్మవృత్తాంతముంటే చదువుతున్నారు.

ఆ పిల్లవానికిపుడు 13 ఏండ్లు, లక్నో సమీపగ్రామంలో గవర్నమెంటు హైస్కూలులో చదువుతున్నాడు. మూడేండ్ల వయస్సులో, ఇక్కడ అక్కడ ఏదో త్రవ్వుతూ ఉండేవాడు. ఎందుకని ఎవరన్నా అడిగితే, తాను నేలలో దాచిన దాన్ని తిరిగి తీసుకోడానికి అనేవాడు. ఆ మరు సంవత్సరం వాళ్ళ యింట్లో వివాహము జరిగింది. వెళ్ళిపోతూన్న బంధువుల్లో ఒకరు హాస్యానికి, ఈ పిల్లవాని పెండ్లికి మళ్ళీ వస్తామన్నారు. కాని వాడు 'నాకు పెండ్లి ఎప్పుడో అయింది, నాకు ఇద్దరు భార్య'లని బదులు పలికాడు. వాడు చెప్పిన గ్రామానికి తీసుకొని వెళ్ళితే అక్కడ ఇద్దరు స్త్రీలు తన భార్యలని చూపాడు. తరువాత కనుక్కొంటే వారి భర్త చనిపోయిన 10 నెలలకీ పిల్లవాడు పుట్టాడని తేలింది".

ఎదుట కూర్చున్న ఆమెకీ వృత్తాంతం భగవాన్ తెలియచెప్పారు.

ఆమె: మృతుని స్థితిని తెలుసుకోగలమా?

మహర్షి: చనిపోయిన వారిలో కొందరు తక్షణమే మరొక జన్మ ఎత్తుతారు. కొందరు కొంతకాలం పిదప, కొందరీ భూమిపై జనించక, ఏదేనొక ఊర్ధ్వలోకంలో ముక్తులౌతారు; ఎవరో చాల కొద్దిమంది మాత్రమే ఇచటే ఇప్పుడే ముక్తులౌతారు.

భక్తురాలు: నే నడిగినదది కాదు. ఒకరు చనిపోయిన తర్వాత వారే స్థితిలో ఉన్నారో తెలిసికొన సాధ్యమా? అని.

మ: సాధ్యమే. కాని దానిని తెలియగోరు టెందుకు? విషయమేదైనా, అది అన్వేషించే వానికన్నా ఎక్కువ నిజం కాదు.

భ: ఒక వ్యక్తియొక్క పుట్టుక, జీవితం, చావూ ఇవన్నీ మాకు నిజమే.

మ: నిన్ను దేహమని భ్రమిస్తున్నావు గనుక, ఇతరులని గూడ దేహబుద్ధితోనే చూస్తావు; నీవుగాని ఆ ఇతరులుగాని దేహాలు కారు.

భ: నే నెరిగినంతవరకూ నేనూ నా కొడుకూ యథార్థమనే నా నమ్మకం.

మ: పుట్టువు అంటే “నేను” ఆలోచన పుట్టుకన్నమాట. దాని చావు, వాని చావు. “నేను” భావన కలిగాక, కల్లయైన దేహాత్మబుద్ధి జనిస్తుంది. దేహమే నీవు అనుకొని, ఇతరులకు తప్పు విలువ నారోపించి, వారినే దేహాలతో పోల్చుతావు. నీ దేహం పుట్టి పెరిగి నశిస్తుంది. గనుక, ఆ ఇతరుడూ పుట్టి పెరిగి చనిపోయాడని భావిస్తావు. వాని పుట్టుకకు పూర్వం, నీ కొడుకు స్థితిని గూర్చి యోచించావా? పుట్టిన పిదప వాని తలపు వచ్చి, ఆ తలపు వాని మృతి తర్వాత గూడ, వదలడం లేదు. వానిని నీవు తలచినంత కాలమూ వాడు నీ పుత్రుడే. అతనెక్కడికి వెళ్ళాడు? వాడు వదలివచ్చిన తావుకు. వాడు నీలోనే వున్నాడు. నీ వున్నంతవరకూ వాడూ ఉంటాడు. నీవు దేహమని అనుకోడం మానేసి యధార్థమైన "ఆత్మ"ను తెలిసికొంటే, ఈ భ్రాంతి వదలిపోతుంది. నీవు నిత్యము. ఇతరులు నిత్యులే అని తెలుస్తుంది. ఈ నిజం ఎరుగనంతవరకూ ఈ దుఃఖముండనే వుంటుంది. ఇది ఎందుకంటే, తప్పుగా అర్థంచేసుకోవడం వలన, తప్పు తాదాత్మ్యం వలన కల్గిన తప్పు విలువల ఫలితం ఈ దుఃఖం.

భ: శ్రీ భగవాన్ నాకు యథార్థ జ్ఞానాన్ని అనుగ్రహించాలి.

మ: ఈ “నేను” ఆలోచనను వదుల్చుకో. ఈ “నేను” బ్రతికి ఉన్నంత కాలం దుఃఖం ఉంటుంది. “నేను” నశిస్తే దుఃఖం లేదు. నిద్రావస్థను తలచుకో.

భ: నిజమే. కాని "నేను" విచారం మొదలు పెట్టగానే ఎన్నో ఆలోచనలు వచ్చి నన్ను ఇబ్బంది పెడతాయి.

ము: అవి ఎవరి ఆలోచనలో చూడు. అవే పోతాయి. వాటన్నిటికీ మూలం “నేను” ఆలోచనే. దాన్ని పట్టుకో మిగిలినవన్నీ మాయమౌతాయి.

భగవాన్ మళ్ళీ యోగవాసిష్ఠము (5, అ.20)లోని పుణ్య, పాపుల గాథను సూచించేరు. తల్లితండ్రుల నిర్యాణానంతరం పుణ్యుడు పాపుని ఓదార్చి ఆత్మ సాధనవైపు మరల్చాడు. సృష్టిని రెండు రీతులుగా చూడాలి.

1. ఈశ్వర సృష్టి, 2. జీవ సృష్టి, వీనిలో విశ్వం మొదటిది; జీవునితోడి దాని సంబంధము రెండవది. ఈ మొదటివాని ప్రమేయము లేకుండా, ఈ రెండవది సుఖదుఃఖాలను పెంచుతుంది. 'పంచదశి'లో ఒక కథ ఉంది --

దక్షిణ భారతంలో ఒక గ్రామం. ఆ ఊరిలో ఇరువురు యువకులు వారు ఉత్తర భూములకు యాత్రకు వెళ్ళారు. వారిలో ఒకడు మరణించాడు. రెండవవాడు, సంపాదనాపరుడు. కొన్ని నెలల తర్వాతనే ఊరికి తిరిగిపోవ నిశ్చయించాడు. ఈలోగా అతనికొక యాత్రికుడు, దేశాటనం చేస్తున్నవాడు, ఇసి) తారసిల్లాడు. తమ గ్రామంలో తమ వారికి తన్నుగూర్చి, ఆ రెండవవాని మరణం గూర్చి వాని ద్వారా వార్త పంపించాడు. G యాత్రికుడు వార్తనైతే అందచేశాడు, కానీ పేర్లల్లో తారుమారైంది. ఫలితం ఏమైంది? చనిపోయిన వాని తల్లితండ్రులు కా తమ బిడ్డ భద్రతకెంతో సంతోషించారు; బ్రతికియున్న వాని తల్లితండ్రులు దుఃఖంతో కుమిలిపోయారు. సుఖదుఃఖాలు యథార్థ ప్రత్యయాలు కావు, మనోభావనపై ఆధారపడేవి. దానికి జీవసృష్టి కారణం. జీవుడు మరణిస్తే, భేదము లేదు, ముదము లేదు. మానసానందము సంతతమూ వెల్లివిరుస్తుంది. జీవుని చంపుట అంటే, ఆత్మస్థితుడు కావడం.

భ: అంతా వింటూనే ఉన్నాను కాని, అది నా అందుబాటులో లేదు. వలసిన గ్రహణశక్తి భగవాన్ నాకీయవలె.

'మైసూరు'లో ఒక జలపాతం చూసాను. ఈ ఝురీ దృశ్యం సమ్మోహకంగా ఉంది. ఉరకలు వేస్తున్న నీరు పాయలై చేతివ్రేళ్ళు పరచుకొన్నట్లు పారుతూ, దారిలో రాళ్ళను దొరకబుచ్చుకొనేందుకు యత్నిస్తూ, వెనుకనుంచి వస్తూన్న ప్రవాహం ఒత్తిడికి క్రింది లోతులలో తలక్రిందులై పడిపోతున్నట్లు కనుపించింది. ప్రస్తుత పరిస్థితుల నంటిబెట్టుకున్న వ్యక్తుల స్థితి ఇదేనని నేనూహిస్తాను. అయినా, ఆ అంటిపెట్టుకొనడం మాన నా తరం కాదు.

'ఆయా ఋతువుల్లో జనించే పూలు పండ్లూ, చెట్ల ఆకులూ, వానికన్న మానవుని స్థితి మెరుగు కాదని, నేను ఊహించలేను. పూలంటే నాకెంతో ఇష్టం. కాని పై భావన నాపై ఎట్టి ప్రభావమూ చూపలేదు.”

కొన్ని నిముషాల తర్వాత మృతి దాని గూర్చిన వివరాలూ కనుగొన గోరినానని, కాని తానది విరమించుకొన్నానని ఆమె అన్నది. కాని దానికి సంబంధించిన వార్తలే భగవానా పత్రికలో చదువుతున్నారు. ఆ శీర్షికపైనే సుస్పష్ట వివరణ సాగింది. తర్వాత ఆమె గోవు లక్ష్మిని చూచి వెళ్ళిపోయింది.

## భాషణములు 277

కోహెన్: సంకల్పము లేదా నిశ్చయము (Will) ఏమి? పంచకోశాల్లో దాని స్థానమెక్కడ?

మ: మొదట “నేను” ఆలోచన ఆ వెనుకే తలపులన్నీ, అవే మనస్సౌతాయి. మనస్సు కర్మ (object), ఆత్మ కర్త (subject) "నేను"లేక సంకల్ప ముండునా? అది “నేను”లోనిదే. “నేను” భావన విజ్ఞానమయ కోశములోనిది. సంకల్పము (Will) దాని లోనిదే.

అన్నమయకోశము స్థూలదేహపు ఒర. ప్రాణముతోడి ఇంద్రియములూ, కర్మేంద్రియములూ కలిసి ప్రాణమయకోశము; ఇంద్రియములూ మనస్సు కలిసి మనోమయకోశము. అవే జ్ఞానేంద్రియములు. మనస్సు కేవలం ఆలోచనల కూటమి. "ఇదం" (ఇది) కర్మ (object) 'అహము' (నేను) కర్త (subject). ఆ రెండూ చేరితే విజ్ఞానమయకోశము.

10 నవంబరు, 1936

భాషణములు 278

కుమారి డబ్ల్యూ. ఉమాదేవి, హిందూమతం పుచ్చుకొన్న ఒక పోలిష్ వనిత. కాశ్మీర్ వెళ్లి అచట దృశ్యముల ఫోటోలు తెచ్చింది. వానిని అందరము చూస్తున్నాము. భగవాన్ హాస్యంగా "అంత దూరం ప్రయాణశ్రమ లేకుండానే, మనమాస్థలాలన్నీ చూసేసాము” అన్నారు.

ఉమ: నేను కైలాస్ వెళ్ళదలచుకొన్నాను.

మహర్షి: ప్రారబ్ధం అలా ఉంటేనే ఎవరైనా ఈ ప్రదేశాలు చూడగల్గేది. లేకుంటే వీలవదు? ఇవన్నీ చూశాక కూడా ఇంకెన్నో మిగిలేపోతాయి. భూమి మీద- ప్రాచ్యంలో కాకుంటే పశ్చిమంలోనైనా -- ఇన్ని తెలుసు అంటే, తెలిసినవాని కవతల మరెన్నో తెలియవని అర్థం. విజ్ఞానం ఎప్పుడూ పరిమితమే.

కొంత ఆగి, మళ్ళీ భగవాన్ మొదలుపెట్టారు. అప్పర్ వృద్ధుడు జరార్తుడు. కైలాస్ చూడవలెనని బయలుదేరాడు. దారిలో మరియొక ముదుసలి ఆయన్ను కలిసి, అక్కడికి చేరటం చాల ప్రయాస, మానుమని నచ్చచెప్ప చూసాడు. కాని అప్పర్ మొండివాడు. ప్రాణం ఒడ్డియైనా సరే ప్రయాణం చేసి తీరుతానన్నాడు. ఆ ముసలి అతను అప్పర్నుదగ్గరే వున్న కొలనులో మునుగమన్నాడు. అప్పర్ అట్లు చేయగానే అందులో అచ్చటే ఆయనకు కైలాస మగుపించింది. ఇదంతా జరిగిందెక్కడో తెలుసా? తంజావూరుకు తొమ్మిది మైళ్ళ దూరంలో తిరువయ్యూర్లో. మరి కైలాసమెక్కడ ఉంది. మనస్సులోనా, మరెక్కడనైనా? తిరువయ్యార్ కైలాసమైతే, అది ఇతరులకు మాత్రం అక్కడ కనిపించవద్దా? కాని అప్పర్ కొక్కడికే అది అట్లు గోచరించింది.

అలాంటి గాథలు దక్షిణంలో చాలా తావుల గూర్చి ఉన్నవి; అవియవి, శివుని వాసక్షేత్రాలనీ, భక్తులు వాని నట్లే కనుగొన్నారని. వారి దృష్టిప్రకారం అది యథార్థమే. అంతా లోననే ఉంది. బయట ఏమీ లేదు.

భాషణములు 279

భక్తుడు: చనిపోయాక మళ్ళీ జన్మించేందు కెంతకాలంపడుతుంది? మరణించిన వెంటనేనా, లేదా కొంత కాలానికా?

మహర్షి: నీవు పుట్టకపూర్వం నీవెవరవో తెలుసా, చనిపోయాక ఏమి కాబోతావో తెలిసికోడానికి? ఇప్పుడు నీవెవరో తెలుసా?

జన్మా పునర్జన్మా దేహానివి. నీవు ఆత్మను దేహమనుకున్నావు. ఆ తాదాత్మ్యం తప్పు. దేహం పుడుతుందని, నశిస్తుందని నీవు నమ్ముతావు. ఒకదాని లక్షణాలను మరొకదాని లక్షణాలని భావిస్తావు. నీ యథార్థస్థితిని తెలుసుకో. ఈ ప్రశ్నలే రావు.

పుట్టువనీ మృత్యువనీ అనడం, ఆ విషయం శోధించి జన్మలూ, పునర్జన్మలూ అనేవీ లేవని కనుగొనడానికే. అవి శరీరానికి సంబంధించినవి కాని ఆత్మకు కావు. ఆత్మను కనుక్కో సందేహాలతో సతమతమవక.

భాషణములు 280

భక్తుడు: మాయ తొలగించడానికి నాకు సహాయం చేస్తారా?

మహర్షి: మాయ అంటే ఏమిటి?

భ: ప్రపంచమందు సంగము.

మ: గాఢనిద్రలో ఆ ప్రపంచము ఉందా? అప్పుడు దానిలో మమత్వమున్నదా?

*: రంగు.

మ: నీవక్కడ వుంటివా, లేవా?

భ: ఉండవచ్చు.

మ: నిద్రలో నీవు లేవంటావా?

భ: "లేను" అనను.

మ: ఇప్పుడు ఉన్న నీవు, ఆ నిద్రలో ఉన్న నీవు ఒకరే.

భ: అవును.

| నిద్ర | మెలకువ |
|---|---|
| ప్రపంచం లేదు | ప్రపంచము ఉంది |
| రాగము లేదు. No attachment | రాగము ఉంది Attachment |
| ఆత్మ | ఆత్మ |

మ: నిద్రలో జగములేదు, రాగములేదు; రెండూ మెలకువలో ఉన్నవి.

రెండవస్థల్లోను ఆత్మసమమే. మరి ఇప్పుడు మాయను గూర్చి ప్రశ్నించిన దెవరు? భ: నిద్రలో మనస్సు లేదు. ప్రపంచము మరియు అందు మమత్వమూ రెండూ మనస్సుకు సంబంధించినవే.

మ: విషయమదే. అవి మనస్సువే, ఆత్మవి కావు.

భ: నిద్రలో నే నజ్ఞానిని.

మ: అజ్ఞానిగా ఉంటి నన్నదెవరు? ఇప్పుడు అతడు అజ్ఞాని కాదా? ఇప్పుడతడు ఆ జ్ఞానియా? కలుషితమైన 'అహం' ఇప్పుడు అజ్ఞానం గురించి మాట్లాడుతోంది.

భ: నిద్రలో అది శుద్ధమా?

మ: అది ఏ సంశయాలను రేపలేదు. లోపాలున్నవనిగాని, అసంపూర్ణమనిగాని, అపవిత్రమనిగాని అనుకోలేదు.

భ: అట్టి ఆత్మ అందరికీ సమానమే; మృత దేహానికి గూడా.

మ: కాని, నిద్రలోనివాడూ, మృతుడూ ఏ ప్రశ్నలూ అడగరు. ప్రశ్నించే దెవరో యోచించు. నీవు. నిద్రలో నీవు లేవా? అసంపూర్ణత అప్పుడెందుకు లేదు? శుద్ధ ఆత్మ అతి సరళమైనది. ఏ విషయాలందూ అది సంసక్తి పెంచదు; జాగ్రదవస్థలో వలె సచేతనం గాదు. ప్రస్తుతం మెలకువలో నీవు చైతన్య మనేది బుద్ధి మనోదేహాలు, మెదడు మొదలైన వానిపై ఆధారపడే చైతన్యం నిద్రలో చైతన్యం ఈ సంసర్గం లేకుండానే ఉంటుంది.

భ: నిద్రలో చైతన్యాన్ని నెనెరుగను గదా?

మ: ఎరుగనిది ఎవరు? నీ వప్పుడున్నావని ఒప్పుకొంటావు. 'నేను నిద్రలో నున్నా'నని నీ వంగీకరించేదే. ఆ "ఉండుట" అనే స్థితి నీవే.

భ: అట్లైతే నిద్రయే ఆత్మానుభవమంటారా?

మ: అది ఆత్మ. ఆత్మానుభవం మాట ఎందుకు? ఆత్మానుభవం లేని క్షణమున్నదా? అది ఏ క్షణంలోనైనా లేకపోతే, ఇదో! ఈ క్షణంలో ఆత్మానుభవమైనది అనవచ్చు. అది లేని క్షణమేలేదే! నిద్రే యెందుకు? మేలుకొనియుండి గూడ నీవు ఆత్మననుభవిస్తూనే ఉన్నావు.

భ నాకర్థం కావటం లేదు.

మ: నీవు దేహాన్ని ఆత్మతో తాదాత్మ్యం చేస్తున్నావు. ఆ మిథ్యారోపం వదలు. ఆత్మ తనంతట తాను ప్రకాశిస్తుంది.

భ: కాని ఇదంతా మాయను, అంటే సంగాన్ని వదల్చుకోటంలో సాయం కావలెనన్న నా సమస్యను పరిష్కరించటం లేదు.

మ: సంగం నిద్రలో లేదు; అది అవుపించడం, తోచడం, ఇప్పుడు. ఇది నీ సత్యస్వభావంకాదు. ఎవరిపై ఈ ఆరోపం? యథార్థ స్వభావం తెలిస్తే ఇవేవీ వుండవు. ఆత్మసిద్ధి అయితే, వస్తువులు ఏవీ కనిపించవు. అదే మాయను వదల్చుకోవడం అంటే. మరోవిధంగా విడగొట్టుకొనడానికి మాయ ఒక పదార్థం కాదు, కాబట్టి దానిని వేరే విధంగా తప్పించుకోలేము.

దాకలి మిడుగురులు(Sparks from the anvil -1)

## భాషణములు 281

శ్రీ మహర్షుల ఆద్యశిష్యుడనని చెప్పుకొను వారొకరు కోర్టులో అభియోగం తెచ్చారు. ఆశ్రమ సర్వాధికారి తానేనని కోర్టువారి తీర్పు నర్థించాడు.

కోర్టువారు నియమించిన ఒక కమిషన్ శ్రీ మహర్షిని పరీక్షించారు. ఒక పెద్ద గుంపు చేరింది. కాని ఏ అలజడి లేకనే విచారణ సాగింది. ఈశాన్య దిక్కు గదిలో కోర్టు సమావేశమయ్యింది. విచారణలో కొన్ని అంశాలు. భగవాన్ జవాబులు సహజంగా, సరళంగా ఉన్నాయి.

ప్రశ్న: శ్రీ భగవాన్ ఏ ఆశ్రమానికి చెందుతారు?

మహర్షి: అత్యాశ్రమం (నాల్గాశ్రమాల కవ్వలిది).

ప్ర: అదేమి?

మ: అది సాధారణంగా అందరికీ తెలిసిన నాలుగు ఆశ్రమాలకు పైది.

ప్ర: అది శాస్త్రము అంగీకరించినదేనా?

మ: అవును, శాస్త్రములలో దాని ప్రసక్తి వుంది.

ప్ర: తాముగాక మరెవ్వరైనా అట్టి ఆశ్రమము వారున్నారా?

మ: ఉండవచ్చును.

ప్ర: అలా ఎవరైనా ఇంతక్రితం ఉన్నారా?

మ: శుక, ఋషభ, జడభరతుడు మొదలైనవారు.

ప్ర: ఇంటిపై, ఆస్తిపై మమత లేక చిన్న వయస్సుననే తా మిల్లు విడిచారు. కాని ఇక్కడ ఆశ్రమమున ఆస్తిపాస్తులున్నవి. అదెట్లు?

మ: నేను వానిని కోరలేదు. అవి నాపై రుద్దబడినాయి. వాటియందు నాకిచ్ఛా లేదు, ద్వేషమూ లేదు.

ప్ర: అవి మీకు ఇవ్వబడ్డాయా?

మ: అవి స్వామి కీయబడినవి. అతడెవరైనా కానీయండి. ప్రపంచంలో దేహాన్ని స్వామి అనడం ఆచారమైంది -- దేహము ఇది. దాని సారాంశము నేను అని.

ప్ర: అట్లే అయితే ఆస్తిపాస్తులలో తిరిగి ఆసక్తి వచ్చినట్లేనా?

మ: అది అంటే నేను ద్వేషించను. చెప్పినదంత మాత్రమే.

ప్ర: సామాన్య జీవితంలో నేను చెప్పినదే దాని తాత్పర్యం.

మ: మన లోకంలో వర్తించి వ్యవహరించే రీతిగనే.

ప్ర: తాము ఉపదేశమిస్తారా? అలా ఎప్పుడైనా చేసేరా?

మ: వచ్చినవారు ప్రశ్న లడుగుతారు. నాకు తెలిసినంత వరకు సమాధానా లిస్తాను. వానిని ఎట్లు వారు తీసుకుంటారో అది వారి ఇష్టం.

ప్ర: అది ఉపదేశమా?

మ: ఇతరులు దాని నెట్లు గ్రహిస్తారో, నేనెలా చెప్పడం?

ప్ర: తమకు శిష్యులున్నారా?

మ: క్రతు క్రియలతో నేనే ఉపదేశమూ ఈయను, ఉదాహరణకు కుంభము పెట్టి దాన్ని పూజించి, ఎవరి చెవిలోనూ రహస్యంగా మంత్రముచ్చరించడం లాంటివి చెయ్యను.

ఏ వ్యక్తి అయినా, నా శిష్యుడనని భక్తుడననీ ప్రకటించవచ్చు. నేనెవ్వరినీ నా శిష్యులుగా పరిగణించను. నే నెవ్వరి నుండి ఉపదేశమూ అర్థించలేదు. ఎవ్వరికీ మంత్రక్రియాపూర్వకంగా ఉపదేశ మీయనూ లేదు. జనులు తాము నా శిష్యులమంటే నేను హర్షించను, ఖండించను. నా దృష్టి కందరూ సమానమే.. వారు నా శిష్యులమని చెప్పుకొనే అర్హత తమకున్నదంటారు. వారిని నేనే మనగలను? నేను శిష్యుడననీ చెప్పుకోను, గురువుననీ చెప్పుకోను.

ప్ర: స్కందాశ్రమమం దేవాలయ భూమి. ఆలయాధికారుల అనుమతి లేకుండానే అందు ఆశ్రమ నిర్మాణానికి తామెట్లు సమ్మతించారు?

మ: నన్నిక్కడికి రావించి, కొండపై నిల్పిన శక్తి మార్గదర్శనం వల్లనే..

ప్ర: తామీయూరికి వచ్చిన గంట లోపుగనే దగ్గర వున్న డబ్బులను విసిరిపేసారు. ఆస్తిపాస్తుల కోర్కి లేకనే అట్లుచేసారు. తాము ధనాన్ని ముట్టరు. ఇక్కడికి వచ్చిన చాల ఏండ్లవరకూ మీకెట్టి ఆస్తీ లేదు. మరి ఇప్పుడిన్ని ముడుపులను ఆశ్రమం స్వీకరిస్తున్నదే, అదెట్లు?

మ: ఈ పరిణామం కాలక్రమేణ కలిగింది. కొందరు సహచరులు నిధి వసూలు చేయుటకై నా పేరు ఉపయోగించసాగారు. వారిని నే ననుమతించనూ లేదు, ఆపనూ లేదు. అందుచే అది జరుగుతునే ఉన్నది. ఒకరు మానితే మరొక రందుకొంటారు. వసూళ్ళు జరుగుతునే ఉన్నవి. దానాలందుకోటం నా కిష్టం లేదు. కాని వీరు ఈ సలహాను వినరు. వృథాగా సలహాలివ్వడం నా కభిమతం కాదు. అందువల్ల నేను వారి నడ్డను. డబ్బు చేరుతున్నది గనుక దానితోనే ఆస్తి సమకూడుతున్నది.

ప్ర: మీరు మీ పేర సంతక మేలచేయరు?

మ: ఈ ప్రశ్నకు బదులు 'ఆత్మసాక్షాత్కారము' (సెల్ఫ్ - రియలైజేషన్) రచయిత ఇచ్చియున్నాడు. అదీగాక, నేనే పేర తెలియాలి? నాకే తెలియదు. నేనిక్కడికి చేరినది మొదలు అప్పటప్పటికి, జనులు నాకెన్నో పేర్లు పెట్టారు. నేనొక పేర సంతకం చేస్తే, అందరికీ అది తెలియదు. నా హస్తాక్షరాలడిగిన వారికి నే నొకటే చెప్పుతూవచ్చాను, వారు నా సంతకాన్ని ఎవరికైనా చూపించినా కూడ, చూచిన వారెవ్వరూ అది నిజంగా నాదని నమ్మరని.

ప్ర: తామెట్టి ధనాన్నిగాని, కానుకలనుగాని ముట్టరని నా నమ్మకం.

మ: జనులొక్కొక్కపుడు ఫలాదులను నా చేతిలో నుంచుతారు. వానిని నేను తాకుతాను.

ప్ర: తామొక రకం కానుకని గ్రహిస్తే, ధనాన్ని మాత్రమేల గ్రహింపరాదు?

మ: నేను డబ్బును తినలేను, నేను దానితో ఏం చేయను? ఏం చేయాలో తెలియని దానిని తీసుకొని నేనేం చేసుకోవాలి?

ప్ర: సందర్శకులు ఆశ్రమంలో ఏల ఉంటారు?

మ: అది వాళ్ళకు తెలియాలి.

ప్ర: ఎవరైనా ఇక్కడికి వచ్చియుంటే, తమకే అభ్యంతరమూ లేదనుకుంటాను.

మ: లేదు.

ప్ర: అలాగ వారెంతకాలముండినా గూడానా?

మ: అలాగే. నాకది నచ్చకపోతే నేనే వెళ్ళిపోతాను, అంతే.

మరుదినం న్యాయవాది భక్తులొకరు భగవాన్ను అడిగినారు "కమిషన్ వారి విచారణ తమకెట్టి శ్రమా కల్గించలేదుగదా”యని.

మ: నేను నా మనస్సు నుపయోగించలేదు. అందువల్ల ఏ శ్రమా తోచలేదు. వారు వేయిరోజులు పరీక్షించనీ, నా కభ్యంతరం లేదు.

## భాషణములు 282

భక్తుడు: తాంత్రిక సాధనలవల్ల ఆత్మసాక్షాత్కారమౌతుందా?

మహర్షి: అవుతుంది.

భ: తంత్రంలో ఏ అర్చన ఉత్తమం?

మ: వారి వారి మనోరీతినిబట్టి.

భ: ఆత్మసిద్ధి విషయంలో కుండలిని పాత్ర యేమిటి?

మ: నీ లక్ష్యంనుంచి కుండలిని జాగరితమౌతుంది. అది ప్రాణశక్తి.

భ: వేర్వేరు చక్రాల్లో వేర్వేరు దేవతలు వసిస్తారంటారు. సాధనలో వారు గోచరిస్తారా?

మ: కోర్కె వుంటే చూడవచ్చు.

భ: ఆత్మసాధనామార్గం, సమాధి ద్వారా కల్గుతుందా?

మ: ఆ రెంటి అర్థమూ ఒకటే.

భః గురువు తన శక్తిని కొంత సంక్రమింపచేసి శిష్యునికి ఆత్మసిద్ధి సమకూర్చగలడంటారు. నిజమా?

మ: నిజమే. కాని గురువు ఆత్మానుభవాన్ని తీసుకురాడు. దానికున్న అవరోధాలు తొలగించడం మాత్రమే ఆయన చేసేది. ఆత్మ ఎప్పుడూ అనుభూతమే.

భ: ఆత్మ సాధనకు గురువు తప్పని సరియా?

మ: ఆత్మసాక్షాత్కారం కోసం ప్రయత్నిస్తున్నంత కాలం గురువు అవసరమే. గురువే ఆత్మ. గురువును పరమాత్మగా, నిన్ను జీవాత్మగా ఎంచుకో. ఈ ద్వంద్వ భావన పోవటమే, అజ్ఞాననాశము. ద్వంద్వభావన ఉన్నకాలంలో గురువు కావాలి. నీకు దేహాత్మ బుద్ధి కలదు గనుక గురువునూ దేహంగానే భావిస్తావు. దేహం నీవూ గావు, నీ గురువూ దేహం కాదు. నీ వాత్మవు; గురువు అట్లే. నీ వాత్మానుభవ మంటున్నావే, దానివల్ల ఈ జ్ఞానం కల్గుతుంది.

భః గురువు సమర్థుడని గుర్తించడం ఎలా?

మ: వారి సన్నిధిలో నెలకొన్న శాంతివల్ల, వారి యెడల నీకు కలిగే భక్తి వల్ల.

భ: పూర్తిగా విశ్వసించిన గురువు, అసమర్థుడుగా తేలితే, శిష్యుని గతిఏమి?

మ: వాని గుణాన్ని బట్టి మార్గం స్ఫురిస్తుంది.

భ: సంఘ సంస్కరణ గూర్చి తమ అభిప్రాయమేమి?

మ: ఆత్మసంస్కారం జరిగితే సంఘ సంస్కారము దానంతట అదే వస్తుంది. నీవు ఆత్మ సంస్కారం కోసం ప్రయత్నించు. సంఘసంస్కారం దాని సంగతి అదే చూచుకుంటుంది.

భ: గాంధీజీ హరిజనోద్యమాన్ని తామెట్లు పరిగణిస్తారు?

మ: ఆయన్నే అడుగు.

భ: శవాన్ని తాకితే స్నానం చేయాలా?

మ: దేహమే ఒక ప్రేతం. దాని సంసర్గమున్నంతకాలం ఆత్మ జలాలలో మునుగుతూనే వుండాలి.

భ: అద్వైతము తుదిమెట్టు అయితే, మధ్వాచార్యులవారు ద్వైతాన్నెందుకు ప్రతిపాదించరు?

మ: నీ ఆత్మ ఒకటా! రెండా? అన్ని సిద్ధాంతాలూ శరణాగతిని, ఆత్మ సమర్పణను అంగీకరిస్తాయి. దాన్ని ముందు సాధించు, ఆపైన కావలసినంత తీరుబడి ఉంటుంది, ఏ సిద్ధాంతం సరియో తేల్చుకోవచ్చు.

భ: జనులను సరియైన మార్గంలో నడపేందుకు తామేల ప్రచారం చేయరు?

మ: నేను ప్రచారం చేయటం లేదని ఇప్పటికే నీవు నిశ్చయించేశావు. నీకు నేనెవరో తెలుసునా? ప్రచారమంటే తెలుసునా?

భ: బ్రాహ్మణులలో భర్త మరణించిన వారికి ముండనము చేస్తారు కదా. అది క్రూరం కాదా?

మ: దీనికి జవాబు ధర్మశాస్త్రాల్లో, సంఘు సంస్కర్తలో ఇవ్వాలి. నిన్ను నీవు మొదట సంస్కరించుకో. ఇతరుల విషయం తర్వాత చూడవచ్చు.

## భాషణములు 283

భ: జితసంగదోషుడు అవడం ఎలా? (అంటే సంపర్క దోషాలను పోగొట్టుకోవడం ఎలా)

మ: సత్సంగంవల్ల "సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్త్వం, నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః", సత్సంగమంటే, సత్ తోడి సంగము, సత్ కేవల మాత్మయే. ఆత్మ సత్ అని ఇప్పుడు తెలియదు గనుక, దానినట్లుగా తెలిసిన యోగుల సంసర్గ మభిలషిస్తాడు. సత్సంగమంటే అది అంతర్ముఖత్వం దాని ఫలం. అప్పుడు సత్ వెలుస్తుంది. సంగమెవరికి? దోష మెవరికి?

భ: ఆత్మకు.

మ: కాదు, ఆత్మ శుద్ధము. అబాధ్యము. దోషాలు అహంకారాన్నే బాధిస్తాయి.

భ: దేహం లేక ఆత్మ ఉండగలదా?

మ: ఇక కొంతసేపట్లో అట్లే ఉంటుంది -- గాఢనిద్రలో. ఆత్మకు తనువులేదు. ఇప్పుడూ అంతే.

భ: సంసార మధ్యంలో, సన్న్యాసి ఉండవచ్చునా?

మ: తాను సన్న్యాసి ననుకొన్నంతకాలం అతడు సన్న్యాసి గాడు; ఎవడుగాని సంసారాన్ని గురించి ఆలోచించనంతవరకు సంసారి కాడు. నిజమైన సన్మాసి అతడే.

## భాషణములు 284

భ: శ్రీమద్భగవద్గీతలో, బుద్ధియోగం వల్ల, గురు శుశ్రూషవల్ల, విచారంవల్ల ఆత్మసాక్షాత్కారం పొందమని ఉన్నది. వీటిని సమన్వయ పరచడం ఎలా?

మ: 'ఈశ్వరో గురురాత్మేతి' - ఈశ్వరుడూ గురువు ఆత్మ. ఇవి అభేదాలు. నీలో ద్వంద్వభావన ఉన్నవరకూ నీవు గురువును వేరనుకొంటావు. ఆయనకై అన్వేషిస్తావు. ఆయన నీకు సత్యాన్ని బోధిస్తారు. లోనిసారం నీకు బోధపడుతుంది.

భ: ఈ క్రింది వ్యాక్యాలను దయచేసి వివరించండి అహమేకో, నమే కశ్చిత్, నాహ మన్యస్య కస్యచిత్ నాహం పశ్యామి యస్యాహం, తం నపశ్యామి యోమమ.

(నేను "ఏకము" నాకని ఎవ్వరూ లేరు, అన్యు నెవ్వనివాడనూ గాను. నే నెవనివాడనో అట్టివాని నెవ్వనిపీ కానను, నా వానిగా నెవ్వనీ చూడను)

మ: ఈ వాక్యాలు శ్రుతులలో శాస్త్రగ్రంథాల్లో, పురాణాలలో (భాగవతం, మహాభారతం) పలుచోట్ల కనబడతాయి. ఆత్మసాక్షాత్కారము (self-realisation) గ్రంథంలో 11వ ప్రకరణానికది మకుటము గూడ.

అహం ఒక్కటే. అహంకారాలు ఎన్నో. అవన్నీ ఏకమైనా "అహము"లోనివే. అహంకారాలవల్ల 'అహము'బాధితము గాదు. 'నేను' కేవల మొకటే. 'నేను' సత్యము. ఆ తరువాతి భాగాలు ద్వైతాన్ని పరిహరించడానికి చెప్పినవే.

## భాషణములు 285

భ: ఆత్మ తనకుతానై తెలిసిఉంటే, ఇప్పుడే ఇది నాకెందుకు తెలియదు?

మ: ఇచట ద్వంద్వము లేదు. ఇప్పటి నీ జ్ఞానం అహంకారంవల్ల కలిగింది; సాపేక్షము (relative). సాపేక్షజ్ఞానానికి, కర్తా విషయమూ కావాలి. ఆత్మజ్ఞానము అనపేక్షము, విషయము అక్కరలేదు.

స్మృతిగూడ అట్లే సాపేక్షము. స్మరించుట కొకవిషయము, స్మరించు వాడొకడూ కావాలి. ద్వంద్వము లేనపుడు ఎవరు దేనిని స్మరించట. (గుర్తుతెచ్చుకొనుట)

భ: దేహము చనిపోతే, జీవాత్మ గతి ఏమి?

మ: జీవాత్మ అంటే అహంకారము, 'నే'నన్న ఆలోచన సూక్ష్మ రూపంలో అది తలపు, స్థూలరూపంలో మనోదేహాలను ఇంద్రియాలను ఆవరిస్తుంది. అవన్నీ అహంకారంతో సహా, నిద్రలో అంతర్హితు లౌతాయి. కాని ఆత్మ మిగిలే ఉంటుంది; మృతి సందర్భంలోనూ అంతే.

తన్ను తాను సృజించి నశింపచేసికొనేందుకు అహంకారం ఆత్మకు వేరు అయిన సత్తాగాదు. అది ఆత్మకుపకరణంగా పనిచేస్తుంది. కొన్ని సమయాల్లో ప్రవర్తిల్లనే ప్రవర్తిల్లదు. అంటే కనిపిస్తూ మాయమౌతూ ఉంటుంది. ఇదే పుట్టుక చావూ అనుకోవచ్చు.

సాపేక్ష జ్ఞానం మానసికం; ఆత్మకు చెందినది కాదు. అందువల్ల అది భ్రాంతి, అశాశ్వతము. భౌతిక శాస్త్రజ్ఞుని చూడు. భూమి గుండ్రంగా ఉందని అనుమానం ప్రకటించి, దానిని నిర్ధరించి, కాదనలేని ప్రమాణాలను సేకరించి సిద్ధాంతీకరిస్తాడు. నిద్రలో అన్ని విషయాలూ మరచిపోతాడు; వాని మనస్సు రక్తమౌతుంది; వాడు నిద్రిస్తున్నప్పుడు భూమి గుండ్రమైతేనేం, బల్లపరపుగానుంటేయేం? అలాంటి సాపేక్ష జ్ఞానం వ్యర్థమని తెలియటం లేదా? ఆ సాపేక్ష జ్ఞానాన్ని దాటి, ఆత్మలో ప్రతిష్ఠితుడవు కావాలి. అట్టి అనుభవమే యథార్థ జ్ఞానము. మానసికములైన అనుమానములు గావు.

భ: భగవాన్ అన్నిచోట్లకు వెళ్ళి అందరికీ సత్యాన్ని బోధించవచ్చు కదా?

మ: నేనట్లు చేయడం లేదని నీకెలా తెలుసు? బోధ అంటే, వేదిక ఎక్కి - చుట్టూచేరిన ప్రజానీకాన్ని వాగ్ధారలో ముంచేయడమా? ప్రబోధ చాల సరళమైనది, పరస్పరం భావాలు తెలియచేయునది. దానిని మౌనంగా కూడ చేయవచ్చు.

గంటపైన ఉపన్యాసం విని, ఏ విధంగానూ ప్రభావితుడు గాక, జీవితాన్ని సరిదిద్దుకొనే సూచనలను పాటించక వెళ్ళిపోయేవారి గురించి నీవేమనుకొంటున్నావు. మరొకడు పవిత్ర సన్నిధిలో కూర్చొని జీవితంపై దృష్టి పూర్తిగా మార్చుకొనిపోతాడు. వారిరువురునూ పోల్చిచూడు. ఇందేది మేలు? ఫలం లేని ఉద్ఘాటనమా, నిశ్శబ్దంగా కూర్చుని విజ్ఞానశక్తులను ఇతరులపై ప్రసరింపచేయడమా?

ఇక వాక్కు ఎలా వచ్చింది? శుద్ధచైతన్యము (అవ్యక్తము) ఉన్నది. దానినుండి అహంకారము. దానివలన క్రమంగా తలపులూ, మాటలూ

అవ్యక్తము (జ్ఞానము)




ఈవిధంగా మాటలు మూలానికి మునిమనుమలు. మాటలే అంత శక్తివంతములైతే అవ్యక్త, మౌన వ్యాఖ్య ఇంకెంత శక్తిమంతమో, నీవే నిర్ణయించుకో.

## భాషణములు 286

సుషుప్తిలో కోరినంతకాలం ఎందుకు ఉండకూడదు? జాగ్రదావస్థలో వలెనే దానియందును స్వ-ఇచ్ఛతోనే ఎందుకు నిలువరాదు?

మహర్షి: జాగ్రత్తులోనూ సుషుప్తి సాగుతూనే ఉంది. మనం ఎప్పుడూ సుషుప్తిలోనే ఉన్నాం. మెలకువలోనే జాగరూకతతో శ్రద్ధగా విచారించి, అనుభవంలోకి తెచ్చుకోవలసిన విషయమిది. నిజంగా లోనికిపోవడంగాని, వెలికి రావడంగాని ఏమీలేదు. అది తెలిసికోవటమే సమాధి. అజ్ఞాని నిద్రలో చాలసేపుండలేడు. ప్రకృతి వానిని బలవంతంగా లేపుతుంది. అతని అహంకారం చావలేదు. అది మరల తలయెత్తి తీరుతుంది. కాని తెలివిగలవాడు దానిని మూలంలోనే త్రొక్కివేయ యత్నిస్తాడు. వాని విషయంలో కూడ ప్రకృతి ఒత్తిడివల్ల అహంకారం మరల మరల వస్తూనే ఉంటుంది. అదే ప్రారబ్ధము. అంటే జ్ఞానిలో అజ్ఞానిలోనూ అహంకారము మొలకెత్తుతూ ఉంటుంది. భేదమొక్కటే. అహంకారం వ్యక్తమైనపుడు అజ్ఞానికి దాని మూలం తెలియదు. జాగ్రత్ స్వప్నావస్థలలో తన సుషుప్తి స్థితి స్మృతి ఉండదు. కాని జ్ఞానికి అహంకారం వ్యక్తీకరణమైనపుడు, తన ఆధ్యాత్మిక అతీత జ్ఞాన అనుభవాన్ని ఈ అహంకారంను దాని మూలంలో ఎల్లప్పుడూ లక్ష్యముంచి ఆస్వాదిస్తాడు. ఇట్టి అహంకారం ఆపత్కరం కాదు. కాలిపోయి, రూపం మాత్రం మిగిలి ఉన్న త్రాడు వంటిది. ఈ రూపంలో దానికి బంధించే శక్తి యుండదు. నిరంతరంగా దాని మూలమందే దృష్టి నిల్పితే, అందులో అహంకారం సముద్రంలో ఉప్పు బొమ్మవలె, కరిగిపోతుంది.

భక్తుడు: శ్రీరామకృష్ణులు నిర్వికల్ప సమాధి 21 రోజులకన్నా నిలువదనీ, బలవంతంగా నిలుపబూనితే, ఆ వ్యక్తి చనిపోతాడనీ అన్నారు. అది నిజమేనా?

మ: ప్రారబ్ధం నిశ్శేషమయ్యాక, అహంకారం పూర్తిగా కరగిపోతుంది; దాని పొడయే కనబడదు. అది అంతిమ విమోచనము. ప్రారబ్ధము లవలేశం మిగిలియున్నా, జీవన్ముక్తునియందునూ, శుద్ధరూపమున, అహంకారం లేస్తూనే ఉంటుంది. నిర్వికల్ప సమాధికి 21 రోజుల పరమావధి నిస్సంశయ మనుకోకు. 30,40 రోజులుపవసిస్తే మనిషి మరి బ్రతుకడంటారు. కాని ఇంకా ఎక్కువ రోజులు, 100 దినాలవరకూ ఉపవసించిన వారున్నారు. వారి ప్రారబ్ధమింకా మిగిలియున్నదనే దాని అర్థం.

భ: ఆత్మానుభవమెట్లు సాధ్యము?

మ: బ్రహ్మమునుండి, ఒక అగ్నికణము అగ్నినుండివలె, వెలివడుతుంది. అది అహంకారం. అజ్ఞానిపరంగా అదిపుట్టీపుట్టగానే, విషయాత్మకమవుతుంది. విషయ సంబంధికాక స్వతంత్రంగా అది నిలువలేదు. ఈ సంపర్కమే అజ్ఞానం. మన యత్నాలన్నీ ఈ అజ్ఞాన నిర్మూలన కొరకే. దాన్ని విషయాత్మిక బుద్ధిని నశింపచేస్తే అది శుద్ధంగా మిగులనూ వచ్చు, కాక మూలంలో లయమూ కావచ్చు. ఈ దేహంతో తాదాత్మ్యం చెందడమే దేహాత్మ బుద్ధి. (నేను ఈ శరీరము అనే భావన) ఇదే తప్పు. అది పోతేనే సత్ఫలితాలు కలిగేది.

భ: దాన్ని తొలగించే దెలాగ?

మ: మనోదేహాలతో కలవకుండానే నిద్రలో మనమున్నాము. మిగత రెండవస్థల్లో వానితో కలిసి ఉంటాము. మనం దేహంతో సమమైతే అది లేక సుషుప్తిలో ఎట్లుంటాము? మనకు బాహ్యమైన దానితో వేరుపడవచ్చునే గాని సమమైనదానితో గాదు. కాబట్టి అహంకారం దేహ సమానం కాదు. జాగ్రదవస్థలో దీనిని గుర్తుంచుకోవాలి. అవస్థాత్రయాన్ని పరిశీలించడం ఈ దృష్టి నలవరచుకోవటానికే. (అవస్థాత్రయమంటే: మేల్కొనుట (జాగ్రత్) కల (స్వప్నము) మరియు గాఢనిద్ర (సుషుప్తి) రెండవస్థల నడుమగాని, రెండు తలపుల మధ్యగాని అంతరాంతరంగా ఈ శుద్ధ అహంకారం అనుభవంలోకి వస్తుంటుంది.

అహంకారము తృణ జలూకము (గడ్డి పురుగు) వంటిది. అది ఒక ఆలంబనమును పట్టుకొన్న తర్వాతే మొదటి ఆధారాన్ని వదులుతుంది. విషయములతోనూ, తలపులతోనూ ఎట్టి సంపర్కమూ లేకున్నపుడే అహంకారం యొక్క నిజమైన స్వభావం గోచరిస్తుంది. అవస్థాత్రయ పరిశీలనం పెంచిన విశ్వాసంతో అట్టి అవకాశం పెంపొందించుకో.

భ: మనం నిద్రించే దెట్లు, మేలుకొనేదెట్లు?

మ: కోడి పిల్లలవలెనే. రాత్రి సమీపించగానే తల్లికోడి “కొక్కోరక్కో” అంటుంది. తోడనే పిల్లలు పరువిడి దాని రెక్కలమాటున దాగుతాయి. అంత పిల్లలకు అండగా పెట్ట గూటిపై శయనిస్తుంది. తెల్లవారగనే పిల్లలు వెలికి వస్తాయి, పెట్టగూడ అలాగే చేస్తుంది. అహంకారం తల్లికోడి. అన్ని ఆలోచనలనూ తన యండచేర్చుకొని నిద్రిస్తుంది. సూర్యోదయంతో కిరణాలు వెలికి ప్రసరించి, రాత్రి ఉపసంహృతమౌతాయి. అలాగే అహంకారం ప్రకటమైనపుడు అన్ని హంగులతో గోచరిస్తుంది; అది లయమైనపుడు అవన్నీ దానితోనే మాయమౌతాయి.

భ: సుషుప్తి ఎలా ఉంటుంది?

మ: మేఘావృతమైన చీకటి రాత్రిలో వస్తువులను స్పష్టంగా గుర్తించ సాధ్యంగాదు. కన్నులు విప్పారే ఉన్నా దట్టపు చీకటి తప్ప మరేమీ గోచరించదు. అలాగే సుషుప్తి గూడా; చూచువాని కజ్ఞానం తెలుస్తుంది.

ఉత్సుకియైన ఒక వ్యక్తితో భగవాన్ అన్నారట- "ఈ ప్రపంచమే మిధ్య అయినపుడు ఇక్కడ నిజము, అబద్ధము అనే సంభాషణకు అర్థమేముంది?".

## భాషణములు 287

వైద్యవృత్తిలో ఉన్న పంజాబియొకరు, భార్యతో గూడ, భగవాన్ను చూడ్డానికి వచ్చారు. మధ్యాహ్నం భోజనం అయ్యాక భగవాన్ హాలులోనికి తిరిగి వచ్చేటప్పటికి అక్కడే ఉన్న అతడడిగాడు

"నాకు మనశ్శాంతి లేదు, నేను ధ్యానం చేసేదెలా?"

మహర్షి: శాంతి మనుజుని సహజస్వభావము. దానిని తిరిగి పొందే మాటే లేదు. ఆలోచనలను నశింపచేయాలి.

భక్తుడు: నేనందుకు యత్నిస్తున్నాను. కాని సాధ్యం కావడంలేదు.

మ: దానికి గీతలో చెప్పినదే మార్గం. మనస్సు చెదరినపుడెల్లా, దాన్ని మొదటికి అంటే ధ్యానస్థానానికి తీసుకొనిరావటం.

భ: నా మనస్సును ధ్యానానికి తీసుకురాలేకున్నాను.

మరొక భక్తుడు: స్వేచ్ఛగా ఉన్నప్పుడు ఏనుగు తన తొండం ఇటునటు ఊపుతూ అస్థిరంగా ఉంటుంది. ఒక గొలుసు నందిస్తే దాన్ని తొండంతో కరచుకొని నిశ్చలంగా ఉంటుంది. లక్ష్యం లేనప్పుడు మనస్సు అశాంతము; లక్ష్య నిర్ణయముంటే అది నిశ్చలము.

భ: అదంతా కేవలం సిద్ధాంతం. నేనూ చాలా పుస్తకాలు చదివాను. అంతా వృథా. చిత్తాన్ని ఏకాగ్రం చేయటం అసంభవం.

మ: వాసనలున్నంత కాలం చిత్తైకాగ్రత సాధ్యంకాదు. అవి భక్తిని గూడ అడ్డుతాయి.

అనువాదకు లాయన్ను 'నే నెవరు' పుస్తకాన్ని చదువమన్నారు. కాని డాక్టరు ప్రతిషేధంతో సిద్ధంగా ఉన్నాడు. 'నే నది చదివాను. కాని చిత్తాన్ని ఏకాగ్రం చేయలేకున్నాను'.

మ: దానికి అభ్యాసము, వైరాగ్యము కావాలి.

భ: వైరాగ్యం ముఖ్యం కాని

మ: అభ్యాసమూ, వైరాగ్యమూ రెండూ అవసరమే. వైరాగ్యం, విక్షేపం లేకపోవడం; అభ్యాసం ఒకే తలపుపైననే మనస్సుంచటం. ఒకటి విధి; రెండవది, నిషేధంగా ధ్యానవిషయంలో వర్తిస్తాయి.

భ: నా అంతట నేనది చేయలేకున్నాను. సాహాయానికై ఏదేని శక్తిని వెదుకుతున్నాను.

మ: దాన్నే అనుగ్రహం అంటారు. మనస్సు దుర్బలం కనుక, వ్యక్తి గతంగా మనం అశక్తులం. అనుగ్రహము కావాలి. సాధుసేవ అందుకొరకే. ఇంతకూ కొత్తగా తెచ్చుకొనేది ఏదీలేదు. బలహీనుడు బలవంతుని వశుడయ్యేలాగే, మనుజుని దుర్బల మనస్సు, దృఢమనస్కులకు సాధువుల సన్నిధిలో లోబడుతుంది. అచట ఉన్నది అనుగ్రహము, మరేదీ కాదు.

వై: నా శుభానికై తమ ఆశీస్సులను వేడుతున్నాను.

మ: సరి, సరి.

ఆ వైద్యుడు భార్యతో సహా వెళ్ళిపోయాడు.

సెప్టెంబర్ 29, 1936

భాషణములు 288

వేదాంతంలోని మాయ, ప్రత్యభిజ్ఞలోని స్వతంత్రలతను శ్రీ భగవాన్ ఇట్లు వివరించారు

వేదాంతులు మాయను శివునందలి విభ్రమ శక్తిగా వర్ణిస్తారు. మాయకు స్వంతంగా ఉనికి లేదు. జగము నిజమనే భ్రాంతి పెంచిన పిదప, తన బారినపడినవారి అజ్ఞానం ఆధారంగా, శక్తి తన లీలసాగిస్తుంది. తన లేమి తెలిసిపోవడంతో మాయమౌతుంది.

ప్రత్యభిజ్ఞ ప్రకారం శక్తి శివునితో సమకాలీన. వారికి వేర్వేరు స్థితియే లేదు. శివుడవ్యక్తము, శక్తి వ్యక్తము. ఇందుకు కారణము శక్తికి (స్వ-ఇచ్ఛా) స్వేచ్ఛ ఉండటమే. అద్దంలో ప్రతిబింబంవలె, శుద్ధ చైతన్యంలో, శక్తి ఈ విశ్వంగా వ్యక్తమవుతుంది. అద్దం లేకుంటే ప్రతిబింబములుండవు. అలాగే ప్రపంచానికి స్వయంస్థితి లేదు. చివరకు స్వేచ్ఛ లేదా స్వతంత్రము పరబ్రహ్మము యొక్క గుణ విశేషముగా చెప్పబడింది.

బ్రహ్మము నిర్గుణము, మాయకు స్వతంత్రముగా ఉనికిలేదు. అని శంకరుల వివరణ. ఈ వాదాల్లోని భేదం ఏమిటి? ఈ దృశ్యము నిజం కాదని ఇద్దరూ ఒప్పుకుంటారు. ఎటు చూచినా, అద్దంలోని బింబాలు నిజం కాదు. ప్రపంచము వస్తుతః లేదు. ఇద్దరి తాత్పర్యమూ ఒకటే. బ్రహ్మస్థితియే వారిర్వురికి పరమలక్ష్యము. ప్రత్యభిజ్ఞతో విశ్వం మిథ్యయనేది అంతర్భూతంగా ఉంది. వేదాంతంలో అది సుప్రకటితము. ప్రపంచాన్ని శుద్ధచిత్తుగా భావిస్తే విశ్వము యథార్థమే. వేదాంతం నానాత్వం లేదంటుంది. అంటే సర్వమూ సత్యమే. ఉపయోగించే మాటలు వేరు, చెప్పే పద్ధతి వేరు. అంతే తప్ప ఇర్వురిలో భావభేదమేమీ లేదు.

## భాషణములు 289

కర్మసిద్ధాంతం చర్చిస్తూ శ్రీ భగవాన్ ఇలా చెప్పారు.

"కర్మకు ఫలముంటుంది. అవి కారణ కార్యాలు, వాని కార్యాచరణ సంబంధం శక్తి జనితం. ఆ శక్తినే దైవమంటాము. ఫలదాత దైవము."

వచ్చిన వాళ్ళలో ఒకరు ఆత్మయొక్క నిజస్వరూపం గురించి మరచి, ఆత్మగురించి మాట్లాడుతున్నాడు. కాసేపు తర్వాత శ్రీభగవాన్ అన్నారు -

"ఆత్మపూర్ణత, దాని స్మృతి విస్మృతుల గూర్చి మాట్లాడుతారు. జ్ఞప్తి, మరపు రెండూ ఆలోచనలు మాత్రమే. ఆలోచనలున్నంత కాలం జ్ఞప్తి మరపులు ఒకటి మారి మరొకటిగా కలుగుతూనే ఉంటాయి. కాని సత్యం ఈ రెండింటికి భిన్నంగా, అతీతంగా ఉంటుంది. జ్ఞప్తి మరపులు ఒక విషయం మీద ఆధారపడతాయి. అది ఆ విషయానికి అన్యంగా ఉండక తప్పదు గదా? కాకుంటే మరచేది దేనిని? దానినే అందరూ "నేను" అంటారు. కాని వెదకితే అది కనబడదు. ఎందుకంటే అది నిజం కాదు గనుక, ఈ 'నేను' అనేదే మిథ్య లేదా అజ్ఞానము. (భ్రమ, మాయ, అవిద్య, అజ్ఞానం). అజ్ఞానమంటూ ఎప్పుడూ లేదని నిరూపించటమే సర్వతత్త్వోపదేశ ప్రయోజనము. తెలిసినవానికే తెలియకపోవడం అనేది. ఎరుక (తెలియుట)యే జ్ఞానము. అది నిత్యమూ, సహజమూ. అజ్ఞానం అస్వాభావికమూ, అయథార్థమూ (మిథ్య).

భక్తుడు: ఈ సత్యం విన్నాకగూడ, ఎవ్వరికీ ఎందుకు తృప్తికల్గదు.

మహర్షి: సంస్కారాలు నాశనం కాలేదు గనుక. అవి పోయేదాకా సంశయమూ, అస్పష్టత తప్పవు. (సంశయము, విపరీతము) వానిని తొలగించటానికే సర్వయత్నాలు చేయాలి. వానిని కూకటివేరుతో సహా ఛేదించాలి. వాని వేరులు సంస్కారాలు. గురువు చెప్పిన మార్గంలో అభ్యసిస్తే అవి అశక్తాలౌతాయి. సాధకుడు లేదా ముముక్షువు ఈ మాత్రమైనా చేయాలని గురువు వానికది వదలుతారు. అట్లైతేగాని అతడు తనంతతాను అజ్ఞానం మిథ్యయని కనుగోలేడు. పై తెల్పిన సత్యం శ్రవణ దశకు చెందినది. ఇంకా అది దృఢం కాదు. అది అచంచలం కావడానికి మననమూ, నిదిధ్యాసలను అభ్యసించాలి. ఈ రెండు విధులూ వాసనా బీజాలను మాడ్చివేసి, వానిని నిస్సారం చేస్తాయి.

అరుదుగా కొందరు మహానుభావులుంటారు. 'సకృత్ శ్రవణ మాత్రేణ ..." ఒకమారు వినగానే వారికి దృఢజ్ఞానం అలవడుతుంది. వారు కృతోపాసకులు, కాని అకృతోపాసకుల కందుకు ఎక్కువకాలం పడుతుంది. "అసలు అవిద్య ఎందుకు రావలె"నని కొందరి ప్రశ్న. వారికి జవాబు ఒక్కటే- అవిద్య మొలకెత్తనే లేదు. అది వాస్తవం కాదు. ఉన్నది ఒకటే; అదే విద్య (జ్ఞానము).

భక్తుడు: అయితే నాకది ఎందుకు తెలియడం లేదు?

మహర్షి: సంస్కారాలవల్ల, అయినా వెదకి చూడు. తెలియనివారెవరో, తెలియనిదేమో? అప్పుడవిద్యలేదని సుస్పష్టమవుతుంది.

## భాషణములు 290

శ్రీసాగరమల్, బొంబాయి దూది వర్తకుడు, మార్వాడి. భగవద్గీతను చక్కగా చదివినట్లున్నాడు. అతడడిగాడు --

భక్తుడు: గీతలో "మత్తఃపరతరం నాన్యత్ కించిత్" అని ఉన్నది. తరువాత "సూత్రేమణిగణా యివ" అని. (నా కన్యమేమీ లేదు దారమునకు గుచ్చిన మణిగణమువలె). శ్రీ కృష్ణుడు కాకుండా మరెవ్వరూ లేకుంటే, ప్రపంచము సూత్రమందలి మణి ఎట్లు కాగలదు?

మహర్షి: సూత్రము, మణిగణములు నా కన్యములుగావు అని దాని అర్థము. సూత్రమున కన్యముగా మణిగణము లేదు. నాకు భిన్నంగా సూత్రము లేదు. నానాత్వము పైకి కనబడుతున్నదే గాని నిజంగా ఉన్నది ఏకమే అని ఆ శ్లోకము నిశ్చయంగా తెలుపుతున్నది.

భ: భగవంతునిలో లీనమైన పిదప ఏకత నిజమే. కాని అంతవరకు? నానాత్వమున్నది కదా. సంసారమంటే అదే కదా?

మ: మన మిపుడున్నది ఎక్కడ? భగవంతుని నుండి వేరుగా ఉన్నామా? సంసారమూ, మనమందరమూ భగవంతునిలోనే ఉన్నాము.

భ: నిజమే. అది జ్ఞానుల అనుభవం. జ్ఞానము కలిగే వరకు నానాత్వముండనే ఉంటుంది. కాబట్టి నాకు సంసారముంది.

మ: సంస్కారమే (పూర్వవాసనలే) సంసారము (జనన మరణ చక్రము).

భ: అవును సర్వమూ వాసుదేవమే. ఈ సత్యాన్ని మరచిపోయాము. అందుచేత జీవేశ్వర ఐక్యాన్ని గుర్తించ లేకున్నాము.

మ: మరపు ఎక్కడున్నది?

భ: స్వప్నంలో వలె.

మ: ఎవరి స్వప్నం?

భు జీవునిది.

మ: జీవుడెవరు?

భ: పరమాత్మునివాడు.

మ: అయితే పరమాత్మగదా ప్రశ్నించవలసింది?

భ: ఒక ఉదాహరణమిచ్చి నా సంశయాన్ని స్పష్టం చేస్తాను.

మ: సందేహం స్పష్టతకై ఉదాహరణ కోరినదెవరు? ప్రత్యక్షానికి వేరే ఉదాహరణలు, వివరణాలెందుకు?

భ: ప్రత్యక్షంతో గూడ విస్మృతీ ఉందికదా.

మ: మరువబడినది ఏది? మరచిన దెవరు?

భ: వినండి. ఒకడు కలగంటాడు. మేలుకోగానే ఆ స్వప్న ప్రపంచము కరగిపోతుంది.

మ: అలాగే ఇప్పటి స్వప్నమునుండి మేలుకో.

భః ప్రకృతి చాలా బలీయము.

మ: పురుషుని గూడ పరికించు. అప్పుడు ప్రకృతి ఏమి చేయగలదు?

భ: వారిమధ్య గ్రంథి (ముడి) ఉంది.

మ: ఎవరిదా ముడి? ప్రకృతిదా, పురుషునిదా, ఇద్దరిదీనా?

భ: దానికి బ్రహ్మ కారణం.

మ: అప్పుడు బ్రహ్మమన్నా అడగాలి లేదా, బ్రహ్మమునన్నా అడగాలి. స్వప్నముకాని, గ్రంథికాని ఎవరికి? నీవెప్పుడూ పలికినా 'నే నడుగుతున్నా'నంటావు. ఆ 'నే'నెవరు?

భ: నాకు తెలియడం లేదు.

మ: 'నేను' నిత్యము. అది ఏదన్నా విశిష్టము, విభిన్నమూ అయితే, అది మాయమౌతుంది. అది పూర్ణము. కనుగ విషయంగా గోచరించదు.

భ: కాని నేను పూర్ణుణ్ణిగాను.

మ: ఇప్పుడు అపూర్ణతను గురించి ఎందుకు పట్టుకు రావడం? నీవు పూర్ణుడవు ఎందుకు కావు? నిద్రలో నీ అసంపూర్ణత జ్ఞప్తి వచ్చిందా? అట్లే ఇప్పుడూ ఏకాగ్రతయే అన్ని సాధనల ఫలం. ఒకరికి తొందరగా రావచ్చు. ఇంకొందరికి చాలా కాలం పట్టవచ్చు. అన్నీ సాధనమీద ఆధారపడి ఉన్నాయి.

భః శాంతియే అన్నిటికంటే గొప్పదని ప్రశంశించబడినది. దానిని పొందేదెలా?

మః శాంతి నీ స్వభావం (స్వరూపం) మరచిపోవడం అనేది ఆత్మను ఎప్పటికీ కప్పివేయలేదు. ఆత్మ, అనాత్మతో తప్పుగా కలిపివేయబడి, ఆత్మ మరుపు గురించి, శాంతి మొదలైన వాటి గురించి మాట్లాడుతున్నావు. ఈ తికమక (confusion) అంతమొందిస్తే మరపు ఎప్పటికీ తల ఎత్తదు.

భ: అదెలా చెయ్యాలి?

మ: ఆత్మవిచారమే. నిదిధ్యాస అంతే మనోవృత్తుల నరికట్టడం అన్నమాట. ఆత్మవిస్మృతి, దేనిని? ఆత్మనేనా? అలా అయితే ఆత్మలు రెండుండాలి, లేవుగా? అంచేత సాధన తొలగించేది సంస్కారాలనే.

భ: కాని సంస్కారాల కంతులేదు, విరతి లేదు - అనాది కాలం నుండీ అంతే.

మ: ఇదిగూడ ఒక సంస్కారమే. ఆ భావం విడనాడు; అన్ని సంస్కారాలు వెంటనే వీడిపోతాయి. అదీ విశ్రాంతి, శాంతి. శాంతి ఎప్పుడూ ఉన్నదే. కాని దానిని నీవు అణచిపెట్టి దానిపై నేమేమో పేర్చి, దాన్ని చెడగొడ్తావు. అది మొదలు 'నాకు శాంతి కావాలి, శాంతి కావాలి' అంటావు.

భ: శాంతి క్రమంగా కలిగేదా?

మ: అవును, మనస్సును క్రమక్రమంగా, మెల్లమెల్లగా స్థిరంచేయి. 'శనైశ్శనై రుపరమేత్' అంటుంది గీత.

అంత కొంత సేపటికి ఆ దర్శనార్థి, పోయిన 20వ తేది ప్రాంతంలో ఇచటికి శ్రీ జి. వచ్చి ఉండిరా అని అడిగాడు. ఆయనే తనకు మహర్షి విషయం తెలిపారట. ఇక్కడికి వచ్చిన పిదప శ్రీ జి.. చాలా ఆనందించారట.

మ: ఇచటికి వచ్చిపోయేవారి అందర్నీ నేను జ్ఞప్తి ఉంచుకోగలనా? ఆయన ఇచటికి వచ్చి ఉండవచ్చు. అందరూ ఆనందమయులే. నామము లేదు, 'రూపము లేదు ... వ్యవహార మాత్రానికి ఏదో పేరు.

దాకలి మిడుగురులు( SPARKS FROM THE ANVIL)

# భాషణములు 291

ప్రశ్న: పోయినసారి మీరు అత్యాశ్రము వర్ణాశ్రమ ధర్మాలను అధిగమించిన స్థితియని తెలిపారు. దానికి ఏమైనా ప్రమాణమున్నదా? దాన్ని ఎక్కడనైనా ప్రస్తుతించి ఉన్నారా?

మహర్షి: అవును -- ఉపనిషత్తులలో, సూతసంహిత (స్కందపురాణం), భారత, భాగవతాది గ్రంథాల్లో.

ప్ర: ఆ స్థితికేమైనా విధులు, నియమాలు ఉన్నాయా?

మ: దాని లక్షణాలను ఆ గ్రంథాలలో చెప్పారు.

ప్ర: ప్రతి ఆశ్రమంలోనూ గురువులున్నారు. అత్యాశ్రమమునకూ గురువు ఉన్నారా?

మ: ఉన్నారు.

ప్ర: కాని మీరు గురువు ఉన్నారని ఒప్పుకోరు కదా!

మ: ప్రతివానికినీ గురువు వుంటారు. నాకు గూడ గురువు ఉన్నారని ఒప్పుకుంటాను.

ప్ర: మీకు గురువు ఎవరు?

మ: ఆత్మ.

ప్ర: ఎవరికి?

మ: నాకే, గురువు బాహ్యంగా వుండవచ్చును, అంతరంగానూ ఉండవచ్చు, లోపల గోచరించవచ్చు. బయట బోధించవచ్చు.

ప్ర: అత్యాశ్రమములకు ఆస్తి ఉండవచ్చునా?

మ: వారికెట్టి నిషేధమూలేదు. వారికి నచ్చినది చేయవచ్చు. శుకుడు పెండ్లియై బిడ్డలను కన్నాడని ఉన్నది.

ప్ర: అలా అయితే అత్యాశ్రమి గృహస్థుడౌతాడు.

మ: ఆయన వర్ణాశ్రమముల కతీతుడని ముందే చెప్పాను.

ప్ర: వారు పెండ్లాడి, స్వంత ఆస్తులను పెట్టుకుంటే, వారు గృహస్థులౌతారు.

మ: అని మీ దృష్టి

ప్ర: వారాస్తి పెట్టుకొని వేరే వారికి ఇవ్వడం అవీ చేయవచ్చా?

మ: చేస్తారో, చేయరో అది వేరే మాట. అంతా వారి ప్రారబ్ధంపై ఆధారపడి ఉంది.

ప్ర: వారికి కర్మ ఉందా?

మ: వారి వర్తనం ఇట్లు అట్లు అని విధించే శాస్త్రాలు లేవు, సూత్రాలూ లేవు.

ప్ర: ఆగంతకులు ఇక్కడ రెండుమూడు రోజులు ఉండాలంటే వారు మీ అనుమతి తీసుకుంటారా?

మః ఆశ్రమమును నిర్వహించేవారి అనుమతి, నా అనుమతియే. వచ్చేవారు నా కొరకు వస్తారు. పాలకవర్గం నా కొరకే. పరస్పరాంగీకారం ఉండేటప్పుడు నేను ఏ జోక్యం కలిగించుకోను. ఎవరైనా చూడటానికి వచ్చి, నా అనుమతి పొందితే నా ఇచ్ఛకు విరుద్ధంగా పోయే సాహసం ఎవరికి ఉంటుంది? పరస్పరాంగీకారంతో జరిగే పనులన్నిటిలో నా అనుమతి అంతర్భూతమయ్యే ఉంటుంది.

భగవాన్ స్వఅక్షరాలతో సుబ్రహ్మణ్యులుగా పేర్కొంటూ రచించిన శ్లోకాన్ని వారు భగవాన్కే చూపించారు.

మ: హస్తాక్షరములు నావేగాని, భావములు పెరుమాళ్ స్వామివి.

ప్ర: తామందలి భావం అంగీకరింపరా?

మ: ఒక విగ్రహాన్ని సుబ్రహ్మణ్యునిగా స్తుతించినట్లే.

# భాషణములు 292

భక్తుడు: కలలో ప్రవర్తించేవి తన్మాత్రలా?

మహర్షి కావు. తన్మాతలు సూక్ష్మతరములు. జాగ్రత్తులోని స్థూల ప్రపంచంతో పోల్చినపుడు, మనఃకల్పనలు సూక్ష్మములేగాని, తన్మాత్రలతో పోలిస్తే వానిని స్థూలములనాలి. పంచీకరణం తర్వాత, తన్మాత్రలు అంతఃకరణానికి

కారణమౌతాయి; అచటగూడా వేర్వేరు కారణ పరంపరవల్ల, ఆకాశాధిక్యంవల్ల, సత్త్వం వల్ల ప్రభావితమై అవి జ్ఞానాన్ని జనింపచేస్తాయి. జ్ఞానస్థానము మెదడు.

వాయువు వలన మనస్సు, తేజస్సు వలన బుద్ధి, జలమువలన చిత్తము (స్మృత్యాదులు) పృథివి వలన అహంకారము పుడతాయి. వానిని సమష్టిగనే పరిగణించాలి. ఎందుకంటే అవి వ్యష్టిగా సమష్టిగా కూడ, దేహేంద్రియావయవములతో, విడివిడిగాకాని అన్నిటితోగాని వ్యవహరిస్తాయి. రజోగుణమువల్ల తన్మాత్రలు వ్యష్టి (వ్యక్తి)యందు జ్ఞానేంద్రియములుగా మారుతాయి. తమోగుణం వానిని వ్యష్టిలోని కర్మేంద్రియములుగా మారుస్తుంది. వ్యక్తికీ, బాహ్య ప్రపంచానికీ తన్మాత్రలు సమానములే గనుక, వారి సంబంధములు సులభం అవుతుంది.

తన్మాత్రలు వెలువడటం ప్రకృతినుండి. సృష్టిని వర్ణించే శాస్త్ర వాక్యాలు ఎంతెంతగానో భేదిస్తాయి. సృష్టి యుగపత్ అని కొందరు; కాదు క్రమమని మరి కొందరూ, ఇందు ప్రాధాన్యము సృష్టికిగాదు, దాని మూలానికి.

## భాషణములు 293

శ్రీ కె.కె.వి అయ్యర్: ధ్యానము వలన మేము అంతర్ముఖులమయ్యే త్రోవ కనబడటం లేదు.

మహర్షి: ఇప్పుడు మరెక్కడున్నాము? మన ఉనికి అదే గదా?

భ: కావచ్చు. నాకది తెలీదు.

మ: తెలియనిది ఏమి? తెలియని వాడెవరు? ఆత్మను తెలియదంటే, ఆత్మలు రెండున్నాయా?

భ: ఆత్మలు రెండు లేవుగాని, ఏవో పరిధుల మధ్యనే ఉన్నామనే భావం (feeling of limitation) కాదనలేము. ఈ పరిమితులవలన --

మ: పరిమితి మానసికం. గాఢ నిద్రలో అట్లనుకొన్నావా? అప్పుడూ నీవున్నావు. అప్పుడు నీవున్నావనటంలో సందేహం లేదు. మెలకువలో ఇప్పుడున్నది ఆ నీవే, ఆ ఆత్మవే. పరిధులున్నవని ఇపుడంటున్నావు. ఈ భేదం సుషుప్తి, జాగ్రత్తుల నడుమ కలిగింది. దానికి కారణం మనస్సు. నిద్రలో మనస్సు లేదు. అది ఇప్పుడు ప్రవృత్తమయి ఉంది. మనస్సు లేనప్పుడు కూడా ఉండేది ఆత్మ.

భ: అది తెలుస్తున్నది గాని, అనుభవంలోకి రావటం లేదు.

మ: ధ్యానం సాగేకొద్ది అదే మెల్ల మెల్లగ వస్తుంది.

భ: ధ్యానం మానసికం కదా. ధ్యానం ప్రయోజనం ఆత్మను తెలియచేసేందుకే.. అయినా అది మనస్సునెట్లు నాశం చేస్తుంది.

మ: ధ్యానం అంటే ఒక ఆలోచనను అంటిపెట్టుకోవడం. ఆ ఏకచింతన ఇతర తలపులన్నిటినీ దూరం చేస్తుంది. విక్షేపము మనోదౌర్బల్యం తెలుపుతుంది. ధ్యానం వదలకుండా చేస్తే మనస్సు దృఢపడుతుంది. అంటే చలచిత్తము యొక్క దౌర్బల్యం స్థానంలో, భావశూన్య సద్భావ సుస్థితి ఏర్పడుతుంది. తలపులు లేని ఈ విశాలాకాశము, ఆత్మ. శుద్ధస్థితిలో మనస్సు, ఆత్మయే

అంతకు పూర్వము ఒకరు అడిగిన ప్రశ్నకు సమాధానంగా భగవాన్ అన్నారు -- ప్రతి ఒక్కడూ 'నేను దేహమంటాడు. ఆ అనుభవము జ్ఞానికీ అజ్ఞానికి గూడా సమమే. కాని అజ్ఞాని ఆత్మ కేవలం దేహానికే పరిమితం అనుకుంటాడు. జ్ఞాని ఆత్మకు వేరై దేహముండలేదని తెలిసికొని ఉంటాడు. అతనికి, ఆత్మ అనంతము; దానిలో దేహంగూడ ఇమిడే ఉంది.

బోస్: భగవాన్ సన్నిధిలో శాంతి వ్యాపించి ఉంటుంది; కాని అది మాలో కొద్దికాలమే ఉంటుంది. అదేల శాశ్వతంగా నిలబడడం లేదు.

మహర్షి: ఆ శాంతియే నిజమైన స్వభావము. దానికి ప్రతికూలమైన భావాలన్నీ ఆరోపితాలే. ఆ శాంతియే నిజమైన భక్తి, నిజమైన యోగము, నిజమైన జ్ఞానము. అభ్యాసము వల్లనే ఈ శాంతి లభిస్తుందని మీరనవచ్చు. అభ్యాసంలో ఇలాంటి తప్పు భావాలు వదలిపోతాయి. అంతే, నీ యథార్థ స్వరూపం నిలిచే ఉంటుంది. ఈ మెరుపులు రాబోయే ఆత్మసాక్షాత్కారానికి చిహ్నాలు మాత్రమే.

మొదటి పృచ్ఛకుని కిట్లన్నారు -- హృదయమే ఆత్మ. అది లోనా లేదు, వెలుపలా లేదు. దాని శక్తి మనస్సు. మనస్సు పుట్టిన వెనుకనే జగత్తు కనబడుతుంది. దానిలో భాగంగా దేహం గోచరిస్తుంది. నిజానికివన్నీ ఆత్మలోనివే; దానికి వేరుగా వానికి ఉనికే లేదు.

## భాషణములు 294

శ్రీపర్కి: ధ్యానం అభ్యసించే దెలా?

మహర్షి: ధ్యానం యథార్థంగా ఆత్మనిష్ఠ, (ఆత్మలో నిలబడి ఉండడం) కాని మనస్సులో ఆలోచనలు వచ్చి వానిని తొలగించే ప్రయత్నము చేస్తే ఆ ప్రయత్నమే ధ్యానము. ఆత్మనిష్ఠయే నీ నిజమైన స్వభావము. నీవు ఉన్నట్లే ఉండు. అదే దాని లక్ష్యము.

భ: కాని ఆలోచనలు వస్తూనే ఉంటాయి. ప్రయత్నము వానిని తొలగించడానికి మాత్రమేనా?

మ: అవును. ధ్యానం ఒకే ఒక ఆలోచనపైనే గనుక, మిగత ఆలోచనలన్నీ దూరం చెయ్యబడతాయి. ఆలోచనలను దూరంగా ఉంచడం వరకు వస్తే, ధ్యానం నిషేధ రూపమే.

భ: "ఆత్మసంస్థం మనఃకృత్వా" (మనస్సును ఆత్మలో నిలుపు) అన్నారే. ఆత్మను గురించి ఆలోచించలేము కదా?

మ: ధ్యానింపవలెనన్న కోరిక నీ కెందుకు కలిగింది? నీవు ధ్యానింపదలిచావు గనుక "ఆత్మ సంస్థం మనః కృత్వా" అన్నారు. ధ్యానించకుండానే నీవుగా ఉండి పోరాదూ? ఆ మనస్సేమి? ఆలోచనలు నిర్మూలమైనప్పుడు కలిగేది ఆత్మ సంస్థమే.

భ: ఏదైన రూపమున్నదైతే దాన్ని ధ్యానిస్తూ, ఇతర ఆలోచనలను మానవచ్చు. కాని ఆత్మకు రూపులేదే?

మ: రూపములపై, స్థూల వస్తువులపై చింతనను ధ్యానమంటారు. - ఆత్మవిషయకమైతే దానిని విచారమనీ, నిదిధ్యాసయని పేర్కొన్నారు.

'అధ్యారోప అపవాదాభ్యామ్' (ఆరోపము, దాని నివారణము) అన్న దానిని - వివరిస్తూ భగవాన్ అందు మొదటిది నిన్ను అంతర్ముఖునిగా ఆత్మాభిముఖునిగా చేస్తుంది. రెండవ దానివలన జగత్తు ఆత్మకు భిన్నంకాదని తెలిసికొంటావు.

## భాషణములు 295

శ్రీ నట్వర్లాల్ పారీఖ్, ఒక గుజరాతీ. ఇంటర్నేషనల్ రిలిజియస్ కాన్ఫరెన్సుకు బరోడా ప్రతినిధిగా వెళ్ళాడు. అతడు భగవాన్ను చూడడానికి వచ్చాడు. యువకుడు, నాగరికుడు. తాను సక్రమంగా సాధించిన విద్యాది అర్హతలను గుర్తుంచుకొని మెలిగేవాడు. భగవాన్కు తన ప్రశ్నల తోడి పత్రాన్ని ఒకటి అందచేసాడు.

భక్తుడు: ఆత్మ, పరమాత్మ, సచ్చిదానందములను అనుభవగోచరం కావించుకోవడానికి నాకు దయచేసి సహాయం చేయండి.

మహర్షి: ఆత్మ, పరమాత్మ, సచ్చిదానంద - ఈ పదాలన్నీ సమానార్థకాలు. అన్నీ ఆత్మను తెలిపేవి. ఆత్మ నిత్యానుభవము. కాకపోతే, దానివల్ల సంతోషమే లేదు. అది నిత్యం కాకపోతే, దానికి ఆరంభము కావాలి. మొదలైనది, అంతమవక తప్పదు; అంటే అది తాత్కాలికము. నశించేదాని కొరకు ప్రయత్నించడంలో ప్రయోజనం లేదు. కోరవలసింది అయత్నసిద్ధము, అప్రమత్తము అయిన శాంతి. ఎరుక ఉండి, యత్నం లేని స్థితి ఆనందము; అదే ఆనందానుభూతి.

భ: బుద్ధిచేతనే గ్రహింపతగ్గ సమాధానాలు నాకవసరం లేదు. నేను కోరేవి ఆచరణ యోగ్యాలు.

మ: అది సరి. ప్రత్యక్ష జ్ఞానానికి పాండిత్య చర్చలతో పనేమి? ప్రతివానికి ప్రత్యక్షమే గనుక, అట్టి వాదాలు అనవసరం. ప్రతియొక్కడూ 'నేనున్నా'ననే అంటాడు అంతకంటే అనుభూతి మరేమి?

భ: నాకది స్పష్టంగా లేదు.

మ: నీవున్నావు. నీవు 'నేనున్నా'ననే అంటావు. అది ఉనికి కదా?

భ: నేనున్నది నిజమేనని, నేను నిశ్చయంగా చెప్పలేను.

మ: ఓహో, అలాగా? అయితే ఇప్పుడు మాట్లాడే దెవరు?

భ: నిస్సందేహంగా నేను. కాని, నా ఉనికి నిశ్చయ మనలేను. నే నున్నానని ఒప్పుకొన్నంత మాత్రాన ప్రయోజనమేమి?

మ: ఉనికి లేదనడానికైనా ఒక వ్యక్తి ఉండాలి. నీవు లేకపోతే పృచ్ఛకుడు లేడు. మరి ప్రశ్న ఎక్కడిది?

భ: మాటవరసకు నేనున్నాననే ఒప్పుకుంటాను.

మ: నీవున్నావని నీకెట్లు తెలుసు?

భ: నేను యోచిస్తాను, అనుభవిస్తాను, చూస్తాను ... గనుక.

మ: అంటే ఆయా చేష్టలవల్ల నీ వునికి నూహిస్తావు. అంతేనా? అదీగాక, ఈ అనుభవాలు నీ నిద్రలో లేవు, అయినా వ్యక్తి ఉన్నాడు.

భ: కాదు, నిద్రలో నేనున్నానని చెప్పలేను.

మ: నిద్రలో నీవు లేవంటావా?

భ: ఉండవచ్చు, లేకపోవచ్చు. దేవుడికే తెలియాలి.

మ: నిద్రనుంచి లేచాక, నిద్రింపకపూర్వం ఏమేమి చేశావో జ్ఞప్తి ఉంటుందా?

భ: నిద్రకు పూర్వమూ, తర్వాత, నే సున్నాననగలనుగాని, నిద్రలో నేనున్నానో లేనో చెప్పలేను.

మ: నీవు నిద్రించావని ఇప్పుడంటున్నావా?

భ: అవును.

మ: నిద్రావస్థ జ్ఞప్తి లేకుంటే, అదెట్లు తెలుసు?

భ: దానిని బట్టి నేను నిద్రలో ఉన్నానని ఎట్లు నిశ్చయించటం? అది అంగీకరించి నందువల్ల ప్రయోజనమేంటి?

మ: అంటే నిద్రవచ్చినపుడెల్లా మనిషి మరణించి మెలకువ రాగానే తిరిగి జీవిస్తాడనీ నీ దృష్టా?

భ: కావచ్చు. నిజమేదో దేవునికెరుక.

మ: అట్లైతే దైవాన్నే రానీ, ఈ క్లిష్ట సమస్యపరిష్కారానికి.

నిద్ర అంటే మరణించినట్లయితే, నిద్ర అంటే భయపడిపోవాలి. ఎందుకంటే మరణమంటే భయం కాదా! కాని వాడు చేసేది పూర్తిగా విరుద్ధం. నిద్ర కావలెనని కోరుకుంటాడు. నిద్రనెందుకు కోరుకోవడం, దానివల్ల సుఖం లేకపోతే?

భ: నిద్రలో సుఖము నిశ్చయమనలేము. శారీరకమైన అలసట పోతుందని నిద్రను కోరుకుంటాము. అంతే.

మ: సరి. అదీ మంచిదే. “శ్రమపోవడానికి” శ్రమలేని వ్యక్తి ఒకడున్నాడన్నమాట.

భ: అవును.

మ: అయితే నీవు నిద్రలో వున్నావు, ఇప్పుడూ ఉన్నావు. ఆలోచనాదులు లేకుండా నిద్రలో నీవు సుఖంగా వున్నావు. ఆ వ్యక్తే ఇప్పుడు ఉన్నాడు. మరి నీకు సుఖం ఎందుకు లేదు?

భ: సుఖముండినదని ఎలా చెప్పగలరు?

మ: సుఖం, అహం, అస్వాప్సమ్ (నేను సుఖంగా నిద్రించేను) అని ప్రతి వ్యక్తి అంటాడు.

భ: వారు చెప్పేది సరి అని నేను అనుకోను. సుఖం లేదు, దుఃఖాభావము మాత్రమే.

మ: నీ వునికియే ఆనందం, కనుకే, ప్రతివాడూ ఆనందంగా నిద్రించాననటం, దాని అర్థం. వాడు ఆద్యమూ నిష్కలుషమూ అయిన స్థితిలో ఉన్నాడన్నమాట. దుఃఖమా అది లేదు. అది నిద్రలో లేదని ఇప్పుడు చెప్పేందుకు అది యేదీ? అయథార్థమయిన ఇప్పటి దేహాత్మ బుద్ధియే అన్ని తప్పిదాలకూ కారణం. దేహంలో ఆత్మ యొక్క మిథ్యాతాదాత్మ్యమే అన్ని పొరపాట్లకు కారణం.

భ: నాకు కావలసింది ఆత్మానుభవం. సహజ, ఆనందస్థితిని దేనినీ నేను అనుభవించడం లేదు.

మ: ఎందుకంటే ఇప్పుడు ఆత్మ, అనాత్మతో తాదాత్మ్యం చెందింది కనుక. అనాత్మగూడ ఆత్మకు వేరుగాదు. కాని దేహం వేరని ఒక అపోహ ఉంది. ఆత్మను దేహంగా భ్రాంతి పడుతారు. ఈ మిథ్యాసామ్యాన్ని పోగొట్టితేనేగాని, ఆనందం అభివ్యక్తమవదు.

భ: నాకు నేను సహాయం చేసుకోలేకపోతున్నాను.

అక్కడున్న ఇంజనీరు గురువును శరణుగోరరాదా అన్నాడు. నట్వర్లాల్ అందుకు సిద్ధమే అన్నాడు.

మ: నీ స్వభావమే ఆనందం. అది స్పష్టంగా లేదని నీవంటావు. నీ నిజస్వరూపాన్ని అడ్డేదేమో చూడు. ఆ ఆటంకము మిథ్యాసామ్యమని తెలిపినాను. ఆ తప్పు సవరించుకో. మందును ఇచ్చేది వైద్యుడైనా పుచ్చుకోవలసింది రోగియే. కాకుంటే వాని వ్యాధి నయమయ్యే దెలాగ?

భ: రోగి తనకు తాను సాయపడలేనంత నీరసంగా ఉన్నాడు. అందుచేత బేషరతుగా తన్ను వైద్యున కప్పగించుకొన్నాడు.

మ: పూర్తిగా స్వతంత్రంగా పనిచేసే హక్కును వైద్యునకీయాలి. రోగి మారు మాటాడక నిశ్శబ్దంగా, ఊరకే ఉండాలి. అలాగే ఊరకే ఉండు. ప్రయత్నం లేకపోవడమంటే అదే.

భ: ఉత్తమ గుణ మిచ్చే మందదే.

అతడు వ్రాసి ఇచ్చిన ఇతర ప్రశ్నలు

భ: దైవమున్నాడని నేను నమ్మేటట్లు చేయండి.

మ: ఆత్మలబ్ధి అట్టి విశ్వాసానికే సమానం.

భ: ప్రారబ్ధానికి పురుషకారానికి సంబంధ మెట్టిది?

మ: ప్రారబ్ధము, కర్మ. దానికొక కర్త యుండాలి. ఆ కర్త ఎవరో చూడు. పురుషకారము, యత్నము. యత్నించేదెవరో చూడు. ఆ స్వరూప నిర్ణయం అవుతుంది. వాని సంబంధం తెలియగోరే వాడే స్వయంగా సంబంధం.

భ: కర్మయేమి, పునర్జన్మ యేమి?

A1 : కర్తను కనుగొంటే కర్మ స్పష్టమౌతుంది. ఇప్పుడు నీవు జన్మించియుంటే పునర్జన్మ తప్పదు. ఇప్పుడు నీవు పుట్టియున్నావేమో చూడు.

భ: జ్యోతిని దర్శించడానికి నాకు సహాయం చెయ్యండి.

మ: దర్శనానికి ద్రష్టయొక డుంటాడు. వానిని కనుక్కో ద్రష్టలోనే దర్శనం ఇమిడి ఉంది.

## భాషణములు 296

పూవన్ అని ఒక గొల్ల, ముప్పై ఏండ్లుగా, భగవాన్ విరూపాక్షగుహలో ఉన్ననాటినుంచి తనకు తెలుసన్నాడు. ఆ రోజుల్లో వచ్చేపోయేవారికి అప్పుడప్పుడు పాలు ఇచ్చేవాడు.

ఆరు యేండ్లక్రితం వాని గొర్రెయొకటి తప్పిపోయింది. దానికై మూడు రోజులు వెదికాడు. అది చూలుతో ఉంది. ఏ క్రూరజంతువు వాతబడిందో అని దాని ఆశ వదులుకొన్నాడు. ఒకనాడు ఆశ్రమ మార్గంగా వెడుతుంటే భగవాన్ వానిని చూచి క్షేమం విచారించారు. వాడు తప్పిపోయిన గొర్రెకై కొండంతా గాలిస్తున్నానన్నాడు. ఎప్పటిలాగే భగవాన్ ఊరుకున్నారు. కొంతసేపయ్యాక భగవాన్, రాళ్ళు కొన్ని - ఎత్తడానికి వాని సాయమడిగారు. వాడెంతో సంతోషంతో సాయపడ్డాడు. పనికాగానే భగవాన్ వానికి ఊళ్ళోకి వెళ్ళే ఒక కాలిబాట చూపి "ఈ దారిన వెళ్ళు. పోయిన నీ గొర్రె దారిలో కనిపిస్తుంది" అన్నారు. వాడటే వెళ్ళుతుంటే మార్గంలో రెండు పిల్లలతో సహా వాని గొర్రె కనబడింది.

అది చెప్పి వాడన్నాడు "ఏం భగవానయ్యా! ఆయన మాట శక్తి చూడు. ఆయన చాల మహానుభావులు. నావంటి బీదనుగూడ వారెన్నడూ మరచిపోరు. నా కొడుకు మాణిక్యం గూడ వారికి జ్ఞాపకమే. మహాత్ములంతటి దయగలవారు. ఆవులు ఎండలో ఉండేప్పుడు వానిని గుమనించుకోవడంలాంటి చిన్న పనులు వారికై చూసి పెడుతుంటే కూడా నాకెంతో సంతోషంగా ఉంటుంది."

## భాషణములు 297

కోహెన్: ధ్యానం మనస్సుతో, మేలుకొని యున్నప్పుడు. స్వప్నంలో గూడ మనస్సున్నది. ధ్యానం అప్పుడెందుకు లేదు? అది అసాధ్యమా?

మహర్షి: ఆ ప్రశ్నను కలలో అడుగు.

కొంతసేపాగి, భగవాన్ పలుకసాగారు. నిన్ను ఇప్పుడు ధ్యానించి నీవెవరో చూడమన్నారు. నీవది చేయక, కలలో నిద్రలో ధ్యానం లేదేమని అడుగుతావా? ఆ మెలకువ ఎవరికో తెలుసుకుంటే, కల నిద్రలుగూడ వానికే అని స్పష్టమవుతుంది. ఈ మూడవస్థల్లో నీవు సాక్షివి; అటుగాకున్నా, అవి నీ ఎదుటే గడచిపోయేవి. ఇప్పుడు ధ్యానం చేయటంలేదు గనుకనే ఈ ప్రశ్నలు, ధ్యానం చెయ్యి ఈ ప్రశ్నలు వస్తాయేమో చూడు."

## భాషణములు 298

భక్తుడు: ధ్యానం విచారంకంటె సూటియైనది. ధ్యానం సత్యాన్నే అవలంబించి ఉంటుంది. విచారం సత్యం, అసత్యముల వివేచనతో త్రొక్కిసలాడుతుంది.

మహర్షి: ప్రారంభంలో ఒక రూపంపై ధ్యానం నిల్పడం తేలిక, అనుకూలము గూడ. అభ్యాసం, సత్యాన్ని అసత్యం నుండి వేర్పరచే ఆత్మవిచారానికి మళ్ళిస్తుంది.

పరస్పర విరుద్ధభావాలలో చిక్కుపడి యున్నప్పుడు సత్యాన్నే పట్టుకొని ఉంటే మాత్రం ప్రయోజనం మేంటి?

ఆత్మవిచారం ఆటంకాలు తొలగించి, అంటే ఇప్పటికే నీకున్న ఆత్మానుభవం లేదన్న భావం పోగొట్టి, ఆత్మస్థితిని చేరుస్తుంది.

## భాషణములు 299

శ్రీ టి.కె.ఎస్. అయ్యర్ భగవాన్ను శబ్దత్పత్తిని (శబ్దం యొక్క మూలం) గూర్చి అడిగారు.

మహర్షి: వెన్నుపూస అట్టడుగున మూలాధారంనుండి 'పరా' (శబ్దం) వెడలుతుందని సామాన్యంగా అనుకొంటారు. 'వైఖరి' (ఆలోచనల రూపంలో) మొదలు శబ్దాలన్నీ కుండలిని నుండి ప్రసృతములయ్యే 'పరా'లోనివే. కుండలిని హృదయాని

కన్యంగాదు. నిజానికి షడాధారమెల్లా హృదయమందలిదే. కుండలిని మూలంగాగల సుషుమ్న హృదయంలో కలిసి ఉంది. ఆగంతకుడు - "అంతరేణ తాలుకే సేంద్రయోనిః" ఆ విషయం తెలుసుకోవలెనని ఉంది.

మహర్షి: ఇంద్రయోని, సుషుమ్నానాడితోగూడ, 'పరా'లో అంతర్గతమే.

## భాషణములు 300

ఒక యువ బ్రహ్మచారి, సైన్సులో పట్టభద్రుడు, గత నాలుగయిదు మాసాలుగా భగవాన్ అనుగ్రహానికై కాచుకొనియున్నాడు. పండినపండు చెట్టునుండి రాలేట్టుగా ఏదో ఒక ఉద్యోగం వాని ఒడిలో రావలెనని కోరిక. ఉద్యోగానికై మరే యత్నాలూ అతడు చేయలేదు. నిన్నసే అతని సోదరుడు, తల్లితండ్రులవద్ద కతన్ని తీసుకొని

పోవడానికై వచ్చాడు. అతడు రానన్నాడు. వాని సోదరుడు భగవాన్తో మొరపెట్టాడు. మహర్షి: 'నే నెవరిని రమ్మనను, పొమ్మనను. ఇక్కడ ఎవరి యిష్టం వారిదే. హాలులో అతనికి శాంతిగా ఉన్నదంటాడు; ఉద్యోగమూ కోరుతాడు. అతని శాంతి చెదరరాదంటే, వానికి హాలులోనే ఉద్యోగం దొరకాలి. శాంతి ఉన్నది హాలులోగాదు. అది ఆత్మసంస్థితిలో ఉంది. అది ఎక్కడున్నా దొరకేదే."

తరువాత కొన్నాళ్ళకా యువకుడు జందెం తీసివేసాడు. ఒకసారి కాళ్ళూ చేతులూ కంపిస్తుండగా అతడు భగవాన్ ఎదుటికి వచ్చాడు. అది తన ఆనందలక్షణమని తర్వాత ఎవరితోనో అన్నాడు. తన ఎదుట కూర్చొనే అలవాటు మానయ్యేమని, తన ఎదుటనుండి తొలగుమని భగవాన్ వానిని శాసించారు. ఇంకా యిట్లన్నారు. .. "క్రొత్తగా పుట్టిన పిల్లలనుగూడ వాటికి రెక్కలు వచ్చేంతవరకే పక్షి తల్లితండ్రులు పోషిస్తాయి. కలకాలమూ వాటిని పోషిస్తూనే ఉండవు. అలాగే భక్తుల విషయంలోనూ, నేను దారి చూపాను. దాని ననుసరించే శక్తినీకుంది, నీ వెక్కడున్నా శాంతిని పొందడానికి సమర్థుడుగా ఉండాలి."

ఇది భగవాన్ తనకిచ్చిన ఉపదేశంగా ఆ యువకుడు భావించాడు. "అహము"ను ఎవరికి వారే అణచవలె"నన్నట్లుగా దాన్ని అర్థం చేసుకున్నాడు.

ఊరిలోని ఒక పాఠశాలలో ఉద్యోగమిస్తామంటే అతడంగీకరించలేదు. అరుణాద్రి లేదా భగవాన్ తనకు గురుతరమైన ఉద్యోగమిచ్చారని వాని తలంపు.. ఆ ఉద్యోగ స్వరూపమెట్టిదో ప్రపంచం క్రమక్రమంగా తెలుసుకోగలదనేవాడు. ఈ రోజు జరిగినవన్నీ తనకు కొన్ని నెలల క్రితమే తెలుసనీ, తల్లికీ మిత్రులకూ ఇది ముందే తెలిపియున్నానని అన్నాడు. తెలుపడమే గాదు నాటి ఘటనలు తన కానందాన్నే కల్గించినవన్నాడు.

భగవాన్ మాత్రం వాని నింకొకనితో పోల్చారు. ఆ రెండవవాడు సరియైన మార్గంలో ఉన్నవాడు కాడు. అప్పటికే ఆ కుర్రవాడు తాను గర్భంలో ఉన్న భగవాన్ అనుకొనేవాడు. కొన్నాళ్లకతడు పిచ్చివానిగా మారి, చనిపోయాడు.